ఓమ్ !

# ఆంధ్ర
# కథాసరిత్సాగరము.

## కథాపీఠలంబకము. ౧.

---:o:---

### ప్రథమ తరంగము

శ్రీ మహితంబుగా భువన సృష్టి యొనర్చి తదీయసంతత
క్షేమసమృద్ధు లెల్లఁ దనచే నభివర్ధిలుచుండ నిర్భర
ప్రేమనిధానమై నెలయు విశ్వవిభుండు శుభంబు లిచ్చుచున్
రామనృపాలు రాఘుకులరత్నము మాయువరాజు నోముతన్!

శా. శ్రీసూర్యక్షితిపాల పుణ్యఫలలక్ష్మీ చిన్నమాగర్భవా
రాశిన్ బూర్ణకళావిరాజిత లస ద్దివ్యస్వరూపంబుతో
వాసం బుట్టిన రామరాయశశి విశ్వశ్లాఘ్య తేజోధిక
శ్రీసంపూర్తి వహించి మించుత బుధశ్రేణీప్రమోదంబుగాన్!

క. శ్రీదయితావల్లభుగతి
'వేదవతీ'పరిణయ పూర్ణవికచహృదబ్జా
మోదమునఁ దనియుఁ మా యువ
భూదేవేంద్రుండు లోకపూజ్యుం డగుతన్.

2

మ. జనకానందవిధాయి మాయునమహీజానీశ్వరుం డాఢ్యతన్
దన తోఁబుట్టులుఁ దమ్ములుఁ దమ్ముఁడున్ సుతులు నత్యంత ప్రమో
దంబుగా। ననుకూలస్థితి వర్ధిలన్ సకలభాగ్యశ్రీలఁ బెంపొంది
సజ్జన సమ్మాన్యయశఃప్రశస్తి శతవర్షంబుల్ ధరన్ బ్రోచుతన్!

సీ. శ్రీపీఠికాపురీ సింహపీఠికి మహా
మూల్యభూషణ మయి, మూర్తిఁ గొన్న
సుగుణసంపదవోలె శోభిల్లుచు మహాను
హౌదార్యమున జగదభినుతములు
సకల ప్రజోపకారకములు నగు ధర్మ
సత్కృతు లెన్నని సలిపి, విమల
యశము నార్జించుచు నాంధ్రభాషాదేవి
కాలంబనం బయి, యాశ్రితులకు

గీ. దేవభూరుహ మై, పరాధీనదీన
మానవాళికి దిక్కయి మనుచు రావు
సూర్యరాయమహారాజుసుతుఁడు రావ
రాయ భూమీశ్వరుఁడు శుభాకరంభుఁ గుత! 5

వ. అని యివ్విధంబున ననన్య సామాన్య మహనీయ గుణగణ విరాజ
మానుండును, సమస్త మహీమండలమండనాయమాన పీఠికా
పురీవర రాజ్య సంరక్షకత్వ దీనానాథజనరక్షణాది మహా
మహనీయగుణగరిష్ఠ శ్రీసూర్యరాయ మహామహీవల్లభ శ్రేష్ఠ
ప్రియపుత్రుండును, సుప్రశస్త పద్మనాయకక్షత్రియగోత్ర

పవిత్రుండును, నిజ మధుర కవితాపరితోషిత విబుధజనహృ
దయశతపత్రుండును, రావువంశవిస్తారకుండును, మదీయ
భర్తృదారకుండును నగు శ్రీగంగాధరరామారాయరాజన్య
వరేణ్యుం డఖండైశ్వర్యసంపన్నుండును ననూనాయురారో
గ్యాది భాగ్యభోగ్యాతిశయుండునుంగా నెంతయు దీపించి, 6

ఉ. రాజకుమారకత్వమున రంజిలుచుండియుఁ దా నొకింతయున్
రాజసవృత్తి లేక బుధరంజకుఁడై సముపాత్తవిద్యుఁడై
భూజన మాననీయ గుణభూషితుఁడై విలసిల్లు మామహా
రాజవరేణ్యసూనునకు రామనృపాలున కంకితంబుగాన్. 7

వ. కమనీయార్థ విశేష గంభీరం బైన కథాసరిత్సాగరంబు
నాంధ్రీకరింపం గడంగితి ; నది యెట్టి దనిన :— 8

ఆ. వె. కథలకెల్ల నాదికావ్యంబు, శ్రావ్యంబు,
నీతినిధి, సమస్తనియమ వనధి,
త్రిపురుషార్థదంబు, దేశవిజ్ఞానాది
సర్వవిషయ సార సంగ్రహంబు. 9

సీ. వేదజ్ఞులకు సర్వవేద సారంబు గా
శాస్త్రజ్ఞులకు ధర్మ శాస్త్రరీతి
నీతిజ్ఞులకు రాజనీతిమార్గంబట్లు
కావ్యజ్ఞులకు మహా కావ్యఫణితి
రసవిజ్ఞులకు నవరస నిధానముభాతి
భాషాజ్ఞులకు మహా భాష్యభంగిఁ

దంత్రజ్ఞులకు నవ్యతంత్రకల్పముపోల్కి—
గాథాజ్ఞులకుఁ జిత్రగాథవగిది

గీ. మఱియు నితరుల కీఁక నెన్నిమార్గములనొ
యభిమతంబయి హృదయంబు లలరఁ జేయఁ
దగిన దనుచు జగద్వినుత మయి నెగడె
సరస మగు నీ కథాసరిత్సాగరంబు. 10

ఉ. ఆది గుణాఢ్యనామక మహాముని దీనిఁ బిశాచభాష న
ష్టాదశలంబకంబులుగ సర్వమనోహరభంగిఁ గూర్చె; నా
మీఁద మహాకవీంద్రుఁడు సమీహిత సత్కృతి లబ్ధకీర్తిమ
న్యాదుఁడు సోమదేవవిబుధాగ్రణి మాఱిచెసంస్కృతంబుగాన్

క. పదునెనిమిది లంబకములఁ
బొదలుచు వివిధార్థ ధర్మబోధకమై యి
య్యది యష్టాదశ పర్వ ని
గదితం బగు భారతంబు కైవడిఁ దనరున్. 12

వ. అందుఁ బ్రథమలంబకంబు కథావతరణం బనియు, ద్వితీ
యంబు కథాముఖం బనియును, దృతీయంబు లావాణకం
బనియు, జతుర్థంబు నరవాహనదత్తజననం బనియుఁ, బంచ
మంబు చతుర్దారికాలంబకం బనియు, షష్ఠలంబకంబు మదన
మఞ్చుక యనియు, సప్తమంబు రత్నప్రభాలంబకం బని
యు, నష్టమంబు సూర్యప్రభాలంబకం బనియు, నవమం
బలంకారవతి యనియు, దశమంబు శక్తియశోలంబకం బని

యు, నేకాదశంబు బేతాళపంచకం బనియు, ద్వాదశంబు శశాంకవతీలంబకం బనియుఁ, దయోదశంబు మదిరావతీ లంబకం బనియుఁ, జతుర్దశంబు పంచలంబకం బనియుఁ, బంచదశలంబకంబు మహాభిషేకంబనియు, షోడశలంబకంబు సురతమంజరి యనియు, సప్తదశంబు పద్మావతీలంబకం బనియు, నష్టాదశంబు విషమశీలం బనియును విఖ్యాతంబులై విరాజిల్లుచుండు. 13

క. ఇందుఁ గల కథలె లోకము
నందుం గల విందు లేనియవి యుఁక వేత్తే
యెందును లేవని నొడువఁగ
సందేహింపఁ బనిలేదు చర్చించినచోన్. 14

సీ. కడఁగె సుబంధుఁ డీగ్రంథసందర్భంబుఁ
గొనికదే నిజకావ్యగుంఫమునకు?
బాణుఁ డేతత్కథాబంధంబుఁ గొనికదే
జగము నిజోచ్ఛిష్టముగ నొనర్చె?
కాళిదాసుఁడు దీనఁ గల గౌరవముననే
కదె యిమ్మహాకావ్యకథలఁ దడవె?
హర్షదేవుఁడు దీని హర్షించియేకదే
నవ్యకావ్యనిబంధనము నొనర్చె?
గీ. మఱియు నిఁక నెందఱో మహామహులు కవులు
దీనిఁ బూజించియేకదే దృశ్యములును

6

శ్రావ్యములు నగు సుమనోజ్ఞకావ్యములను
సృష్టిచేసిరి నవ రస పుష్టి గాఁగ? 15

సీ. వాసవదత్తా వివాహసందర్భ స
త్కావ్యాళి కిదె సూతికాగృహంబు
వెలయు రత్నావళీ ప్రియదర్శికాది దృ
శ్యగ్రంథముల కిదే జన్మభూమి
యల కళాపూర్ణోదయ గ్రంథకల్పనం
బుల కిదే మొదలింటి పుట్టకీటు
సప్తవింశతులు వింశతులు సప్తతు లను
వాసి కన్నిటి కిదే మేనమామ

గీ. యిది యది యటంచు నిఁక వచియింపనేల?
సంస్కృతాంధ్ర భాషాప్రపంచమున నున్న
కథల కన్నిటి కీయదే కన్నతల్లి
సారయుత మిక్కథాసరిత్సాగరంబు. 16

క. ఉర్విం బెఱ కథ లెవి యీ
సర్వజ్ఞోక్త మగు కథకు సాటి యగు? శ్రీవః
పర్వముగ దీని విని మీ
పూర్వ మనోవ్యథల మఱచిపోవుఁడు సుమతుల్! 17

ఉ. ఆయతకీర్తిశాలియు మహామహిమాఢ్యుఁడునై ధరిత్రి నాం
గ్లేయులకెల్ల వేల్పయిన క్రీస్తుమహాశయుకంటెఁ దొల్లి య

త్ప్రాయత పూర్వకాలమునయందె జనించిన యిమ్మహాకృతి
శ్రీ యది యెట్టిదో యరసి చేకొనుఁడయ్య! త్రిలింగపండితుల్!

చ. హరునకుఁ బుష్పదంతునకు నజ్జయునకు న్మహితాత్ముఁడైన య
వ్వరరుచికిన్ గుణాఢ్యకవివల్లభమాళికిఁ గాణభూతికిన్
ధర మఱియుఁ గథాకథనదక్షత నక్షయకీర్తిఁ గన్న ధీ
వరులకు నెల్ల భక్తి దయివాఱఁగ దోసిలియొగ్గి పిమ్మటన్.

చ. గురులకు మ్రొక్కి ప్రాజ్ఞకవికోటికి మాటికి నేటికోళ్ళిడన్
గరములుమోడ్చి మత్కృతిఁ గల్గినదోషము లెంచిమాపుధీ
వరులయెడం గృతజ్ఞతయుభక్తియుఁ జూపి నమస్కరించుచున్
బరమదయాస్వరూపులగు బంధులమిత్త్రులసన్నుతించుచున్.

క. అంచిత మూలగ్రంథ మొ
కించుకయును వీడఁబోక యెడ నెడ నదియేన్
బెంచుచు నౌచిత్యముఁ బో
షించుచుఁ దెలిఁగింప సాహసించితి దీనిన్. 21

చ. కనుఁగొనుచోఁ బ్రబంధములుగాని పురాణకథాళిగాని భూ
జన హృదయానురంజనము సల్పఁగ నేరవు చిత్రచిత్ర క
ల్పనముల నవ్యనవ్య రసభావసమృద్ధుల నద్భుతార్థ వ
ర్ణనములనత్కృథల్ హృదయకంజసముంబొనరించుచాడ్పునన్

చ. కతలను బద్యకావ్యములుగా నొనరించుటకంటె సద్రసో
చితగతి గద్యకావ్యములు సేయుట యుక్తమటంచు కొందఱా

విత మది నే నెఱింగియును వేడుకనై నిటు గద్యపద్యసం
శ్రిత మగు కావ్యఫక్కిని రచింపఁదలంచితి దీని నెయ్యెడన్.

ఉ. బంధము లెల్ల వీడి బహుభాషసమృద్ధిగ నేఁడు మత్తపు
ష్పంధయగీతి నా విరియఁబాఱుచునున్నది తెల్గుకైత; మ
ద్గ్రంథముఁ గాంచుకాల మిది గా; దటులైనను నేను బూర్వని
ర్బంధ కవిత్వ పద్ధతులఁబట్టియె దీని రచింపఁ బూనితిన్. 24

శా. గంభీరార్థవిశేషయుక్తమయి సద్గాథామహాగాథ మై
శుంభద్విస్మృతి నొప్పుచుండు కృతి నివ్వోచ నాంధ్రముం
జేయఁబ్రారంభంబుం బొనరించినాఁడ నిఁక భారంబంతయు
న్నీదె కావ్యాంభోధిన్ దరియింపఁ జేయఁగద వమ్మా !
సత్కృపన్ భారతీ! 25

గీ. అనుఁగు మేనత్త కొమరుఁడై యాశుకవిత
నాకుఁ జేదోడు వాదోడునై కడచిన
కృతిసమర్థుండు మారామకృష్ణశాస్త్రి
యున్న నీసాయ మర్థింతు నోటు? దేవి! 26

చ. చనియెఁగదమ్మ నీయపరజన్మవిలాసము మాకుఁ జూపవ
చ్చిన గతి వచ్చి, సత్కవితచేఁ గవికోటికి వన్నెదెచ్చి యం
తనె యతఁ డట్లు నీతనువునన్ విలసిల్లఁగ; నెవ్వరింక నా
పొనరుచు నీకృతిక్రియకుఁ బూనికఁ దోడ్పడువారు భారతీ!

ఉ. వేగిరపాటుమై మొదలువెట్టితిఁ దల్లిరో యీ కథాసరి
త్సాగరకావ్యమీవ కొనసాగఁగఁ జేయుదువంచుఁ; గాన,బా

గోసులు నాకుఁ దోఁపఁగ రసోజ్జ్వలభంగులఁ దెల్పుమమ్మ! వి
ద్యాగరిమంబు గల్గిన మహామతు లెవ్వరు నన్వకుండఁగాన్.

శా. ఈతీరైన మహాప్రబంధ మిది యే నేరీతిఁ బూరింతు వి
ఖ్యాతప్రజ్ఞుఁడఁ గాను నాకిది యసాధ్యం బంచు భావింప నా
చేత న్నీవ యొనర్తువంచు నదియో చింతన్ మహావార్ధి కే
సేతా మెత్తితి నేమిసేయుదువొ తల్లీ! మత్ప్రయత్నంబులన్

ఉ. తొల్లిటి సత్కవీశ్వరులు తోరపుఁగబ్బములన్ రచింపఁగాఁ
దల్లిరో! వారి పోలికకుఁ దద్దయు వేడుకఁబూని దీని నే
నల్లఁదలంచినాఁడ నని యాత్మఁ దలంచెదవేమొ యంచు నా
యుల్లమునందు భీతి యొకఁ డున్నది చెప్పకపోవ నేఁటికిన్?

ఉ. నన్నయభట్టుఁ బోలు కవినాథుఁడ నౌదు నటంచుఁగాదు, తి
క్కన్నమహాకవీశ్వరుని ఖ్యాతి లభించు నటంచుఁగాదు, పో
తన్న ప్రతిష్ఠ చేకుఱు నటంచును గాదు, యథార్థ మిట్లు నా
పన్నెదు కబ్బముల్ జనని! భారతి! నీ వగు చిద్విలాసముల్.

వ. అని యివ్విధంబున. 32

సీ. మహనీయ కావ్య నిర్మాణక్రియాదక్షు
తకు సర్వసృష్టికర్తను భజించి
ప్రారంభ నిర్విఘ్న పరిసమాప్తికి గణే
శ్వరు నెమ్మనమునఁ దత్పరతఁ దలఁచి
మత్ప్రియచ్ఛాత్రుఁ డేతత్ప్రబంధవిభుండు
విభవవిస్మృతుఁడు గా నభిలషించి

ప్రకటవాగర్థ సంవద పెంపుదీపింప
శారదాచరణాంబుజములు గొలిచి
గీ. సరస కవితా రసామృతాస్వాద సుఖ వి
చక్షణశిఖామణులకుఁ బ్రాంజలి యొనర్చి
యేను విరచింపఁ దొడఁగిన యీమహాక
థకు నిదె కథా విధాన సందర్భసరణి! 33

—♦ కథాప్రారంభము. ♦—

క. సిరులకు నెలవై విద్యా
ధర కిన్నర సిద్ధ సేవితంబై ధరణీ
ధర చక్రవర్తి హిమవ
ద్గిరిపతి యొప్పుం గుబేర దిగ్భాగమునన్. 34
గీ. పృథివి ధాత్రీధర్మములు పెక్కు లుండ
నఖిలలోకమ్ములకుఁ దల్లి యగు భవాని
యమ్మహీధరునకుఁ గూఁతురై జనించె
ననిన నాతని మహిమ మే మనఁగవచ్చు? 35
ఉ. ఉరుమహిమాస్పదం బగుచు నొప్పెడు నగ్గిరి సార్వభౌము ను
త్తర శిఖరంబు, నిర్మల సుధాధవళంబయి వెండికొండ నా
నరుదుగఁ బెక్కుయోజనసహస్రము లాక్రమణం బొనర్చి వి
స్ఫురతరదీధితుల్ దెసలఁ బొంపిరివోవఁ జెలంగు నిచ్చలున్.
గీ. మందరంబు, పయోనిధి మథిత మయ్యెఁ
బడయ లేదయ్యె నిటు సుధాపాండిమంబు

నే నయత్నమునన కంటి 'నిహిహి' యనుచు
నదియు నిజకాంతిచే నవ్వునట్లు తనరు. 37

ఉ. ఆ రజతాచలంబునఁ జరాచర విశ్వగురుండు భక్తర
క్షారతి యీశ్వరుండు గిరిజాసహితుండగుచున్ గణంబులున్
జారణ సిద్ధ సాధ్య దివిషద్ద్విజమున్ గొలువంగ నుండుఁ దన్
గోరి భజించు నర్థిజనకోటి కభీష్టవరంబు లిచ్చుచున్. 38

వ. ఇట్లుండ. 39

మ. ఒకనాఁ డప్పరమేశు డందమున నత్యుత్సాహ ముప్పొంగ నం
బిక యేకాంతమునందు నన్నుతుల సంప్రీతాత్ముఁ గావింపఁ నా
సకియం బ్రేముడిమీఱ నాతఁడు నిజోత్సంగంబునం జేర్చి చా
రు కపోలస్థలి ముద్దువెట్టుకొనుచున్ రోమోద్గమోద్భాసియై.

వ. అత్యంతానురాగ తరంగితాంతరంగంబుతో నప్పరమేశ్వరి
కిట్లనియె. 41

క. దేవీ! తావక మధుర వ
చో విలసనమున ముదంబు చొప్పడె మదిలోఁ
గావున నీ కేదియేనియుఁ
గావింతు నభీష్ట మడుగఁగాఁ దగు వేడ్కన్. 42

వ. అని యిట్లు పరమేశ్వరుండు పరమానురాగంబునం బలికిన
నది విని:— 43

గీ. పార్వతీదేవి దరహాసభాసమాన
వదన పంకజ యై భక్తవరద! నీకు

నాయెడ ననుగ్రహము గల్గిన సుమనోజ్ఞ
మైన యొక కథ యేదేని యానతిమ్ము! 44

క. అది మున్నెవ్వారును విని
నదియు నెఱిఁగి నదియుఁ గాక యతిచిత్రరసా
స్పదమై నాకీయెడఁ గడు
హృదయంగమ మగుచు ముదము నిడఁగా వలయున్. 45

చ. అనవుడు శర్వుఁ డిట్లనియె; నబ్జదళాయతనేత్ర! నీ యెఱుఁ
గని కథ లేవి యున్నవి జగంబున? భూత భవద్భవిష్య ద
ర్థ నిచయ మెల్ల నీకు విదితం బగుచుండునుగాదె? యింక నే
మని వచియింతు నిప్డు హృదయప్రియ! యన్యనవీనసత్కథల్.

తే. అనినఁ దద్వాక్యములు విని యద్రిరాజ
తనయ యెదియేనిఁ జెప్పక తప్ప దనుచు
మగని నిర్బంధ మొనరించె; మానవతుల
భావము ప్రియానురాగ హేవాకి గాదె? 47

వ. అంత నప్పరమేశ్వరుండును నిజపత్నీ నిర్బంధవశంబునం జేసి తదీయ హృదయానురంజనంబుఁ గావించుపొంటె స్వకీయ ప్రభావగుంఫితంబైన యొకానొక కథాంశంబు నివ్విధంబున నభివర్ణింపం దొడంగె; నది యెట్లనిన. 48

## — జ్వాలా లింగ కథ —

మ. వినుమో ప్రేయసి! మున్నొకప్పు డజుఁడున్ విష్ణుండు
నన్నుం గనుంగొనఁగా నెంచి ధరిత్రిఁ గ్రుమ్మరుచు, నీకుం

దండ్రియూ నీహిమాద్రినిఁ జేరం జనుదెంచి యుండుఁ గని;
రెంతే వింతయై స్వప్రభల। దనుకన్ గట్టెదుటం గనంబడెడు
జ్వాలాలింగ మన్ లింగమున్. 49

గీ. కని తదగ్రంబు నీక్షింపఁగాఁ దలంచి
యూర్ధ్వభాగంబునకు నేఁగె నొక్కరుండు
దాని మూలమ్ముఁ గనుఁగొనం దలఁచి యొక్కఁ
డేఁగె నతివేగముగ నధోభాగమునకు. 50

క. ఈరీతి వార లెంతే
దూరము సని దాని మొదలుఁ దుదయుం గానన్
నేరక వేసారి ననుం
గూరిచి యొనరించి రధిక ఘోరతపంబుల్. 51

గీ. అంత నేనుఁ దదీయ మహా తపో వి
ధానమున కాత్మలోఁ బ్రమోదంబుఁ జెంది
వారి చెంగట నావిర్భవంబు నొంది
యభిమతవరంబు లిడుదు మీ కడుగుఁ డంటి. 52

చ. అనుటయు సంతసించి జలజాసనుఁ "డో పరమేశ! నీవు నా
తనయుఁడవై జనించి ప్రమదంబొనఁగూర్పు" మటంచుఁ గోరె
మజ్జనకత నొంది, యున్నతదశం గన నెంచుచు; దాన నాతడుం
గనియె నపూజ్యభావము జగంబున నో ధవళాయతేక్షణా!

గీ. పిదప, నారాయణుండు సంప్రీత హృదయుఁ
డగుచు "నో దేవదేవ! దివ్యప్రభావ!

యేను భవదీయ శుశ్రూష నెప్పుడు సలుప
వరముఁ గోరెదఁ గృపసేయవలయు ననియె. 54

వ. అంత నే నాతని యెడం బ్రసన్నుండనై యట్ల యగుంగాత
మని యనుగ్రహంబు సేసియుంటి. 55

క. ఆ కతనను నీరూపున
నా కర్ధ శరీర మయ్యె నారాయణుఁ; డా
శ్రీకాంతుఁ డనఁగ నీవే
యోకాంతా! యాదిశక్తియును నీవె చుమీ! 56

వ. అట్టి నీవలననేగాదె నేనును శక్తిమంతుండనై యున్నవాఁడ?

గీ. ఇంతియేకాక, వినుము జన్మాంతరముల
నందు నిటు నీవు నాదు భార్యవయి యుంటి;
వనిన, నా విభు వచనంబు లాలకించి
యది యెటు లటంచు నడిగె హిమాద్రి తనయ. 58

సీ. అడిగిన భర్గుఁ డిట్లనియె, నో హిమశైల
కన్యకా! నీకుఁ దత్కథ వచింతు
నవధరింపుము; పూర్వమందు దక్షప్రజా
పతికి నీవును దనూభవలు మఱియుఁ
బెక్కండ్రు వొడమిరి; పిదప నా కతఁడు ని
న్నిచ్చి ధర్మాదుల కితర సుతల
నొసఁగి యావల నాతఁ డొకతఱిఁ గొండొక
యధ్వర మ్మొనరింప నాత్మనెంచి

గీ. యాకృతూత్సవమునకు నాహ్వాన మంపె
నెలమి నల్లుఁడ! కందఱ; కేమొకాని
నన్ను నొకరునిఁ బిలువక మిన్నకుండె
నపుడు మాతండ్రితోడ నిట్లంటి నేను. 59

క. 'ఏమయ్యా! జన్నమునకుం
బ్రేముడి నల్లుండ్ర నెల్లఁ బిలిచియుఁ బ్రమథ
స్వామిన్ భవదీయాగ్రిమ
జామాతన్ బిలువవైతి జనకా! చెపుమా.' 60

వ. అని యిట్లు నీవు పతిభక్తి పరాయణాత్వంబున మాతండ్రి
నడుగుటయు నతం డది విని నన్నుం బరిహసించుచు
నేలిదంబు గావించుచు 61

గీ. పుసుక పేరులఁ దాల్చు నెప్పుడును నీదు
భర్త; యతనిని బిలువంగ వచ్చు టెట్లు
పరమపావన మగు మహాధ్వరము వేళ?
నశుచి యగు నాతఁ డిటకు రా నర్హుఁ డగునె? 62

క. కాట నివసించు నాతని
బోటులు మా యధ్వరమ్ము పొలివోవంగ ని
వ్వోటికి రా నేఁటికి? నగుఁ
బాటుగదా సురలు మునులుఁ బరికించు నెడన్. 63

వ. అని యిట్లు భవదీయ జనకుండైన దక్షప్రజాపతి న న్నెల్లి
దమ్ము చేసి పలికిన నాసమయంబున. 64

గీ. కర్ణవిషసూచు లైన యాకఱకుమాట
లాలకించి యితండు పాపాత్ముఁ డకట!
పరమ శివుఁ డైన నాకూర్మిభర్త నిట్లు
వెడవెడఁగ నాడె నెట్టి వివేకి తలఁప? 65

గీ. నా కితఁడు తండ్రియే యగుఁగాక, శివుని
మహిమ మెఱుఁగక దూఱె నిమ్మాడ్కి; నింక
నిట్టివానికిఁ బుత్త్రినై యేల బ్రదుక?
ననుచుఁ గోపాగ్ని కాహుతి యైతి నీవు. 66

ఆ. అది యెఱింగి యేను నత్యంత కుపితాంత
రంగమునఁ దదధ్వరమ్ము నెల్లఁ
జెఱచి వైచినాఁడఁ జెదరి యచ్చోటి సురల్
వెఱచి బెగ్గడిల్లి విఱిగి పఱవ. 67

క. తదనంతరమున నీవ
భ్యుదయించితి వీ హిమాచలోత్తమునకు నో
సుదతీలలామ! ప్రేమా
స్పదమగు సత్పుత్త్రివగుచు భావం బలరన్. 68

చ. ఎఱుఁగుదుగాదె యప్పిదప నేనును నిశ్చల నిష్ఠమైఁ దప
శ్చరణముపొంటె నీతుహిన శైలముపై వసియించియుంట, యి
గ్గిరికులమౌళి నాకతిథికిన్ బరిచర్య యొనర్పముద్దుఁగూఁతుర
వగు నిన్నుఁ బంచుటయుఁ దోయరుహానన! యద్దిసర్వమున్.

వ. పదంపడి నీవు నాకుఁ బరిచర్య యొనర్చుచున్నయవసరంబున.

గీ. తారకాంతకుఁ డను సుపుత్త్రకుఁడు మనకు
సంభవింప నపేక్షించి సకల సురలుఁ
గడఁగి, నాదు తపోనిష్ఠ నుడుపఁ గుసుమ
సాయకునిఁ బంపి రంత నా సాహసికుఁడు. 71

క. చనుదెంచి మిప్పుల నేడ్తెఱ
ననుఁ దన వెడవింటి కుసుమ నారాచములన్
జెనకంగఁ బోయి మ ల్లో
చన భీకరవహ్ని భస్మసాత్కృతుఁ జేయ్యెన్. 72

గీ. అప్పుడు నీవు మహాతపం బాచరించి
తన్మహిమచేత నాదు చిత్తము హరించి
కోమలీ! భర్తగా డక్కఁగొంటి నన్ను
నిన్ను నేనును సామేన నిల్పుకొంటి. 73

వ. దేవీ! యివ్విధంబున నీవు పూర్వజన్మంబునందును నాకు ధర్మ పత్నివై యుండి నాయెడల నత్యంతభక్తి విశేషంబునం బ్రవర్తించి యున్నదానవు. 74

క. ఇదియే యొకకథ; యిప్పు డో
హృదయేశ్వరి! యింతకంటె నితరకథల్ నీ
మది కింపు సొంపు సేయం
గఁ దగిన వే మున్న వింకఁ గడఁగి వచింపన్? 75

మ. అని యీశంకరుఁ డివ్విధంబునఁ బరీహాసప్రకారంబుమైఁ
దనవృత్తాంతమె యొక్కవింత కతగాఁ దద్దేవితోఁ బల్కనన్

విని యాచండిక యల్కఁజెంది సరిలే విన్నార మేతత్కథల్
మునుపే, క్రొత్తగఁ జెప్ప నేమిటికిఁ జాలుఁజాలు నీపోకడల్!

క. కతుకపడి యడుగఁ జక్కని
కత సెప్పక యెదియొ బ్రతుకుకతఁ జెప్పితి వీ
గతి; నిదియొకో నా కీ వభి
మత మీడేర్పుట యనంగ మదనారాతీ! 77

చ. అవు నవు నేను నీ శిరమునందు వసించెడు గంగ నైతి నో
తవిలి పదంబులం బడి సతంబును మ్రొక్కెడు సంధ్య నైతినో
సవతినిగాన వారలకు? సందియమేల? మదీప్సితంబు తె
ట్లవు? నిది యే నెఱుంగనదియా? దివిష త్తటినీ మనోహరా!

చ. అని యిటు లల్గి నిష్ఠురము లాడఁగడంగిన దేవిఁగాంచి యా
మనసిజ వైరియున్ విమలమందమనోహరహాస భాసురా
ననుఁడయి తత్సతిన్ మివుల నర్మిలిఁ గౌఁగిటఁ జేర్చి ప్రేయసీ!
కినిసితె యింతలోపల నె కేవల మే నొక మేలమాడినన్? 79

చ. అనవరతంబు నీదుహృదయంబున వర్తిలఁజూచు నన్ను, నా
మనసును నీవెఱుంగవొకొ మానిని! నీవిటులల్కఁబూనఁగాఁ
జన; దిఁక సుప్రసన్నవయిచక్కఁగవిస్మయదాయకమ్మౌ కథన్
వినిచెద నీదు వీనులకు విందులుసేయుచు నద్భుతంబుగన్.

క. అది మున్నెవ్వరును విని
నదియు నెఱిఁగి నదియుఁగాక యతిచిత్రరసా

స్పదమై నీకీయెడఁ గడు
హృదయంగమ మగుచు ముదము నిడుఁ జుమి దేవీ! 81

క. అని బహువిధముల సాంత్వ వ
చనముల నుపలాలనమ్ము సలుపుటయును, శం
భునిరాణి యెట్టకేలకుఁ
దన యలుకఁ విడి ప్రసన్నతం గని యంతన్. 82

గీ. హృదయమున వేడ్కపడుచు, నందిశుఁ బిలిచి
యనఘ! నీవు ప్రమత్తుండ వగుచు నస్మ
దీయ కేళీగృహద్వార దేశమందు
నిలిచియుండి వేఁడియు నేను బిలుచు దనుక, 83

గీ. ఎవ్వరిని లోపలికిఁ జొరనీకు మనుచు
నానతి యొసంగి నిజగృహాభ్యంతరమున
కరిగెఁ బ్రియుఁగూడి; యంత నగ్గిరిజ యలర
శివుఁడు తత్కథ నీరీతిఁ జెప్పఁదొడఁగె. 84

— పుష్పదంతాదుల వృత్తాంతము —

క. దేవీ! వినుమిది; దివిజులు
కేవలమును సుఖులు; వారి కృతు లెప్పుడు సుఖ
శ్రీవిలసితములె యగు; నిఁక
భావింపఁగ నరులు దుఃఖభాగులు ధరణిన్. 85

క. వారల చరిత్రములు దు
ర్వారతరానేక దుఃఖబహుళములే యై

మీఱుచు నుండు సతమ్మును
ధారణిపై నదియె సహజధర్మంబకదా? 86
గీ. కాన, సుఖబహుళము సురకథ; నరకథ
కేవలము దుఃఖబహుళము; దేవమనుజ
మిశ్రచరితంబు సుఖదుఃఖ మేళనమున
నింపు పుట్టించు వినువారి హృదయములకు. 87
వ. అది యట్లగుటంజేసి:— 88
క. సుర నర చరితాత్మకముగ
సరసంబై వివిధభావ సంపన్నంబై
పరఁగెడునది యొక విద్యా
ధర చరితము నీకుఁ జెప్పెదన్ వినుము సఖీ! 89
సీ. అని పల్కి యీశ్వరుం డాహిమాచలరాజ
పుత్రికిఁ గథఁ జెప్పఁబోవు నంత
నా యీశ్వరుఁడు చన్వుసేయు భృత్యుఁడు పుష్ప
దంతుం డనెడువాఁడు ద్వారసీమ
కరుదెంచి సేవార్థ మభ్యంతరమునకుఁ
జనఁబోవ నంది యాతనిఁ గనుఁగొని
దేవి యానతి యయ్యె నేవారలును లోని
కరుగరా దని చెప్పి యడ్డు దవిలె
గీ. నంత నా పుష్పదంతుండు నచ్చెరువడి
దేవ దేవునకేఁ బ్రియ సేవకుఁడను

నన్ను నైతము నిష్కారణముగ నితఁడు
కించుఁబోలిక నిటు నిషేధించు నొక్కొ! 90

క. కనుఁగొంచుఁగాక నే నీ
తని వంతం బనుచు వెడలి తత్క్షణముననే
తన యోగమాయచే నా
తనికి నదృశ్యుఁ డయి యేఁగి తద్భవనమునన్. 91

గీ. చొచ్చి కుతుకంబుతో నొక్కచోట నొదిఁగి
పార్వతీదేవికిఁ బినాకపాణి చెప్పు
నద్భుతమ్మగు సప్తవిద్యాధరులయుఁ
జరిత మదియెల్ల విని మోద భరితుఁ డగుచు. 92

క. పడి నన్నయుఁ గాకుండఁగ
వడి వడిగాఁ దాను మున్ను వచ్చినతోఁవం
బడి యరిగి తనదు పెన్ముడి
పడఁతుక యగు జయకుఁ దెలియఁబలికె నదెల్లన్. 93

క. పురుషుఁడు తనకుం బ్రియ మై
కర మనురాగమునఁ బొలుచు కామినితోఁ దా
నెఱిఁగిన నాత్మరహస్యము
నెఱిఁగింపక డాఁప నేర్చునే యెపుడేనిన్? 94

సీ. అంత నాజయయు నత్యద్భుతం బైన య
క్కథ యంతయును గడుం గౌతుకమున

నాలించి నెమ్మనం బలరారఁ దనదు నె
య్యపు భర్త నెంతయు నభినుతించి
పదపడి తా నద్రిభవఁ గొల్వ నేఁగిన
తఱిఁ దన్మనో వినోదం బొనర్పఁ
బ్రియుఁ డట్లు తనకుఁ జెప్పిన యమ్మహాచిత్ర
కథ యెల్ల నొడివె నగ్గారి చెంతఁ
గీ. బూర్వవృత్తాంత మెఱుఁగకపోయి యుంట
నామె కది క్రొత్త కథ యగు నని తలంచి
చాన నోటను నూవుగింజేని దాఁగ
దనెడు లోకోక్తి రీతి సత్యమగు భాతి. 95
వ. అంత:— 96
క. జయ చెప్పిన కథయును దప్పి
ప్రియు చెప్పిన కథయు నొక్కవిధమై యుండన్
రయమునఁ బార్వతి ప్రణయా
శ్రయుఁడగు పరమేశుఁ జేరఁ జని యిట్లనియెన్. 97
ఆ.వె. కంటి లె మ్మపూర్వకథ సెప్పు మని యడు
గంగ నెల్లరును నెఱింగి నదియె
చెప్పి నన్ను మాయచేసితి వెండియు
నభిమతంబుఁ దీర్తు నని వచించి. 98
క. జయ యెఱిఁగిన కథ మృత్యుం
జయ! నీ వపురూపముగఁ బ్రశంసించితి మ

త్ప్రియ మీఁదేర్చితి; నాకీ
దయ చాలునుగాని, నీకు ధర్మము కాదో ? 99

చ. అని యిటు కోపగర్భితములాడుచు వెండియు గౌరి యల్గినన్
గని "యది యత్యపూర్వ మగుగాథగదా జయయెట్లువిన్చెనో
యని పరమేశ్వరుండుహృదయంబుననెంతయువింతఁజెందియుం
తన గతవృత్త మెల్లఁ బ్రణిధానమునన్ దిలకించి నవ్వుచున్.

చ. వినుమిది దేవి! నే నపుడు విన్చిన యాకథ యత్యపూర్వమై
చనునదె; యింతమాత్రమును సందియ మందకు దాని నీకు నే
వినుచుచునున్నవేళఁ గడు వింతగఁ గొండొకయోగమాయ చే
కొనియలపుష్పదంతుఁడటఁగన్ జనుదెంచియదృశ్యమూర్తియై.

క. అక్కథ యంతయు విని చని
మక్కువమెయిఁ దనదుకూర్మిమగువకు జయ కిం
పెక్కఁగ నొడివెన్, దదితరు
లెక్కడ నెటు లెఱుఁగ నేర్తు రిది యోదేవీ! 102

గీ. అనుచుఁ బరమేశుఁ డిట్లు యథార్థభంగి
సర్వము నెఱింగ చెప్పినఁ బార్వతియును
బుష్పదంతుని రావించి భూరికోప
కలుషితస్వాంతరంగ యై పలికె నిట్లు. 103

క. అవినీతభావ! యస్మ
ద్భవనాంతరమున మదాజ్ఞఁ బాటింపక చొ

త్తువె మాయం గైకొని? నీ
యవినయ మది యింత యయ్యెనా చనవీయన్? 104

గీ. నెడఁగు మాయలు గొని యిట్లు నడవనేర్చి
తీవిచట నుండఁదగ దింక దేవతాత్వ
మునకు నర్హత లేదు కావునఁ దొలంగి
పొమ్ము; పుడమి నరుఁడవై పుట్టు మోరి! 105

వ. అని యిట్లు పార్వతీదేవి మహాగ్రహావేశంబునం బుష్పదంతుని శపించుటయు నప్పుడచ్చట మెలంగుచున్న మాల్యవంతుం డను మఱియొక ప్రమథుం డది యాలకించి పుష్పదంతునియెడం దనకుఁ గల మైత్రిం బాటించి యట్లు కోపావిష్టయై యున్న భవానీదేవిసన్నిధి కరిగి— 106

క. దేవీ! వీఁ డజ్ఞుండై
కావించెఁ దొసఁగు; దీనిఁ గరుణింపుము నీ
సేవకుఁడు వీఁ డిఁ కెన్నఁడుఁ
గావింపం డిట్టి కానికార్యము తల్లీ! 107

క. అని విన్నప మొనరుపఁ బో
యిన వానిన్ మాల్యవంతు నీక్షించి కన
ద్ఘనరోష వశత నున్న క
తన నపు డాదేవి తాల్మి దలఁగిన మదిఁ గోన్. 108

క. చను, మీవును వానివలెన్
మనుజుఁడవై పుట్టు మవనిమండలమున; నీ

ఘనత యది యేమి? నాకడ
వినవఁగ వచ్చితి వె! వెడలు వెడలుము; వెడఁగా ! 109

ఆ.వె. అని యహంకరింప నామాల్యవంతుండుఁ
బుష్పదంతుఁడును నపూర్వదుఃఖ
చలిత హృదయు లగుచు జయత్రోడఁ జని యా భ
వాని పదయుగంబు పైని వ్రాలి. 110

వ. దీనత్వంబు దోఁపఁ బెక్కుచందంబులం బ్రార్థించి దేవీ! మాకు శాపమోక్షం బెప్పు డయ్యెడు నది యనుగ్రహింపు మని వేఁడుకొనుటయు నప్పు డమ్మహాదేవి ప్రసన్న హృదయ యై వెండియు వారియెడం గరుణించి పుష్పదంతు నుద్దేశించి యిట్లనియె. 111

సీ. సుప్రతీకాఖ్యయక్షుం డొకండు కుబేర
శాపంబుచే ధరాస్థలికిఁ బోయి
వింధ్యాచల మహాటవీ ప్రదేశంబున
భయద పిశాచ రూపంబుఁ బడసి
కాణభూతి యనంగ గణియింపఁబడుచుండె
నీ వెప్పు డచట వానిఁ గనుఁగొందు
వపుడు పూర్వజ్ఞాన మది నీకు లభియించు
నంత నీ వింధు రహస్యమందు

గీ. భర్త సెప్పఁగ వినిన తద్భవ్యకథను
వానికెఱిఁగింప నీదు శాపంబు వాయు

వాఁడు నొకతఱి నది మాల్యవంతు చెంతఁ
బలుకు; నంతట వాని శాపంబుఁ దొలఁగు. 112

క. ఆ మాల్యవంతుఁ డయ్యది
భూమిని వెలయించి శాపమోక్షముఁ గను; మీ
రామీఁద మరల నస్మ
ద్ధామముఁ బడయంగ వచ్చెదరు దివ్యులరై. 113

ఆ. అంత దనుక మీకు నవనీ నివాసంబు
తప్ప దింకఁ బుష్పదంత! మాల్య
వంతుతోడ వెడలి వసుధాతలంబున
కరుగు మాత్మదోష మనుభవింప. 114

ఆ. అనినఁ దత్‌(క్ష)ణంబ యా పుష్పదంతుఁడు
మాల్యవంతుఁడును బ్రమథ శరీర
ములను బాసి మెఱపు మొత్తముల్ మెఱసిన
రీతి మెఱసి చని యదృశ్యులైరి. 115

వ. పదంపడి మఱికొంత కాలంబు సనినపిమ్మట నొకానొకనాఁడు
పార్వతీదేవి కరుణాంతరంగయై పరమేశ్వరు నుద్దేశించి దేవా!
నాఁ డట్లు నేను శపించిన యాప్రమథవరు లిరువురు నవని
పై నెచ్చట జన్మించి రది నా కెఱింగింపు మని సకరుణంబు
గా నడుగుటయు. 116

క. పరమేశుం డో దేవీ!
ధరపైఁ గౌశాంబి యనఁగఁ దనరాదు పురీ

వరమాదుఁ బుష్పదంతుఁడు
వరరుచి యనుపేరఁ బొడమి వర్ధిలు చుండెన్. 117

గీ. మాల్యవంతుండు నమ్మహీ మండలమున
సుప్రతిష్ఠిత మను సంజ్ఞ సొబగుమీఱు
పురమున గుణాఢ్యుఁ డనుపేరఁ బొడమి యుండె
వారి చారిత్ర మిది! యంచు వక్కాణించి. 118

శా. ఆలోనన్ నిజభృత్యు దుష్పరిభవానల్పాను తాపంబునన్
జాలింబొందెడు ప్రేయసిన్ గిరిజ నీశానుండు లాలించుచున్
కైలాసాచలసానుదేశవిలసత్కల్పద్రుమాంచల్లతా
లీలాకంజములం దభీష్టసుఖకేళీగోష్ఠిఁ దేర్చెన్ గృపన్. 119

కథాపీఠలంబకమునఁ బ్రథమతరంగము

సమాప్తము



ఓమ్ !

# ఆంధ్ర
# కథాసరిత్సాగరము.

## కథాపీఠలంబకము. ౧.

:0:

## ద్వితీయ తరంగము

సీ. తదనంతర కథావిధానం బ దెట్లన్నఁ
బుష్పదంతుం డట్లు పుడమియందు
వరరుచి యనుపేరఁ బరఁగుచు, మఱియుఁ గా
త్యాయనుం డనెడు నామాంతరమును
బడసి మానవ తనూ భాసమానుం డయి
సంచరించుచు, సమస్త ప్రశస్త
విద్యావిశేష ప్రవీణత నార్జించి
నంద మహా మహీనాథ వరుని

గీ. మంత్రి ముఖ్యుండు నయి నిజమహితశక్తిఁ
బ్రభుని మన్ననలకుఁ గడుం బాత్రమయ్యెఁ
దుద నొకానొకనాఁడు నెమ్మది ననూన
ఖేద ముదయింప నెంతయుం గించపడుచు.

క. చని వింధ్యవాసినీదే
వి నికటమున భక్తిభావ వినిబద్ధుం డై
ఘనతర తప మొనరిచి యా
జనని యనుగ్రహముఁ బడసె సముచిత భంగిన్. 2

గీ. అంత సద్దేవి తత్స్వప్నమందు సుప్ర
సన్నయై దర్శన మొసంగి, సాదరముగ
నతని కిట్లనె నోవత్స! యదె యదూర
వర్తియై యున్న యావింధ్య వనమునందు. 3

వ. కాణభూతి యనం బరఁగు వాఁ డొకండు గలఁడు; నీ విపు డచ్చటి కరిగి వానిం గనుంగొనునది; నీ మనో వైకల్యంబు సాకల్యంబుగాఁ దొలంగు నని యివ్విధంబున నవ్వింధ్యవాసినీదేవి యాదేశించి యంతర్ధానమ్ము నొందుటయు నంత నవ్వరరుచి మేల్కాంచి. 4

మ. తన కాదేవి యనుజ్ఞ యిచ్చినగతిన్ ధైర్యంబుతో నేఁగి,యం తనె యొక్కింమక దవ్వనంగనియె మత్తవ్యాఘ్రభల్లూక కాననభూదార మతంగజ ప్రముఖ వన్యక్రూరసత్త్వాళియం బు నలబ్ధోదకశుష్కభూరుహచయంబున్ వింధ్యకాంతారమున్.

గీ. కాంచి నిర్జనమైన యక్కాన నొక్క-
యెడ నొక మహోన్నతవట మహీరుహంబు
చేరువఁ బిశాచ శత పరిసేవితుఁ డగు
కాణభూతి నుదంచితాకారుఁ జూచె. 6

వ. అంత:— 7

గీ. కాణభూతియు వరరుచిం గాంచి మిగుల
భక్తి నెమరేఁగి తత్పాద పద్మములకు
నతు లొనర్చి తోడ్తెచ్చి మన్నన లెసంగ
సముచితాసన ప్రముఖోపచారవిధుల. 8

గీ. తగిన యాతిథ్య మిడుటయు దానిఁ గాంచి
వరరుచి మనంబులోన నచ్చెరువుఁ గొనుచు
నీ పిశాచాధిపతి విధిహితవిధాన
సరణి నతిథి సత్కార మేకరణిఁ జేసె? 9

వ. ఔరా! యితండు తా నొక్క పిశాచాధినాయకుండై యుం
డియు నివ్విధంబున శిష్టాచార సంపత్తి గలిగి యున్నవాఁ
డిట్టి యితం డెవ్వండై యుండునొకో యని తన మనంబున
భావించుచు, నతండు తన కొసంగిన సముచితాసనంబునం
గూరుచుండి ప్రణయపేశలమ్ము లైన వచనంబులతో నక్కాణ
భూతి కిట్లనియె. 10

క. ఏమోయి కాణభూతీ!
యీమహితాచారనియతి నిట్లెట్లేఁగియు నీ
వేమాడ్కి నిప్పిశాచత
చే మహిమఁ దొఱంగియుంటి చెప్పంగదవే. 11

గీ. సాజముగ నీవు మును పిశాచంబ వగుచు
నున్నవాఁడ వటంచు నే నెన్నఁజాలఁ

గారణం బేమి యిట్టి దుర్గతిని బడసి
యిమ్మహారణ్యమున వసియింప నీకు? 12

వ. నీ పూర్వ వృత్తాంతం బది యెట్టిది? వినవలతుం జెప్పు మని యడిగినఁ గాణభూతి యా కాత్యాయనుని స్నేహానురాగ యుక్తంబు లైన వచనంబుల కెంతయు నలరుచు నో మహాత్మా! నాయంత నే నట్టి పూర్వవృత్తాంత జ్ఞానంబు గలిగి యున్నవాఁడం గాను; గాని, యొకానొకప్పు డుజ్జయినీ నగరంబున శ్మశానప్రదేశంబునందుఁ బార్వతీదేవితో సవిలాసంబుగా విహరించుచుఁ బరమేశ్వరుం డామెతోఁ జెప్పుచున్న సమయంబున నేను వినిన వచనంబులు కొన్నిగలవు; వవి నీ కెఱింగించెద, వానివలనఁ గొంత నా వృత్తాంతంబు నీకు వెల్లడి కాఁగలదు; విను; మది యె ట్లనిన. 13

ఆ. అద్రిరాజకన్య యమ్మహేశ్వరు నప్పు
డడిగె నిట్లు; 'ఓయి! ప్రాణనాథ!
యేల నీకు మిగుల హితము లయ్యెఁ గపాల
సమితియును శ్మశాన సంచయమును? 14

క. కరుణించి తత్ప్రమేయం
బెఱిఁగింపఁగవలయు ననిన నీశ్వరుఁ డపు డా
గిరిరాజకన్యకకు ని
క్కరణిన్ వచియించెఁ బ్రణయగౌరవయుక్తిన్. 15

సీ. అద్రిజా! వినుము కల్పావసానమునందు
జలమయం బయ్యె నీ సకల జగము
నాతఱి నే నూరుఘాతంబుఁ గావించి
రాల్చితి నందొక్క రక్తకణము
నది తజ్జలంబునం దండరూపముఁ దాల్చె
నయ్యండము నిరుద్వయ్యలుగఁ జేయఁ
బురుషుఁ డొకం డందుఁ బొడమె; నేనంతఁ బ్ర
కృతి సృజించితిఁ బునస్సృష్టిపొంటెఁ
గీ. బ్రకృతియును బూరుషుండుఁ బ్రజాపతులఁ గాంచి
రా ప్రజాపతులకుఁ బుట్టె రఖిల జనులు
దాన నప్పూరుషుండు పితామహుఁ డనఁ
బరఁగుచు జగంబునం బెంపుఁ బడసె మిత్రుల. 16

గీ. ఆ పగిది నాతఁడు చరాచరాత్మక మగు
విశ్వ మంతయు సృష్టిఁగావించి యేస
విశ్వకర్త నటంచు గర్వింపఁ దొడఁగె
నంత నే నది గాంచి యహంకరించి. 17

క. ఏలా నీకీ గర్వము
బాలా! యని చేత నున్న పటుఖడ్గమునన్
హేలాగతిఁ దచ్ఛిరముఁ
గూలఁగ నఱికితిని మిత్రుల ఘోరముగాఁగన్. 18

ఆ. పిదప, సానుతాప హృదయుండ నై మహా
వ్రతముఁ బూని తత్కపాలపాణి
నగుచుఁ బితృవనంబులందుఁ జరించుచు
నుంటి నాఁటఁ గోలె నో భవాని! 19

వ. ఇదియునుం గాక:— 20

గీ. అది నేను వచించిన యట్టి యండ
భాగములు రెండు నవనీనభమ్ము లయ్యెఁ
గాన జగము కపాలాత్మకముగఁ దనరి
చెలఁగుచున్నది యిట్లు నా చేతిలోన. 21

చ. అని వచియింప దాని విని, యప్పుయి వా రిఁక నేప్రసంగమున్
బొనరుపఁబోదురో యదియుఁబొంచివినందగుఁగాదెయంచు నే
ననువుగఁ దత్సమీపమునయందె చరించుచునుంటి నంత న
మ్మనసిజ వైరితో నతని మానిని నొడియుఁబల్కె నీగతిన్.

గీ పాణనాథా! మదీయ శాపమునఁ జేసి
ధాత్రి కరిగిన మన పుష్పదంతుఁ డకట!
తిరిగి మనచెంత కెపు డరుదెంచు నొక్కొ-
యనిన ననుఁజూపి యామె కిట్లనియె శివుఁడు. 23

గీ. అదె, కనుంగొను; మ ప్పిశాచాధి నేత
మున్ను ధనదుని కనుచర ముఖ్యుఁ డైన
యక్షవర్యుండు; తొల్లి పీఁ డజ్ఞుఁ డగుచు
విత్తనాథుని చిత్తప్రవృత్తిఁ గనక. 24

గీ. స్థూలశిరుఁ డను పేరిటి సురవిరోధి
తోడ,—వాఁడు ధనాధినాథునకు వైరి
యైన,—ననవరతమును నెయ్యమునఁ జెలిమి
సేయుచుండెడువాఁడు రాజీవనయన! 25

వ. అప్పు డక్కుబేరుం డది యెఱింగి. 26

శా. ఆ పాపాత్మకుఁ డైన రాక్షసుని సౌహార్దంబుఁ బాటించుటన్
గోపోద్దీపితుఁ డై యొసంగుచు మహాఘోరంబుగా వింధ్య శై
లోపాంతాటవిలోఁ బిశాచతనువై యుర్విస్థలిన్ బుట్టఁగా
శాపం బిచ్చుటఁ జేసి వీఁ డిటు పిశాచత్వంబుఁ గాంచెన్ జుమీ.

వ. మఱియును:— 28

సీ. అపు డట్లు వీని కా యక్షేశ్వరుఁడు ఘోర
శాపం బొసంగినజాడ యెఱిఁగి
యడలు సెందుచు వీని యగ్రజుం డగు దీర్ఘ
జంఘుం డనెడు వాఁడు సత్వరముగఁ
జని యక్కుబేరుని చరణంబులం బడి
మ్రొక్కుచుఁ దచ్ఛాప మోక్ష మొసఁగఁ
బ్రార్థించుటయు విత్తపతియు నయ్యెడ వానిఁ
గని చిత్తమునఁ గనికరముఁ బూని

గీ. "పుడమిపై శాపవశమునఁ బుట్టెదంతుఁ
డనెడు పరిమథుండు మానవుం డై జనించు

నతనివలన మహాద్భుతం బైన పుణ్య
కథ యొకటి వీఁ డచట వినం గలఁడు వినవె. 29

వ. తత్పుణ్యకథా ప్రపంచంబు సర్వంబును శాపఫలంబునం జేసి మానవత్వంబు వడసి మహీతలంబున వర్తించు మాల్యవం తుండను మఱియొక ప్రమథున కెఱింగించి యా పుష్పదంత మాల్యవంతులతోఁ గూడ వీఁడును శాపమోక్షంబుఁ బడయం గలవాఁడు:— 30

క. అని వీనికి శాపాంతం
బును దెలిపెఁ గుబేరుఁ డపుడు; పూర్వము నీవున్
మన పుష్పదంతునకు న
య్యనువుననే తెలిపితివిగదా మఱచితివే? 31

వ. ఆనాఁడు నీకు నేఁ జెప్పిన యపూర్వమహాకథ సర్వంబును బుష్పదంతుండు వీనికి వినిపించిన పదంపడిగాని శాపమోక్షంబునొంది మన సన్నిధికి రానేరఁ; డా వృత్తాంతంబు జ్ఞప్తికిం దెచ్చుకొనుము. 32

చ. అని శివుఁ డిట్లు సెప్పెఁ; నపు డవ్వచనంబుల నాలకించి నే
మనమున సంతసించుచుఁ గ్రమంబుగ నిచ్చటికేఁగుదెంచితిన్
విను; మటుగాన శాపకృతవిక్రియుఁ బాయగఁజాలఁ బుష్పదం
తునిఁ గనుదాఁక; నమ్మహితుదుర్లభదర్శన మెప్పుడబ్బునో.

ఆ. అమ్మహాత్ము నాగమార్గంబు నే నిందు
వేచి యుంటి నిట్లు విమలహృదయ!

వింటె నాదు పూర్వవృత్తాంత మిది? యింత
కంటె నన్య మెదియుఁగాని యెఱుఁగ. 34

ఆ. అనుచుఁ గాణభూతి యాత్మవృత్తం బిట్లు
వినుప, నంతలోన విస్మయముగ
వరరుచియును, నిద్ర వదలి మేల్కని నట్లు
తనదు పూర్వజన్మమును స్మరించి. 35

వ. ఆ కాణభూతితో నిట్లనియె. 36

ఆ. యక్షవర్య! నేనె యా పుష్పదంతుండ
నాకు నీదు దర్శనమునఁ జేసి
సంభవించె నిపుడు జాతి స్మరత్వంబు
వినుము నీకుఁ దత్కథను వచింతు. 37

క. అని తొల్లి శివుఁడు గౌరికి
వినుపఁగఁ దా వినినకథ సవిస్తరముగ నా
తనికి వినిపించె వరరుచి
ఘనతర నిజమధురవాక్య కౌశల మెసఁగన్. 38

వ. ఇవ్విధంబున వరరుచివలన నక్కాణభూతి సప్త లక్ష గ్రంథ పరిమితంబులైన సప్తమహాకథలునాలకించి యత్యంతాశ్చర్య తరంగితాంతః కరణుండై యతని కిట్లనియె. 39

మ. అనఘా! నీవు మనుష్యరూపమున నత్యంతానురాగంబుతో
నను రక్షింపఁగ వచ్చినట్టి గిరిజానాథుండవై యుందు వ

న్యన కేనాని కెఱుఁగ శక్యమగు నోహో!యిట్టి యీసత్కథల్
తని సెన్నాహృదయంబు; నేనుకృతార్థత్వంబునుం గాంచితిన్.

ఆ.వె. అపుడె నాదు శాప మది యు నన్ విడనాడి
తొలఁగుచున్న యట్లు తోఁచుచుండె;
నో మహానుభావ! నీమహానుగ్రహ
వశమువలన నాదు వగ లడంగు. 41

వ. అది యట్లుండె:— 42

గీ. ఓ మహాప్రభు! మాబోఁటి పామరులకు
వినుప రానిది కాదేని విస్తరించి
నీదు వృత్తాంత మెల్ల జన్మాదిగాఁగఁ
జెప్పి నన్నుఁ గృతార్థునిం జేయఁగదవె! 43

క. అని కాణభూతి యెంతయుఁ
బ్రణతులు గావించి తన్నుఁ బ్రార్థింపఁగ నా
తని యనురోధవశంబున
వినిపింపఁ దొడంగె నాత్మవృత్తము నతఁడున్. 44

— వరరుచి వృత్తాంతము. —

వ. అది యెట్లనిన:— 45

గీ. ధరణిఁ గౌశాంబి యనఁ బ్రసిద్ధ మయి వెలయు
నగరి నగ్ని శిఖాపరనామధేయుఁ
డనఘు చరితుండు సోమదత్తాహ్వయుండు
వెలయుచుండెడువాఁ డొక్క విప్రవరుఁడు. 46

గీ. తద్ద్విజోక్తమునకు వసుదత్త యనెడు
పరమ సాధ్వీమతల్లిక పత్ని యయ్యె;
నామె మున్నొక మునిపుత్రి; యట్టు లయ్యు
శాపవశమునఁ బొడమెఁ దజ్జాయ యగుచు. 47

క. ఆ పావన చారిత్రకు
నా పరమ పవిత్రుఁ డగు ద్విజాగ్రణికిని నే
శాపవశమ్మునఁ బుత్రుఁడ
నై పుట్టితి; నంత నాకు నతిబాల్యమునన్. 48

గీ. దైవవశమునఁజేసి మాతండ్రి పరమ
పదమునకు నేఁగె; మాతల్లి పతివియోగ
దుఃఖభరమున నాత్మవందురుచు నన్నుఁ
బెక్కు బన్నములం బడి పెంపఁదొడఁగె. 49

వ. అట్లుండ నంత నొక్కనాఁటి సాయంసమయంబున నిరువురు బ్రాహ్మణోత్తములు దూరపథ సంచారవశంబున ధూళిధూసరిత శరీరాంబరులై యున్నవార లెచ్చటినుండియో మాగృహంబున కరుదెంచి యా నాఁటియొక్క రాత్రియు మా యింట నివసించుటకు వసతి యొసంగ మాజనయిత్రి నర్థించుటయు నంత నామె వారి నస్మదీయ సదనంబున నొక్కచో నుండ ననుమతించె; నంత రాత్రివేళ:— 50

క. ఆ యిరువురు విప్రులు నటు
మా యిరవున నుండ నొక్క మర్దలరవము

త్యాయతముగ వినవచ్చె న
దేయెడనుండి యొ లయోపహితభంగికమై. 51

గీ. అంత నది విని మాతల్లి యాత్మలోనఁ
దన మనఃప్రియుఁడైన భర్త తలఁపునకు
వచ్చుటయుఁ గన్నుఁగవ బాష్పవర్ష మొదవ
గద్గదికతోడ నిటు నన్నుఁ గాంచి పలికె. 52

వ. అది యెట్లనిన:— 53

గీ ఆలకించితివే కుమారా! మృదంగ
నిస్వనం బదెఁ మీతఁడి(?) నేస్తగాఁడు
నట శిఖామణి యగు నందనామకుఁడు
నర్తనము సేయఁ గడఁగుచున్నాఁడు నేఁడు. 54

వ. ఇట్టి నాట్యసమయంబులయందు మీజనకుండు నచ్చోటి
కరిగి యది యంతయుం గనుంగొని వచ్చి యచ్చటి విశే
షంబు లెల్ల నాకు ముచ్చటగా వినిపించు చుండెడివాఁడు;
నాయనా! నా కిప్పు డట్టిభాగ్యంబు లేకపోయెం గదా యని
విలపింపం జొచ్చుటయు నంత నేనది యంతయు విని బాల్య
వశంబునం జేసి యామె మనోదుఃఖంబు నెఱుంగం జాలక
యామెతో నిట్లంటి:— 55

క. జననీ! నే నిపు డది గనఁ
జని వెండియు వచ్చి పాఠసహితంబుగ నీ

కును దన్నాట్యము సర్వం
బును గాన్పించెదను వగపుఁ బొందఁగ నేలా! 56

క. ఆనందం బెవ్విధమున
నా నాట్య మొనర్చు నట్టి యది యంతయు నీ
కానందమ్ముగఁ జూపెద
నానతి యిడు మిప్పు డచటి కరుగఁగ నాకున్. 57

సీ. అనుటయు మాదు గేహమునందు విడిసిన
యా విప్రవరులు, నే ననినపల్కు-
లాలించి "యద్దిరా! యతిమనోహరము నీ
పాపని సుమనోజ్ఞ భాషణములు
తా నొక్కపరి గాంచి తన్నాట్య మంతయు
వెండియుఁ జననికి వినుచు నంట
చిన్నవాఁ డయ్యుఁ దాఁ బెద్దమాటలు పల్కు-
చున్నవాఁ డియ్యది యెన్నఁ దగదె"
గీ. యనుచు నాపల్కులకు విస్మయము ముదమ్ముఁ
గనుచు నుండఁగ నంత మా జనని వారి
నరసి యిట్లనె నాయనలార! యింత
యేమిటికి వీని మాట లివెల్ల నిజము. 58

క. సతతమ్మును వీఁడు సకృ
చ్ఛ్రుత విషయమ్ములను బుద్ధిసూక్ష్మత వెలయున్

మతి ధరియించి మరల న
ద్భుతముగ వచియించుఁ దప్పు దొరలక యుండన్. 59

క. అనినన్ దద్విప్రులు న
మ్మనములఁ గౌతూహలమ్ము మల్లడిగొనఁ దో
డనె ప్రాతిశాఖ్య యనఁగాఁ
జనియెడు గ్రంథ మ్మొకండు చదివి వినుచుడున్. 60

గీ. దాని నంతయు నేను సాంతముగ నాల
కించి వెండియుఁ దప్పొక యించుకేని
గలుగకుండఁగ నా విన్నకరణి నపుడ
మరలఁ జదివితి వారి కబ్బురము గాఁగ. 61

వ. అదియునుం గాక:— 62

గీ. అవల నా బ్రాహ్మణులతోడ నరిగి నాట్య
మంతయును జూచివచ్చి మా యంబ యెదుట
నదియు నకలంబు నేర్పుగా నాడిపాడి
చూపితిని వెండియును, వారు చోద్య మొంద. 63

వ. అప్పు డా బాడబు లిరువురు నత్యంతాశ్చర్య పరవశ మన
స్కులు నమందానంద సంకలిత హృదయులు నగుటయు
నంత వారిలో వ్యాడియనుపేరం బరఁగువాఁడు నన్ను శ్రుత
ధరునిగా నిశ్చయించుకొని నా జనయిత్రికిఁ బ్రణామం
బొనర్చి యామెతో నిట్లనియె. 64

శా. ఓ విశ్వస్తవనీయపుణ్యచరితా! యో తల్లి! నే నీకు మా
యావద్వృత్తము విన్నవింతు విను మమ్మా! వేతనంబన్ పురిన్
దేవస్వామి, కరంభకుండు నను ధాత్రీదేవు లన్యోన్య స
ద్భావుల్ సోదరు లుండువారు గుణసంపచ్చారుచారిత్రులై.

గీ. వారిలో నొక్కరునికిఁ గుమారుఁ డితఁడు
నేనును దదీయ సోదరునికి సుతుండ
నింద్రదత్తుండు నా నొప్పు నితని పేరు
వ్యాడి యను నామధేయంబు వాఁడ నేను. 66

క. నే జనియించిన పిమ్మట
నా జనకుఁడు కాలవశమునం జనుటయు, న
వ్యాజానుజశోకమ్మునఁ
దాఁ జనె నీ యింద్రదత్తు తండ్రియు దివికిన్. 67

వ. అంత:— 68

ఆ. పతి వియోగదుఃఖభరమున హృదయంబు
లగల, మమ్ము విడిచి యకట! యస్మ
దంబలును నిజేశ్వరానుచారిణులుగాఁ
జనిరి తనువుఁ దొఱఁగి స్వర్గమునకు. 69

వ. అట్లాసమయంబున:— 70

మ. తలిదండ్రుల్ స్మరణీయులై చనఁగ విత్తంబుండినన్ మాకు న
వ్వల దిక్కెవ్వరు లేకయుండుట నిజావాసమ్ము వర్జించి మే
మలఘద్వక్షుని గాత్రి కేయుఁ గరుణాయత్తాత్ము విద్యాభిలా

షులమైఁ గొల్వఁగఁబోయి యొక్కెడఁ దపస్సల్ సేయుచు
న్నంతలోన్. 71

సీ. భక్త వంతాపిత యా భర్గదేవ సుతుండు
స్వప్నంబునందు సాక్షాత్కరించి
నందుఁడన్ మేదినీ నాథుండు పాలించు
పాటలికంబను పట్టనమున
వర్షుం డనెడు విప్రవర్యుండు గలఁడు; మీ
రాతనికడ శిష్యు లౌదు రేని
సకల విద్యలు మీకు సమకూరుఁ గావున
నచటికిఁ జనుఁ డని యానతిచ్చె

గీ. నంత మేమును మేల్కని యచటి కరిగి
వర్షపండితుఁ డెందున్న వాఁ డటంచుఁ
బౌరవర్గంబు నడుగంగ వార లిచటఁ
బండితుండగు వర్షుఁ డొక్కండు లేఁడు. 72

ఆ. కాని, యిందు మూర్ఖుఁడైన కొండొక విప్ర
కులుఁడు వర్షనామకుండు గలఁడు
కడు దరిద్రుఁ డతేఁడు; కనుఁగొనం గోరినఁ
జనుఁ డదే తదీయ సద్మ మనిరి. 72

వ. అనిన నది విని:— 73

క. ఏ మందు నప్పు డోయి
మ్మా! మే ముయ్యాలలూఁగు మనములతో నా

స్వామి కుమారుఁడె యున్నాఁ
డే మగునో చూత మనుచు నేఁగితి మటకున్. 74

వ. ఇట్లచ్చటికి నేఁగి:— 75

చ. పొలుపఱి జాఱి క్రిందఁ బడిపోయెడు కప్పును, బెద్దపంది కొ
క్కుల కిరవైన గొప్పకలుఁగుల్, పెనుబీటలువాఱి కూలనై
నిలిచిన కుడ్యముల్ గలిగి నిష్కళమై బహుళాపదావళుల్
వెలసెడు తావనం దగిన వేశ్మ మొకం డటఁగంటి మయ్యెడన్.

గీ. అందొక ద్విజుండు ధ్యాననిష్ఠాత్ముఁ డగుచు
జప మొనర్చుచునుండె నిశ్చలముగాఁగ
నంత మేమది వర్షగేహముగఁ దెలిసి
యా గృహములోని కల్లన నరుగుటయును. 77

గీ. చినఁగిపోయిన యొక ప్రాఁతచీరఁ దాల్చి
ధూసరక్షామ దేహంబుతోడ నొప్పు
వర్షు నిల్లాలు, తద్గుణ వత్సలయయి
వలచి వచ్చిన దుర్గతివలెఁ దనరుచు. 78

ఆ. కానవచ్చి మాకుఁ గావించె నతిథి స
త్కార మంత మేము గౌరవమును
భక్తియును దలిర్పఁ బ్రణమిల్లి యామెతో
సముచితప్రసంగ సరణి నడపి. 79

వ. అస్మదీయ వృత్తాంతం బాతయు నామె కెఱింగించి పదంపడి
తత్పురంబున మాచే వినంబడిన తదీయ భర్తృమూర్ఖత్వ

విఖ్యాతియుం దెలియుం జెప్పుటయు నంత నది విని యాపతి
వ్రిత మమ్ముల నుద్దేశించి:— 80

క. వినుఁ డయ్య! మీరు నాకుం
దనూభవులవంటివారు; తలపఁగ మీ చెం
తను లజ్జపడఁగ నేమిటి
కని తన కథ నిట్లు సెప్ప నారంభించెన్. 81

— వర్షోపాధ్యాయుని వృత్తాంతము —

గీ. శంకరస్వామి యనెడు ద్విజన్ముఁ డొకరుఁ
డుండువాఁ డిప్పురంబున నుత్తముఁ డయి
యాతనికి నాదు పెనిమిటి యైన వర్షుఁ
డితఁడు నుపవర్షుఁడును జనియించిరి సుతులు. 82

గీ. వార లిరువురలోఁ బెద్దవాఁ డితండు
మొదటి నుండియు నధనుండు మూర్ఖుఁడు నయి
యుండె; రెండవయాతఁ డీ యోజఁగాక
యుక్తరీతి నేతద్వ్యతిరిక్తుఁ డయ్యె. 83

వ. ఇట్లితండు సర్వవిధంబులను సమర్థుండై యుండి యస్మత్కు
టుంబభారంబెల్లఁ దానె వహించి యింటిపెత్తనం బంతయుఁ
దన భార్య కొసంగుటయు, నంతఁ గొంతకాలంబునకు. 84

సీ. క్రమముగా నొక వానకాలంబు సనుదెంచె;
నప్పు డిప్పురి నున్న యతివ లెల్ల

గుడముఁ బిష్టంబునుగూర్చి యసహ్యంబు
గా గుహ్యరూప భక్ష్యము లొనర్చి
మూర్ఖులై మను ద్విజుమ్ములకు దానము లిడఁ
గడఁగి; రట్టిడ శీతకాలమందు
స్నానశ్రమమును గీష్మర్తువందుఁ బ్రచండ
తాపశ్రమంబును దమకుఁ గలుగ
గీ. వనెదు విశ్వాసమునఁజేసి; యట్టు లిచ్చు
దానము విచేయ లెవ్వరుంగాని కొనఁగ
సమ్మతింపరు దోషపరిసంగభీతి;
నంత మాతోఁడికోడ లయ్యది యెఱింగి. 85

గీ. తా నొసఁగనున్న యన్నిచదాన మప్పు
డెఱుకమాలిన మద్భర్త కితని కిచ్చె
దక్షిణాపూర్వకమ్ముగా దాని నితఁడు
గైకొనియెఁ దాను విగత వివేకుఁ డగుచు. 86

ఆ. అది పరిగ్రహించి యరుదేర నేఁ జూచి
కోపమెనఁగ విసువుకొంటి నితని;
నంత నితఁడు తనదు నవివేకమునకు నై
కరము హృదయమందుఁ బరితపించి. 87

వ. విద్యావిహీనుండ నగుటచేతంగదా నా కిట్టి యవివేకంబు తట
స్థించె నని తలంచి. 88

చ. చని భగవంతుఁ డైన గిరిజాసుతుఁ నాశ్రితవత్సలున్ మహా
నను నతిభక్తి మీఱఁగ మనంబున నిల్పి తపం బొనర్చె; నం
త నతఁడు నత్కృపావశతఁ దద్దయుఁ బ్రేముడిమీఱ నీతనిం
గనుఁగొని సర్వవిద్యలుఁ బ్రకాశముగాఁగ ననుగ్రహించె దాన్.

ఆ. అట్లనుగ్రహించి యవ్విద్యలను నకృ
చ్ఛ్రుతధరుండు భూమి సురసుతుండు
దొరకినపుడుమాత్రి మెఱిఁగింపు; మందాకఁ
జెప్పఁబోకు మని వచించుటయును. 90

క. చనుదెంచి యయ్యుదంతం
బును నా కెఱిఁగించె సర్వమును; నది మొద లీ
యనఘుండు జపధ్యానము
లొనరించు నియతి నిట్టు లుండఁ దొడఁగెన్. 91

వ. శ్రుతధరుం డైన బ్రాహ్మణుండు లభించుదనుక నితఁడు తన
విద్యల నొరుల కుపదేశింప నారంభించుటకు వలనుగాదు:—

గీ. కాన మీఁరేఁగి శ్రుతధరుం డైన యొక్క
విప్రు నెచ్చోటనేనియు వెదకి తెండు
దాన, మీకోరునట్టి యర్థంబు సిద్ధి
యగుఁ; జనుం డిఁక నేసందియము వలదు. 93

గీ. అనుచు నవ్వర్షపత్ని యి ట్లానతీయ
నామె వచనములను విని యట్లసేయఁ

దలఁచి, పదపడి తద్దరిద్రతఁ దొలంప
నామె కొక హేమశత మిచ్చి యాతఁడంబ. 94

వ. నేమును దత్పురంబు నిర్గమించి చని. 95

చ. శ్రుతధరుఁ డైన బ్రహ్మకులజుం గనుఁగొందుముగాకటంచు నీ
క్షితి సకలమ్ముఁ గ్రుమ్మరి విశేషపరిశ్రమ మాచరించి చూ
చితి; మటువంటివాఁ డెటను జిక్కకపోవఁగ నంత నిట్లు వ
చ్చితిమి భవద్గృహంబునకుఁ జేడ్పడి వేసట గాసినొందుచున్.

వ. అయ్యనంతరమున:— 97

క. ఏక శ్రుతధరుఁ డగు నీ
యాకొమరుని గంటి మిచట నిన్నాళ్లకుఁ ద
ల్లీ! కరుణతోడ నీతని
మా కొసఁగుము నీకివే నమస్కారంబుల్. 98

ఆ. వె. ఇంతకంటె మాకు నితరుండు శ్రుతధరుం
డింక దుర్లభుండు పృథ్విలోనఁ
గాన నితని మాకుఁ గరుణింపు మమ్మ వి
ద్యార్థ సిద్ధి వడయ నరుగ వలయు. 99

చ. అనవుడు వ్యాడివాక్యముల నాదర మొప్పఁగ నాలకించి మా
జనని యనెన్ "ద్వదుక్త మిదిసంగతమౌ; నిటనాకుఁ బ్రత్యయం
బునుగల; దెట్లనన్ వినుము; పూర్వమువీఁడిటనాకుఁ బుత్త్రుఁడై
జననము నొందినప్పు డొకసంస్ఫుట వాగశరీరి యిట్లనెన్.

గీ. "శ్రుతధరుం డగు వీఁడు వర్షుఁడను విప్రు
వలన విద్యల నన్నింటిఁ బడయు; మఱియు
శబ్దశాస్త్రంబు లెస్సగా సంస్కరించి
జగమునఁ బ్రతిష్ఠ సేయు నిస్సంశయముగ. 101

క. ఎది యెది వర మగు భువి న
య్యది యది రుచియించు వీని; కట్లగుట, గుణా
స్పదమగు వీఁ డిఁక వరరుచి
పదమున ననిశమ్ముఁ బిలువఁబడుఁగాక ధరన్." 102

గీ. అనుచు వచియించెఁ; గాన, నీయర్భకుండు
నుచిత విధమునఁ బెరిఁగి వయోభివృద్ధిఁ
జెందినప్పటినుండి నేఁ జింతసేయుఁ
చున్నదానను వర్షుఁ డెం దుండు ననుచు. 103

వ. ఆవర్షోపాధ్యాయుండు వీని కొజ్జ యగుట యెట్లొకో యనియు
రేయుంబవళ్లు విచారించుచున్నదాన :— 104

ఉ. నాయనలార! మీకతమునన్ దెలియంబడె నయ్యెదెల్ల నా
కీయెడ; దానఁజేసి మది నెంతయు సంతస మావహిల్లె; మీ
కీయఁగ నెంతు వీనిఁ; గొనిపొండు; వీఁడును మీకు సోదరుం
డేయగుఁగాక! వీని కిఁక నేమికొఱంతయుఁ గల్గ దెయ్యెడన్.

వ. నాకు మీయందు దట్టి విశ్వాసంబు గలదు; కావున వీఁడు నా
కేకపుత్త్రుండ వై యున్నను విద్యార్జనమ్ము పొంటె మీవెంట
నంపుట కిచ్ఛగించిన దాన:— 106

గీ. అనిన, మన్మాతృవచనంబు లాలకించి
వ్యాడియును నింద్రదత్తుండు హర్షపూర్ణ
హృదయులై యక్కతమున రేయెల్ల నొక్క
నిముస మేనియుఁ గనుమూసి నిదురఁగొనక. 107

క. ఆనందవశంబున నిజ
మానసములు పొంగిపొరల మాజననియితిన్
మానితగతిఁ గొని యాడుచు
నా నిసి వెడలంగఁ బుచ్చి; రమ్మఱు నాఁటన్. 108

గీ. వెలయ నాకు వేదార్హతగలుగు పొంటె
నుపనయనమును గావింప నుత్సహించి
వ్యాడి యొక కొంతధనము మాయంబ కొసఁగి
తాను నన్నుపనీతునిగా నొనర్చె. 109

వ. పదంపడి యావ్యాడీంద్రదత్తులు నన్నుఁ దమవెంటఁ బెట్టు
కొని మాతల్లికిఁ బ్రణమిల్లి పోయి వచ్చెద మని చెప్పుటయు
నానమయంబున:— 110

చ. కనుగొనలందు బాష్పములుగ్రమ్ముచునుండఁగ నేకపుత్త్రునిన్
నను విడలేక యెట్టులో మనంబు తిరంబుగఁ జేసికొంచు, మా
జనని యనుజ్ఞ నీయఁ దమచాతురి నాయమ నూరడించి నన్
గొని చని రాపడాసను నమగ్రహ మింక ఫలించునం చొగిన్.

గీ. ఆవెనుక మేము క్రమముగా నరిగి వర్ష
గురువరుని మందిరముఁ జేరుకొంటి; మంత

నామహాత్మ్యఁడు నను మూర్తమైన కార్తి
కేయుని యనుగ్రహముగ నీక్షించి యలరి. 112

వ. వ్యాడీంద్రదత్తులవలన మదీయవృత్తాంతం బంతయు నెఱింగి తా నిఃక షణ్ముఖాజ్ఞానుసారంబుగాఁ దన విద్యావిశేషంబులు శిష్యుల కుపదేశించి ప్రకటింప నుపాయంబు లభించినందుల కెంతయు సంతోషించి. 113

క. మఱునాఁ డాతఁడు మము ముం
దర నిడుకొని యొక్క పావనస్థలి దర్భా
స్తరణోపవిష్టుఁడై యోం
కరణం బొనరించె దివ్యకంఠధ్వనితోన్. 114

వ. ఇట్లు లవ్వర్షోపాధ్యాయుండు మా ముువ్వురకును నిగమ విద్యోపదేశం బొనర్ప నోంకరణంబుఁ గావించుటయు:—

ఉ. మంగళబుద్ధివై భవనముగ్రిన కాలని కంతలోపలన్
సాంగముగాఁగ వేదనిచయం బది కన్నులఁ గట్టినట్టు ల
య్యెం గరుణామయుం డయిన యీశ్వరపుత్త్రు మహాప్రసా
ద లక్ష్మిం గని నట్టివారలకుఁ జేకుఱరాని దొకండు గల్గునే? 117

వ. ఇవ్విధంబున :—

క. పరిలబ్ధ నిగమ విద్యా
ధురంధరత నొప్పి యతఁడు తోడ్తో మా ము

వ్వరశను దద్వేదంబులు
గఱపఁగ మొన లిడియెఁ బ్రీతిగౌరవ మెసఁగన్. 118

వ. అంత నా సమయంబున:— 119

క. ఒకపరి విని నేనును మఱి
యొకపరి విని వ్యాడియును మఱొకపరి విని తాఁ
బ్రకటముగ నిందృ దత్తుఁడు
సకలమును గురూక్తముఁ గొనఁ జాలితి మంతన్. 120

ఉ. నవ్యతరంబు తన్నిగమనాదము తత్పురమందుఁ బర్వ నీ
దివ్యనినాద మే మని మదిం గడు విస్మితు లౌచుఁ దత్ప్రవా
స్తవ్యులు వేదవేత్తలు ద్విజన్ములు వే చనుదెంచి మ్రొక్కి- స్తో
తవ్యుని వర్షునిన్ బహువిధస్తుతులన్ గొనియాడి రెంతయున్.

వ. మఱియు నీ వర్షుం డింతదనుక విద్యాగంధం బెఱుంగక మొ
ఱకు చందంబున నున్నవాఁ డింతలో నింతటి విద్వాంసుం
డెట్లయ్యె నని యచ్చెరువడుచు:— 122

చ. అపు డటు సంభవించిన తదద్భుతకృత్య మదెల్లఁ గాంచి వా
రిపరిమితప్రమోదభరితాత్మకులై యుపవర్షభిన్న పౌ
రపురుషముఖ్యులెల్లరుఁ బురంబున నెల్లెడ నుత్సవంబులన్
విపులముగా నొనర్చి సరవిన్ భజియించిరి వర్షపండితున్.

వ. ఉపవర్షుండును దత్పత్నియు మాతృమసూయానిష్ట మనస్కు
లై యమ్మహోత్సవంబునం బాలుగొన కుండి రది యట్లుండ
మఱియు నా సమయంబున:— 124

మ. గిరిజానూనువరప్రసాద మహిమోత్కృష్టున్ సమస్తాగమ
స్ఫురణున్ మాగురుఁగాంచి, నందవసుధేశుం డాత్మలో నెం
తయున్। బరితోషంబు వహించి తద్గృహము దివ్యత్స్వర్ణ
వర్షంబునన్। బరిపూరించి కృతార్థుఁడై యతని సంభావించె
భక్త్యున్నతిన్. 125

శ్రీశ్రీశ్రీ

కథాపీఠలంబకంబున ద్వితీయ తరంగము

సమాప్తము



ఓమ్ !

# ఆంధ్ర
# కథాసరిత్సాగరము.

## కథాపీఠలంబకము. ౧.

:0:

### తృతీయ తరంగము

క. అని కాత్యాయనుఁ డిట్టులు
వినిపించి, తదేకచిత్తవృత్తి నలరుచున్
విను కాణభూతితో ని
ట్లని వెండియుఁ జెప్పఁ దొడఁగె నవ్వలి కథయున్. 1

వ. మిత్త్రమా! కాణభూతీ! యివ్విధంబున మేము ముగ్గురము నవ్వర్షోపాధ్యాయునితోడ వేదాధ్యయనం బొనర్చుచుండి. 2

గీ. అప్పు డొకనాఁడు స్వాధ్యాయమైన పిదప
నస్మదీయగురుండు కృతాహ్నికుఁ డయి
స్వస్థచిత్తంబుతో నున్నసమయ మెఱిఁగి
యమ్మహాత్మునితోడ ని ట్లంటి మేము. 3

క. అనఘాత్మక! యివ్వార మి
య్యానువున విద్యలకు సిరికి నావాసంబై

తనరుచు మఱియు న్నిచ్చలు
ననుపమ శోభాశ్రీయంబునై విలసిల్లుఁ. 4

క. కన నిదియు వింతయై తోఁ
చును; పెఱ నగరమ్ము లిట్లు శోభింప నిది
ట్లునికికిఁ గత మెయ్యదియో
యనుగ్రహముమీఱ వినవ నగునే యార్యా! 5

వ. ఇదియునుంగాక యుర్వీవరంబునకుఁ బాటలీపుత్రకంబను నామధేయం బెట్లుగలిగె నయ్యదియును విన వేడుకపడుచున్నవార మని మేము వేఁడుకొనుటయు:— 6

గీ. అంత సద్గురువర్యుఁ డత్యాదరాంత
రాత్ముఁడై మమ్ముఁ గని వత్సలార! మీకుఁ
దత్కథం జెప్పెదను సావధానులగుచు
నాలకింపుఁ డటంచు నిట్లని వచించె. 7

వ. అది యెట్లనిన:— 8

—♦ పాటలీపుత్ర కథ ♦—

గీ. ధరణి గంగాతరంగిణీ ద్వారదేశ
మందుఁ గనఖల మనుపేర నతిపవిత్ర
మైన యొకపుణ్యతీర్థ మొప్పారుచుండుఁ
జిరతరంబుగ లోకప్రసిద్ధ మగుచు. 9

ఆ.వె. ఆ పవిత్రతీర్థమందు మున్ కాంచన
పాతి మనెడు దివ్యభద్రదంతి

ప్రకటముగ నుశీనర గిరి నెత్తంబు భే
దించి గంగ నిలకు దింపెఁ దొలుత. 10

వ. అక్కతంబున నది యత్యంతపావనక్షేత్రం బై విరాజిల్లుచుండ

సీ. అం దొక్క దాక్షిణాత్యమహీసురుఁడు నిజ
పత్నీ సమేతుఁడై భక్తి యుక్తిఁ
దపము సల్పుచు నిత్యధర్మతత్పరబుద్ధి
యై వసించుచు నుండ నతని కచటఁ
దనయులు మువ్వు రుద్భవమొంది; రంతట
నాబ్రాహ్మణుఁడును భార్యయును గాల
వశమునఁ జేసి దివంబున కరుగంగ
నావిప్రబాలకు లచటినుండి

గీ. "రాజగృహ" మనియెడు నగరమున నుచిత
విద్య నభ్యసింపఁ దలంచి వెడలి యచటఁ
గొంత విద్యార్జన మొనర్చికొనియు నంత
నొక్కతటిఁ దమకు నెవ్వరున్ దిక్కు లేమి. 12

గీ. తమ యనాథత్వమునకుఁ జిత్తమున మిగుల
వగపు నిగుడంగ నాశ్రితవత్సలుండు
భక్తజనసులభుఁడు నయి పరఁగు షణ్ము
ఖేశ్వరు భజించి బ్రతుకంగ నిచ్ఛగించి. 13

క. పని వట్టి దక్షిణాపథ
మున కేఁగి త దబ్ధి తీరమున నొప్పెడు చిం

చిని యను నొకపురవరముం
గనుఁగొని రెంతయును ముదము గడలుకొనంగన్. 14

వ. కని యప్పురంబునం బ్రవేశించి. 15

గీ. భోజికుం డను నొక్క విప్రుని గృహమున
కరిగి యాతని యనుమతి వంది యచట
నధివసించుచునుండ, నాయనయుఁ దనకుఁ
బురుషసంతతి లేకుంట బుద్ధిఁ దలఁచి. 16

వ తానును వయోవృద్ధుండై యున్నకతంబునఁజేసి వైరాగ్యం
బుఁ గొని వానప్రస్థాశ్రమస్వీకారంబు చేసి వనంబున కరిగి
తపం బొనరింప నిశ్చయించుకొనియున్నవాఁ డగుటంజేసి:—

క. ఆవిప్రకుమారకులను
మూవుర ననురూప పాత్రములుగాఁ గని స
ద్భావముతో వారల సం
భావించుచు నంత మిగులఁ బ్రిమద మెసంగన్. 18

క. తన మూవురు పుత్త్రికలను
దనకుం గల సకల ధనముఁ దద్బ్రాసుర నం
దనులకు నొసంగి పదపడి
చనియెఁ దపం బాచరింప జాహ్నవి దరికిన్. 19

వ. ఇట్లు భోజికుండు తపంబున కరుగుటయు నంత నా మువ్వురు
బ్రాహ్మణ కుమారులును వయఃక్రమంబున నతని కుమారి
కలు మువ్వురం బరిగ్రహించి వారితోఁ దదీయగేహంబున

నిష్టోపభోగంబు లనుభవించుచుఁ గొంతికాల ముండుటయు.
గీ. అప్పుడు వా రట్లు శ్వశురగేహమునఁ బరమ
సౌఖ్యముగ నుండఁ గొండొక సమయమందు
దుర్భర మగు ననావృష్టిదోష మొకఁడు
సంభవింపఁగ భీకరక్షామ మొదవె. 21
గీ. అట్టి యా క్షామదినసంబులందుఁ దద్ద్వి
జన్మ పుత్త్రులు ముగురును శ్వశురదత్త
విత్తమంతయు వ్యయ మయి వెడల, మిపులఁ
జిక్కుపడి జీవయాత్రలు సేయ వెఱచి. 22
వ. ఆత్మోదరపోషణంబునకుం దోడు భార్యాపోషణంబును బహు
దుర్భరంబుగా నుండుటంజేసి యా యన్నదమ్ములు ముప్వు
రును మంతనంబున ననోన్యంబు నాలోచించుకొని. 23
చ. సతుల ననూనరూప విలసన్నవయౌవన భాగ్యవైభవో
న్నతుల సమస్త సద్గుణగణ ప్రణయాంచితలన్ మహా పతి
వ్రతలఁ బరిత్యజించి తమ ప్రాణములన్ నిలఁబెట్టుకోఁ దలం
చి తరలిపోయి రెమ్మెడకొ చెల్మి యొకింత దలంప కక్కటా!
చ. హితలయి భక్తితోఁ గొలుచునింతుల నొంటిగ నింట వీడి, యే
కతమ తమంతఁదాము బ్రతుకం దలపోయుచుఁ బాటిపోయి రీ
వితముగఁ దత్సహోదరులు పీతదయాత్మకు లౌర! యిట్టి దు
ర్మతులమనంబు లెంత యనురాగవిహీనములో తలంపఁగాన్.
వ. ఇవ్విధంబున నా బ్రాహ్మణులు తమ భార్యలను వీడి పరదేశం

బునకుఁ బలాయనంబు సేయునప్పటికిఁ దద్విప్రపత్నులయందు మధ్యమ గర్భవతియై యుండె; నప్పు డక్కాంతలు మువ్వు రును దమ పతులకై యెంతయు వగచుచు నక్కఁడవుకాలం బునం బురుషసాహాయ్యంబు లేక యింకఁ దా మక్కడ నొం టియై జీవయాత్ర యొనర్చుట దుర్ఘటం బని యెంచి యచటి నుండి వెడలి తత్సమీపదేశంబునఁ దమ జననినకుఁ బ్రియ మిత్త్రుండై యున్న యజ్ఞదత్తుం డను నొక్కయుత్తమ విప్రుని గృహమ్మునకుఁ జేరుకొని. 26

క. ఆతఁడు తమ దుస్థితికై
చేతమ్మున మిగుల వగచి చేకొని, స్వతనూ
జాతల వడువునఁ దలఁచుచుఁ
బ్రీతిం బోషించుచుండఁ బ్రియ మెసఁగంగన్. 27

చ. హృదయములందు నెప్డు నిజేశ్వరులన్ దలపోసికొంచు లో
నొదవెడు దుఃఖ మెట్టు లెటులో భరియించుచు,దీనవృత్తిఁ ద
త్సదనమునందు భవ్యచరితన్ వసియించుచునుండి; రాపదల్
గదిరినయప్పుడేస కులకాంతలు పీడరుగా స్వధర్మముల్? 28

వ. అది యట్లుండె :— 29

ఆ.వె. అవలఁ గొంతకాల మరిగినపిదప మ
ధ్యమకుఁ బుట్టె నొక్క యాత్మజుండు
భర్తవలనఁ దొల్లి పడసిన గర్భంబు
దైవకృప నెసంగి తగ ఫలింప. 30

ఆ.వె. అంత నక్కుమారు నమ్మువ్వురుపడంతు
కలును, దమ కతండ గతి యటంచుఁ
దలఁచికొని మహోన్నతప్రేమభరమునఁ
బెంచుకొనఁ దొడంగి రంచితముగ. 31

క. దినదినము వానియెడ న
వ్వనితల కన్యోన్యమును బ్రవర్ధిల్లఁ దొడం
గెను గడు నపురూపం బగు
ననురాగాతిశయ మెరుల కాశ్చర్యముగాన్. 32

సీ. అట్లుండ నంత నొకప్డు డీశ్వరుఁ డభ్ర
చారియై విహరింపఁ జాగుటయును
నద్దేవుపార్శ్వంబునం దున్న పార్వతీ
దేవి క్రిందికిఁ దనదృష్టిఁ బఱపి
ముగురుతల్లులకుఁ బ్రేముడి ముద్దుబిడ్డయై
యలరు నబ్బాలుని నరసి, వానిఁ
దమ కేడుగడగాఁగఁ దలపోసి మురిసెడు
పడఁతుల మువ్వురం బాఱఁజూచి

గీ. యంతలోననె నదయాత్మ యగుచు వేడ్క
మీఱఁ దన ప్రాణవిభునకు వారిఁ జూపి
కనుఁగొనుము నాథ! యా క్షీరకంఠుఁడైన
బాలకుని, వాని ముద్దాడు పడఁతుకలను. 33

క. వ్రేలెం దున్నాఁ డప్పసి
బాలుఁడు త మ్మెపుడొ ప్రోవఁ బాల్పడు నని యా
స్త్రీ లెంత యాసతో నిపు
డేలీల\n బెంచువారో యీక్షించితివే? 34

గీ. పాప! మాతల్లులను జిన్నపాపఁ డయ్యొ
వాఁ డిపుడె యెట్లొ యుద్ధరింపం గలిగెడు
పగిది నీవు కటాక్షింపవలయు నాథ!
యయ్యనాథల దురవస్థ లంతరింప. 35

వ. అని యివ్విధంబునఁ బార్వతీదేవి పరిపూర్ణ కరుణారస తరంగి
తాంతఃకరణయై పలికిన విని భక్తలోకాభీష్టవరప్రదాతయగు
పరమేశ్వరుం డామెతో నిట్లనియె. 36

గీ. పార్వతీ! విన్ము; వాఁడు తద్భార్యతోడఁ
దొల్లి నన్నెంతయును భక్తితో భజించి
యున్నభక్తుఁడు; వాని నే మున్న యెఱిఁగి
యున్నవాఁడను జుమ్ము పయోరుహాక్షి! 37

ఆ.వె. వాఁడు తొల్లి యట్టి భక్తవర్యుండయి
యున్నకతన నిప్పు డుర్విలోన
భూరి భాగ్య విభవ భోగానుభూతికై
పొడమె నిట్లు పూర్వపుణ్యమహిమ. 38

ఉ. వీని సతీలలామమును విశ్రుతుఁడైన మహేంద్రవర్మభూ
జానికిఁ బాటలీరుచిరసంజ్ఞఁ దనూద్భవయై జనించి య

న్యూనమనోహరాకృతి సముజ్జ్వలయై ధర నొప్పుచుండె న
చ్చానయె వీని కిప్పుడును జాయ యగున్ బరమానురక్తితోన్.

గీ. వీఁడు నప్పువ్వుఁబోణితోఁ గూడి మాడి
తల్లులకు మువ్వురకును మోదంబుగాఁగ
నభిమతసుఖాంబునిధి నోలలాడఁగలుగు
నచిరకాలంబులోనె భాగ్యాధికుఁ డయి. 40

వ. దేవీ! వీనికై విచారింపం బనిలేదు. వీఁ డింతకు మున్న మదీ
యానుగ్రహంబునకుఁ బాత్రంబై యున్నవాఁ డని యానతిచ్చె

క. చని, పిమ్మట శంకరుఁ డా
వనితలు మువ్వురకు రాత్రి స్వప్నములో న
త్యనుకంపాయత్తుం డై
కనఁబడి యిట్లనియె మిమ్ములఁ గౌతుక మొదవన్. 42

చ. పొలఁతుకలార! మీ యనుఁగుఁబుత్రకుఁ డాఖ్యనుబుత్రకుం డనా
వెలయఁగలండు; నిత్యమును వీఁ డుదయంబుల నిద్రలేచులో
పలఁ దలక్రిందఁ జూచిన సువర్ణము లొక్కొక లక్ష యుండు;న
వ్వలఁ గ్రమవృద్ధి వీఁ డొక నృపాలకుఁడై విలసిల్లు నిద్ధరన్.

ఆ. అని యనుగ్రహించి యా దేవదేవుఁ డం
తర్హితుండుగాఁగఁ దత్క్షణంబ
యప్పడంతు లప్పు డత్యంత విస్మయ
మేదురాత్మ లగుచు మేలు కాంచి. 44

వ. అన్యోన్య స్వప్నవృత్తాంతంబు లొకరితో నొకరు చెప్పికొని

వింతపడుచు నాఁటి సూర్యోదయ సమయంబున:— 45

ఆ. పుత్త్రకుండు నిద్రపోయి లేవఁగనె త
చ్ఛయ్యపైఁ దలాఁపి చక్క స్వర్ణ
లక్ష నెలసియుండ నీక్షించి నిరవధి
క ప్రమోదహృదయ కమల లగుచు. 46

వ. నిజ జనక నిర్విశేషుం డైన యజ్ఞదత్తునకుఁ దద్వృత్తాంత
మంతయు నెఱింగించి యతనితో నక్కాంత లెంతయు నా
నందింపం దొడంగి; రయ్యనంతరంబునఁ బుత్రకుండును క్ర
మాభివృద్ధి నొందె. 47

గీ. అనుదినంబును బెరిఁగెడు నా సువర్ణ
సంచయముచేఁ బ్రవర్ధిత సంపదుఁ డయి
యచిరకాలంబులోన రాజ్యాధిపత్య
విలసితుఁడు నయి పెంపున వెలయఁ దొడఁగె. 48

క. మానవుఁ డొకప్పు డెంతటి
దీనుం డగుఁగాక నే యదృష్టంబుననో
శ్రీ నెనఁగున్; బూర్వతపో
ధీనమ్ములు గావె సిరులు తెలియఁ గలిగినన్? 49

వ. అది యట్లుండెఁ; బుత్రకుం డివ్విధంబున మహైశ్వర్య సంప
న్నుం డై యభివృద్ధి నొందుచుండ నంత నొక్క సమయం
బున యజ్ఞదత్తుం డతనితో రహస్యంబుగా నిట్లనియె, 50

గీ. ఓధరాధీశ! తొల్లి యత్యుగ్ర మైన
కాటకము సంభవింప నక్కఱవువేళ
సతుల నెడఁబాసి యెచటికో చనిరి నీదు
జనకు లక్కటా! యాత్మ రక్షణముపొంటె. 51

వ. నాఁటినుండి నేఁటిదనుకను వారి జాడ యెందును వినంబడకున్నయది. నీ తల్లులు ముగ్గురును బతివియోగదుఃఖంబునఁ బరితపించుచున్నవారు; తత్పుత్రకుండ వైన నీవిప్పు డిట్లు సమస్తదుస్తరకార్యసంఘటనాసమర్థుండవై న రాజవై యున్నవాఁడవు; కావున నీసమయంబున నీజనకుల నెవ్విధంబున నైన నిచ్చటికి రప్పింపం బ్రయత్నించుట యెంతయు సముచితంబై యుండుఁగాదే? 52

క. పరమేశ్వరుని యనుగ్రహ
భరమున నీ కొదవె నింత భాగ్యం బిటు; లీ
సిరి గలిగినందులకు, వా
రరుదెంచినఁ జూచి యెంత యలరుదురో కదా? 53

వ. వారు తమయంతన తా మిచ్చటి కరుదెంచుట కొక్క సులభోపాయంబునుం గల; దది యెట్లనిన, నీవు నిత్యంబును బ్రాహ్మణులకు వివిధ దానంబులు గావింపఁ గడంగునది; భవదీయదాతృత్వవిశేషంబు క్రమంబుగ జగద్విఖ్యాతం బగు; నంత నీ జనకులును ధనార్థులై యున్నవారు కావున నది విని ప్రతిగ్రహణేచ్ఛం జేసి యిచ్చటి కరుదెంచెద; రిందులకు

నిదర్శనంబుగా బ్రహ్మదత్తుని కథ యొకండుగలదు; చెప్పెద; నాకర్ణింపుము. 54

—♦ బ్రహ్మదత్తుని కథ ♦—

గీ. మున్ను వారాణసీ పురంబున కధీశుఁ
డగుచు విభవో త్తరంబుగా నవని నేలు
బ్రహ్మదత్తుఁ డనం బొల్చు రా జొకండు
సకల వాంఛిత కార్యసాధకత గలిగి. 55

వ. అట్టి యా మేదినీనేత యొక యర్ధరాత్రంబున నభోమండ లంబునందు స్వర్ణమయశరీరంబులతో జాజ్వల్యమానంబై మండల సంచారంబులు, గావించుచు విహరించుచున్న కొండొక హంసయుగ్మకంబు దృష్టి గోచరం బగుటయు. 56

చ. మెఱుఁగుఁబసిండిచాయమిఱుమిట్టులుగొల్చుచు,నంచపిండు చేఁ
బరివృతమై యకాండసితవారిదవేష్టితవిద్యుదుత్కర
స్ఫురణమొనర్చు నవ్విహగపుంగవయుగ్మముఁగాంచినంతఁ ద
న్నరపతి డెందమం దొక ఘనంబగు వేడుకపుట్టె; నేమనన్. 57

వ. అంత:— 58

క. మించిన తమి నటు వానిం
గాంచుచు నాఱేఁడు ముదముఁ గనుచుండఁగఁ దత్
కాంచన హంసయుగం బొక
యించుక సేపటికిఁ జనియె నెందేని వెసన్. 59

ఆ. అంత నా నృపాలుఁ డా హంసయుగళంబు
వెండియును గనుఁగొన వేడ్కఁ దవిలి
తత్కృతూహలత సతంబు నా ధాత్రీశుఁ
డాత్మ భోగరతియు నవలఁ ద్రోసె. 60

క. ఔరా! యాతని వేడుక
యీ రీతి దటంచుఁ బలుక నెవ్వరి కగుఁ ద
ద్వ్యాపారమణుఁ డఖిల విముఖుం
డై చేయుంబనులు దానికై వగచె నహా! 61

గీ. అట్లు వగచుచుఁ దుద కతఁ డాత్మ సచివ
సత్తములతోడ మంత్రింబు సలిపి సకల
లోక రమణీయమైన తటాక మొకఁడు
తనపురంబున నొక్కచోఁ ద్రివ్వఁబనిచె. 62

వ. ఇట్లొక్క విశాల తటాకంబు త్రివ్వించి:— 63

క. సిరతంబు నమ్మనోహర
సరసికడకు వచ్చు ప్రాణిసముదయమునకే
వెఱపును గలుగకయుండఁగ
నరయుచుఁ బత్తులకు నెల్ల నభయముఁజేసెఁ. 64

వ. అక్కతంబునంజేసి క్రమక్రమంబుగా నిత్యంబు నాసరోవ
రంబున ననేకవిధజలవిహంగంబు లరుదెంచి స్వైరవిహారంబు
లు సేయుచుండఁదొడంగె; నంత నొకానొకసమయంబున.

కం. మును బ్రహ్మదత్తనరపతి
గనుఁగొనిన మరాళయుగ్మకంబు నచటికిన్
జను దెంచె నంత నపుడా
జననాథుండును బ్రమోదసంపూర్ణుండై. 65

కం. కనుదోయి తనియ నక్కాం
చనహంసయుగంబుఁ గాంచి స్వమనోరథ సి
ద్ధిని బడసి క్రమత వానికిఁ
జన విచ్చి భయంబు వాపి సరసకుఁ జనుచున్. 66

వ. ఒకనాఁడు వాని కట్టి కనకమయంబు లైన యంగంబులు గలుగుటకుఁ గారణం బేమని యూహించి వాని నడుగుటయు నంత నాహేమజాలపాదంబులు విస్పష్టమనుష్యభాషణంబుల విచిత్రంబుగా నాఱేని కిట్లనియె. 67

సీ. అవనీశ! తొల్లి జన్మాంతరంబున మేము
వాయసపక్షిరూపముల నుండి
బల్యన్నభుక్తిచే బ్రదుకుచు నొక్కనాఁ
డయ్యన్నమునకు నన్యోన్య మలుకఁ
బూని పోరుచుఁ బోయిపోయి కొండొక పుణ్య
తీర్థదేశమున సుస్థిరత నొప్పు
నొక్క శూన్యశివాలయోద్దేశమున నున్న
ద్రోణికాంతరమునందుఁ బడి మడిసి

గీ. తన్మహోత్తమపుణ్యతీర్థప్రభావ
వశముచేఁ గాకరూపముల్ వాయ నిట్లు
పూర్వజన్మస్మృతి స్ఫూర్తిఁ బొదలు గనక
మయమరాళస్వరూపముల్ మాకుఁ గలిగె. 68

క. అని చెప్పిన విని యపు డ
మ్మనుజాధీశుండు తనదు మానసమున నిం
డిన వేడ్క యథాకామము
గ, నా మరాళద్వయంబుఁ గనుచు నలరుచున్. 69

వ. తన యభీష్టంబు నెఱవేర్చుకొని సుఖంబుండె. 70

గీ. కాన, నబ్బంగి నీవు నన్యూనదాన
గరిమ మూనినచో ద్రవ్యకాంక్షఁ జేసి
వత్తురు తమంతఁ దాము భవజ్జనకులు;
నీ మనోరథ మొనగూడు నిశ్చయముగ. 71

గీ. అనుచు నీరీతిఁ దనకుఁ బ్రియంబుఁ దలఁచి
యజ్ఞదత్తుండు సెప్పిన నాలకించి
యీశ్వరానుగ్రహోపాత్తహేముఁడైన
పుత్రికుఁడు దాన దీక్షను బూనె నంత. 72

ఉ. ఆతతకీర్తి పుత్రిక మహామహిపాలుఁడు సేయుచున్న వి
ఖ్యాతసమృద్ధదాననివహంబుఁ బ్రతిగ్రహణంబుసేయ, నా
సేతుహిమాచలంబు విలసిల్లెడు నుత్తమభూసురేంద్రసం
ఘాతము రాఁదొడంగెఁ గుతుకంబుగ నాతని రాజధానికిన్.

గీ. అంతఁ ద్రిభువనవిశ్రుతంబైన యతని
దానవార్తను గ్రమముగాఁ దజ్జనకులు
నాలకించి ప్రతిగ్రహణాస్థ నచటి
కరుగుదెంచి రొకానొక యవసరమున. 74

వ. ఇట్లరుదెంచి నిజసతీమణులచేఁ బరిజ్ఞాతులై, యత్యుత్కృష్టంబైన యైశ్వర్యవిభవంబును, నవనీశ్వరుండైన పుత్రరత్నంబును ననుకూలమతులైన యాత్మధర్మపత్నులను బడసి యమందానంబు నందుచు నందు సుఖంబుండి రయ్యనంతరంబున. 75

ఉ. బాపురె! యేమిసెప్పనగు? భ్రష్టమతుల్ దమ రెంతదృష్టక
ష్టాపములయ్యు జ్ఞానలవహైన్యమునన్ గనుగానలేక త
త్పాపపరాయణంబగు స్వభావము పీడఁగఁబోక యెట్టి దు
ర్వ్యాపృతిసేయఁగానయినఁ బొల్చుచుండ్రు గదా మరాత్ములై

వ. ఇట్లిందులకుఁ జెప్పుచుంటి వందు వేని యది యాలకింపుము.

క. ఆ లీల సర్వసుఖములఁ
దేలుచు నచ్చోట నున్న ద్విజులు క్రమముగా
బాలిశులై యాపుత్రకుఁ
డేలెడు రాజ్యంబుఁ దామ యేలఁదలఁచుచున్. 78

గీ. రాజ్యలోభంబువలనఁ బుత్రకునిమీఁది
ప్రేముడి గణింపఁబోక తత్కృత మహోప

కారమేనియుఁ దలఁపక కఠిన వృత్తి
నతనిఁ గడతేర్పఁ దలపోసి రక్కటకట! 79

వ. ఇట్లు తలపోసి వారొక్కనాఁడు రహస్యంబుగాఁ దత్పుర సమీపంబున నున్న వింధ్యవాసినీ గర్భగృహాంతరంబునఁ గొందఱు వధకుల దాఁగియుండం బనిచి పదంపడి తద్దేవీ దర్శనవ్యాజంబున నప్పుత్రకు నచ్చోటికిఁ దోడ్కొనిపోయి నీవు రాజవు కావున మున్ముందు నీ వొక్కఁడవు లోనికరిగి దేవీ దర్శనంబుఁ గావించుకొని రమ్మని చెప్పుటయు నంత నతండును బితృవచనవిశ్వాసంబునం జేసి తద్దేవతాగృహాభ్యంతరంబున కేఁగి యచ్చట:— 80

చ. సునిశితఖడ్గపాణులయి సూరెలనుండి వినిర్భయంబుగాఁ
దను వధియింపఁ బైకొనెడు దారుణకర్ములఁ జూచి నెమ్మనం
బునభయవిస్మయంబులనుబొందియుఁబిమ్మటధైర్యమూనియి
ట్లని వచియించెఁజాలవినయంబునయంబునుమీఱవారితోన్.

క. మీ రెవ్వరయ్య? నన్నే
కారణమున నిచటఁ జంపఁ గడఁగితి రిపుడీ
తీరున? మున్ముందుగఁ ద
త్కారణ మెఱిఁగించి పిదపఁ గడఁగుఁడు వధకున్. 82

వ. నేను నా ప్రాణంబులకు వెఱచి మీరు సేయఁదలచికొన్న కార్యంబున కడ్డు సెప్పువాఁడనుగాను:— 83

క. కారణ మెఱిఁగింపక న
న్నూరక వధియింపఁబూను టొప్పరునే నా
నేరంబుఁ దెలిపి యుచిత
ప్రారంభులు గండు సిద్ధపడి యే నుంటిన్. 84

చ. అన విని నీదు నేరమునకై నినుఁ జంపఁదలంపలేదు; నీ
జనకులు గొంత విత్తము నొసంగినినున్ వధియింపముమ్ముఁబం
చిన నిటుసేయఁబూనితిమి; జీవన మియ్యది మాకు; నీయెడన్
గినుక యొకింతలేదు నిను గీటడఁగింపఁగ నోమహీశ్వరా! 85

క. నినుఁ జంపక విడిచినఁ ద
ద్ధనముం గోల్పడుటె కాక దండ్యులమై నీ
జనకులచే శిక్షం గొని
వనటం బడవలసివచ్చు వసుధాధిపతీ! 86

క. అని యిటు లా వధకులు సె
ప్పినఁ దండ్రుల క్రూరవృత్తి విని యా నృపుఁడున్
జనకులు గారిఁక వారలు
తనపాలిటి మృత్యుదేవత లని తలఁచుచున్. 87

వ. బుద్ధిమంతుండు గావునఁ దత్త్ణంబ యప్పటియుపాయంబు వాయు నుపాయంబుఁ జింతించి మరల నవ్వధకులతో నిట్లనియె. 88

చ. ధనమునకై కదా నను వృథా వధియింపఁ గడంగినారు? నా

కొని నను వీడుఁ; డేనును నిగూఢముగా నెటకేనిఁ బోదు; మీ
రొనరించినట్టి కార్యమిది యొండొకచోఁ బ్రకటింప నెయ్యెడన్.

వ. నేను జీవించి యున్నట్లు నాజనకులకుఁ దెలియకుండ రహ
స్యంబుగా దేశాంతరంబునకుఁ బోయి బ్రదుకువాఁడ; మీ
రీ నిష్కారణ హింసాదోషంబు లేకయ నావలనను నాజన
కులవలనను విశేష విత్తంబు పడయ వచ్చుంగాదె? 90

గీ. అనిన నట్లగుఁ గాకని యా వధకులు
సమ్మతించి తదీయ భూషణము లెల్లఁ
గొని యతని వీడి చని 'పుత్రకుని దునిమితి'
మనుచుఁ దజ్జనకులు నమ్మునట్లు తెలిపి. 91

ఆ. వారివలన నుచిత పారితోషికములు
పడసి యేఁగి; రంత బ్రాహ్మణులును
బుత్రకుని సమగ్రభూపతిత్వమ్మును
దారు సేకరింపఁ దలఁచుటయును. 92

క. దూరదృశుఁడైన పుత్రక
భూరమణుని వచివు లాత్మబుద్ధి పటిమఁ ద
త్క్రూరు లొనర్చిన ద్రోహం
బారసి చంపించి రద్దురాశయుల వెసన్. 93

గీ. ఆత్మ లాభపరాయణు లగుచుఁ దమకు
ల గ్గొనర్చినవారల కెగ్గు సేయు

నిట్టి కుమతులు ధర నుండు; రీ కృతఘ్ను
లకుఁ దలఁప నింతకంటె మేల్గలుగునొక్కొ? 94

మ. అవలన్ బుత్రకభూవిభుండు దృఢసత్యాలాపరక్తిన్ స్వబం
ధువిరక్తిన్ దనపట్టనంబు సన నుద్యోగింప కొక్కండ త
న్నెవరున్ గానకయుండగూఢగతియైయేఁగెన్ మహాఘోరవిం
ధ్యవనీధాత్రి కనేకఘాతుకమృగానందైక సంధాత్రికిన్. 95

వ. ఇట్లుపుత్రకుండు వింధ్యకాంతారంబున కేఁగి యమ్మహార
ణ్యంబున నందందుఁ బరిభ్రమించువాఁడొక్కయెడ బాహు
యుద్ధప్రావీణ్యంబులు మెఱయ నొండొరులతోఁ బోరు
చున్న యిరువురు పురుషులం గనుంగొని. 96

క. పిఱువడక యుసుఱు లేనియు
సరకుగొనక యొకరి నొకరు సదుపు దలఁపుతో
దుర మొనరించెదు వీరె
వ్వరొకో యని వింతపడుచు వారల కడకున్. 97

వ. అల్లనల్లనఁ జని వారితో నిట్లనియె. 98

క. అయ్యా! మీ రెవ్వా రిటు
కయ్యము సేయంగ నేమి కారణ? మది నా
కియ్యెడ వచియింపుఁడు మీ
రియ్యకొనుదురేని తగవు నెఱిఁగి వచింతున్. 99

వ. అనిన నది విని వా రతనితో నిట్లనిరి. 100

క. మాయాసురుని కుమారుల;
మోయీ! మే మిర్వురము సహోదరులము; మా
కీ యష్టియు నీ పాత్రము
నీ యుత్తమ పాదుకలు నహీన ప్రజ్ఞన్. 101

గీ. పడసి మా తండ్రి మా కివి విడిచి చనియె
నీ పితృధనమ్ము లివి మూఁడు నే మిరువురము
ను సమమ్ముగ భాగించుకొనఁ దలంచి
పంపకమ్మున కొట్లునుం బాల్లు తెగక. 102

వ. మా యిద్దఱయందును బలాధికుం డైన వాఁ డియ్యవి యన్ని
యుం బడయుంగాక యని బలపరీక్షార్థం బిట్లు బాహా
యుద్ధంబు సేయం గడంగితి మనుటయుఁ బుత్రకుండు వారి
నుద్దేశించి:— 103

చ. వికవిక నవ్వి, యెంతటి వివేకుల రయ్య! యి వెంతలేసి? వీ
నికినయి భ్రాతృవత్సలత నెట్టన పాయఁగఁ ద్రోలి యిట్లు మీ
రకట! పెనంగులాడఁ దగునా? యెవరెయ్యదిపుచ్చుకొన్న నే
మికొఱఁత గల్గునన్యులొకో మీరలు సోదరు లౌదురేకదా?

క. కాసునకు నైనఁ గొఱ గా
వీ వరకులు; మీర లిట్లు లేమిటి కురకే
యీసుగొని పోరి యుసుఱులు
వాసెద? రిది విన్న నెట్టివారును నగరే? 105

సీ. అనవుడు, దివ్యంబు లైన యీ దుర్లభ
వస్తువుల మహాప్రభావ మీవు
దెలియక యిబ్బంగిఁ బలుకవచ్చునె? పాదు
క లివి మెట్టిన నభోగమన మబ్బు
నీ యష్టి గొని ధాత్రి నేరూపు వ్రాసిన
నా రూపు సత్యమై యపుడ వెలయు
నీ భాజనంబున నే భోజనపదార్థ
మర్థించిన సమగ్రమై లభించు

గీ. నభిమతార్థంబు లొసఁగెడు నట్టి దివ్య
వస్తువుల వీని నెఱిఁగి యెవ్వండు విడువ
నేర్చుఁ? బైవారి కే మెన్ని నీతు లైనఁ
బలుక వచ్చుఁగదా సులభమ్ముగాఁగ. 106

గీ. వీని మా తండ్రి ప్రాణసమానములుగఁ
గాచుకొనుచుఁ, జింతామణీ కామధేను
కల్పకములు లభించినకరణి నెల్ల
కాలమును మదిఁ బరితుష్టిఁ గనెడువాఁడు. 107

గీ. అనిన విని పుత్రకుం డిట్టు లనియె; నవ్వి
యట్టివే యైన నగుఁగాక యంతమాత్ర
వానికై మీరు పోరి చావంగనేల?
యక్కటా! వెఱ్ఱిసోదరులార! యిట్లు? 108

క. బలవంతుఁ డెవ్వఁడో దు
ర్బలుఁ డెవఁడో తెలిసికొనఁగ వలసినచోఁ గే
వలమును సమరము సేయఁగ
వలయునె వేఱొకఁడు తగు నుపాయమె లేదే? 109

వ. మీ బల తారతమ్యంబులు తేటపడవలసి యున్నచో నందుల
కింత గొడవ యేమిటికిఁ? బ్రాణాపాయకరంబులైన పందెం
బులు సలుప నేమిటికి? మీ వస్తువు లవి మూఁడు నిందుంచి
మీ రిరువురుం గొంతదవ్వు పరుగువాఱి రాఁగూడదే? గమన
వేగంబున బలాధికుండై యెవ్వండు ముందఱ సనుదెంచు,
వాఁడ వీనిం బడయ నర్హుం డగుఁగాక! నిరపాయకరంబైన
పందెం బిది యేల సలుపరా? దనిన నప్పుత్రక భూపాలుని
వచనంబులు విని యవి యెంతయు సముచితంబులై యుండె
నని భావించి యమ్మూర్ఖ మతులైన యసురసోదరు లిర్వు
రును వల్లెయని యద్దివ్యవస్తువుల నచ్చట నుంచి పరువెత్తం
దొడంగి రయ్యవసరంబున. 110

గీ. చతుర మతియైన పుత్రక జనపతియును
దగిన యద నిదె యని యెంచి తత్క్షణంబ
తొడరి యచ్చోటి దివ్యపాదుకలు దొడిగి
యష్టిభాజనములు హస్తమందుఁ దాల్చి. 111

వ. అతి శీఘ్రంబుగా నంబరతలంబున కెగసి వియన్మార్గంబునం
బడి చని చని. 112

క. కడు దవ్వవోయి యట నొ
క్కెడ నాకర్షిక యనంగ నెంతేనియు నిం
పడరెడు పుటభేదన మొ
క్కఁడు గన్గొని డిగ్గెఁ దత్సకాశమునందున్. 113

వ. ఇట్లు డిగ్గి యతం డప్పురవరంబునం బ్రవేశించి నలుగడలం
బరికించి తన మనంబున నిట్లు తలపోయందొడంగె. 114

గీ. అపరిచితమైన యిప్పురియందు నాకు
వసతి నొసఁగెడువార లెవ్వరు గలారు?
ధన మొసఁగి విత్తకాంతా సదనములందు
నిలువ నగుఁగాని యయ్యది నీతిగాదు. 115

క. ధనకాంతలు వంచనముం
బొనరింతురు విత్తలోభమున మద్యంధుల్
జనకులు నగువారలె నా
పని పట్టుందలఁచి రర్థపరతంత్రతచేన్. 116

క. కోమటులు లోభచిత్తులు
స్వామిద్రోహమున కైన జంకుగొనరు త
ద్ధామములయందు నిలువం
గా మదిగొల్ప దిఁక నెచటఁ గడపుదు దినముల్. 117

గీ. అని తలంచుచుఁ జనిచని యానగరము
నంద యొక్కెడ నిర్జనం బగుచు శిథిల

మయి కనంబడు నొక్క గేహంబుఁ జేరి
యందు వసియించు నొక వృద్ధురాలిఁ జూచి. 118

వ. ఉచితవిధంబున నామెతోఁ గొంత సంభాషించి పరిచయంబు చేసికొని. 119

గీ. మేలిమాటలతోడ నామెత కొకింత
యర్థము నొసంగి, తన కామె యాదరమునఁ
దగిన యుపచార మొనరింపఁ దద్గృహమున
నుండె నొరులకుఁ గానరాకుండ నతఁడు. 120

వ. ఇవ్విధంబున నతం డప్పేదరాలియింటఁ బ్రచ్ఛన్నంబుగాఁ గాలక్షేపంబు సేయుచుండుటయు. 121

ఉ. అంత నొకప్పు డాజరఠ యాతనిచెంగటఁ జేరి డెందమం
దెంతయు వేడ్క మీఱ వచియించెఁ "కుమారక! నీవు సద్వయో
వంతుఁడవై సురూపగుణవంతుఁడవయ్యును నీకుఁ దుల్యయౌ
కాంత నొకర్తుకన్ దగిన కన్నియఁ గైకొనకుంటి వక్కటా!

క. నీ విట్లుండం గని మ
ద్భావం బెంతయును జింతపడుచుండెఁ వ
త్సా! వింటె నాదు పలుకులు
భావించి కడంగు మింకఁ బరిణయమునకున్. 123

ఆ.వె. తలఁచి చూడ నీకుఁ దగు కన్యకలు గాన
రారు పుడమి; నీపురంబు నేలు

పార్థివుని తనూజ పాటలి యను నొక్క
యువతిదక్క; నామె యొప్పు నీకు. 124

గీ. కాని, యక్కన్నె మన కందరాసిఫలము
మాడ్కి నున్నత ప్రాకారమండలావృ
తావనీనాథ భర్మహర్మ్యాగ్రసంస్థ
కన్యకాంతఃపురమ్మునఁ గాపురుచుండి. 125

క. ప్రభువరభృత్యులు యమ స
న్నిభమూర్తులు ఘోరఖడ్గనిచయధరుల్ త
న్నభినవరత్నము కైవడి
నభిరక్షింపఁగ నలభ్యయై యున్న దిటన్. 126

ఆ.వె. అట్టి యందగత్తె యగు కన్యకామణి
నీకు దార కనేని సిక్కవముగఁ
గుసుమశరుఁడు రతియుఁ గూడి వర్తించెడు
మాడ్కి నలరుదురు కుమార! మీరు. 126

చ అనినఁ దదీయభాషణము లయ్యని యూతని డెందమందుఁ జొ
చ్చె; నపుడు తత్ప్రథంబుబడి శీఘ్రగతిన్ బరిలబ్ధరంగ్రుఁడై
చనియె నొకో యనన్ గుసుమసాయకచోరుఁడుఁ జొచ్చి
తన్మనో! ధన మది యెల్లముచ్చిలె నతంబు నతం డౌదఁ జింత
నొందఁగాన్. 127

ఆ.వె. అపుడు పుత్రకుండు నక్కన్యకా శిరో
మణిని గన్గొనంగ మదిఁ దలంచి

యరిగె నాఁటిరేయి నప్పాముకల నెక్కి-
మింటి కెగసి యామె మేడ దరికి. 128

చ. అరిగి మహోన్నమున్నత తదగ్ర గవాక్ష పథంబునన్ దదం
తరమునఁ జొచ్చియందొకసుతల్పమునన్ నిదురించుచున్నపం
కరుహదళాయతాక్షిఁ గనకప్రతిమానశరీరకాంతి భాసుర
నవయౌవనాతిశయశోభితఁ బాటలిఁ గాంచి యాదటన్. 129

తే. "అద్దిరా! చంద్రకాంతి నిజాంగకముల
యందు నెలకొని సతముఁ దన్నాశ్రయింప
జగము సర్వమ్ము గెలిచి విశ్రాంతిఁ గొన్న
మన్మథాజ్ఞాస్వరూపమో మగువ యిద్ది?" 130

వ. అని యాశ్చర్యంబు నొందుచు. 131

క. కోరిక లీరిక లెత్తఁగ
సారెకుసారెకుఁ దదీయసౌందర్యముఁ గ
న్నారఁగఁ గన్గొని మెచ్చుచు
మీఱిన తమకంబు పొంగి మినుముట్టంగన్. 132

ఉ. మూసిన కన్నుదామరల ముద్దిడుకోఁ దలపోయు; నంత సం
త్రాసమునొందు; వెండియును ధైర్యమునూనితదోష్ఠమానఁగా
నాసపహించుఁ; దోడనె భయాకులుఁడై నెనుదీయు; నట్లు
డోలానమ చిత్తవృత్తి పొదలన్ భయకౌతుక మధ్యవర్తియై.

గీ. ఎట్లు మేల్కొల్పువాఁడ నే నీలతాంగి
గాఢ నిద్రకు భంగంబు గలుగఁజేసి

మేల్కొలుప కున్న నాకేమి మేలు గల్గు
ననుచు నాతఁడు తటమట లాడుచుండ. 134

వ. అంత నన్నగరి వెలుపలఁ బురవీథిక యందు గస్తు దిరుగుచున్న యొకానొక యారక్షకుండు యదృచ్ఛావశంబున నొక్క పదంబు పాడం దొడఁగె; నందలి యర్థం బెట్టి దనిన. 135

చ. అలసత మోడ్పుగొన్న లలితాక్షియుగంబును జారుహాసకాం
తిన్ బొలిచెడు మోముదమ్మియును, మోహన నిశ్చలదేహ
యష్టియున్ గలిగి రహస్యదేశమున గాఢముగా నిదురించు
నింతి మేల్కొలుపఁగఁ జాలు జాణనికిఁ గూడదె జన్మఫలం
బు ధాత్రిపై? 136

మ. అని తద్యామికుఁ డీవిధంబున మనోహ్లాదంబుగాఁ బాడినన్
విని, రాగాతిశయంబుచే నొడలు కంపింపఁగ దదంభోరుహా
నన నాశ్లేష మొనర్చి యాతఁడు మహానందాబ్ధి నోలాడె; న
వ్వనజాతాక్షియు మేలుకాంచి యతి విభ్రాంతాత్మయై
యుయ్యెడన్. 137

సీ. జలజదళ సన్నిభాక్షు విశాలవక్షు
దివ్యసుందరదేహు సుదీర్ఘబాహు
నంగనాజనకాము లోకాభిరాముఁ
గాంచె నాతనిఁ దన కన్నుఁగవకు నెదుట. 138

చ. కనుఁగొని లజ్జయుం, బరమకౌతుకమున్ హృదయంబులోఁ
బెనఁగొనఁగఁ దదీయరూపమునకున్ గడు విస్మయమొందు

చున్ దటాలున శయనంబు డిగ్గి నిజలోచనముల్ తనివొంద
నెండి, యాతనిఁ గన నెంచియుఁ మరలెఁ దద్దయు సిబ్బితి
ప్రబ్బ గొబ్బునన్. 139

వ. ఇట్లప్పాటలి నిజాంతర్గతంబున లజ్జాకౌతుకంబు లెంతయు
సమ్మర్దంబు గావించుచుండ. 140

క. మరుఁడో హిమకరుఁడో నలకూ
బరుఁడో నిజ పూర్వపుణ్యవశమువలనఁ దన్
వరియింప వచ్చె నని య
త్తరుణీమణి హృదయమందుఁ దలఁపఁ దొడంగెన్. 141

వ. అంత నా సమయంబున:— 142

ఆ. పుత్రకుఁడును దన చరిత్రంబు సకలంబు
వినిచి పిదప నామె యనుమతింపఁ
దత్కరాంబుజము ముదంబుమై గాంధర్వ
విధి గ్రహించెఁ బ్రణయవేత్త యగుచు. 143

గీ. అంత నద్దంపతులహృదయములలోనఁ
బెరుఁగఁ దొడఁగె నన్యోన్య సంప్రీతి; నాఁటి
రేయి మాత్రము తత్ప్రీతిరీతిఁగాక
తరలి పోఁజొచ్చె నంతకంతకును దటికిఁగి. 144

చ. వదవడి వేగఁబోవఁ దనుఁబాయఁగఁజాలక వేఁగఁ బోవు న
మ్మదవతి నొక్కమాఱు గడు మక్కువ నక్కునఁజేర్చి ప్రే
యసీ! । యుదయముగాఁ దొడంగె ; నిట నుండఁగరా దిఁక

నేను బోయి వచ్చెద మరలన్; మఱేమియును జింతిలంబోకు
ము నీమనంబునన్. 145

వ అని యమ్ముద్దియ నూరడించుచు దృఢాశ్లేషంబు గావించి
ముద్దువెట్టుకొని విడువలేక విడువలేక తన హృదయం బంత
యు నచ్చట నిడి యెట్టకేలకు యథాగతంబుగా నజ్జరావా
సంబున కరిగె. 146

క. పదపడి యతం డజ్జరతా
సదనమ్మున నుండి ప్రతినిశము వేడ్క మదిన్
బొదలంగఁ బోవుచు వచ్చుచు
సుదతిన్ బాటలిని మరగి సుఖముండుటయున్. 147

వ. అయ్యనంతరంబున :— 148

గీ. కొండొకప్పు డప్పాటలీ కువలయాక్షి
యందు సంభోగ చిహ్నంబు లరసి యచటి
పరిజనాంగన లలజడిపడి తదీయ
జనకుతో విన్నవించిరి సరభసముగ. 149

వ. అంత నా నృపాలుండును మంతనంబునం దెంతయు విచా
రించి:— 150

క. నేరుపుకత్తియ నొక పరి
చారిక రప్పించి, రాత్రి సమయముల సుతా
గారమున నుండి స్థితిగతు
లారసి యెఱిఁగింపఁ బనిచె నతి గూఢముగాన్. 151

గీ. తేని యానతి నదియును రేలు రాజ
పుత్రికాంతఃపురంబునఁ బొంచి యుండి
పుత్రకుఁడు వచ్చుచుంటయుఁ బోవుచుంటఁ
జక్కఁ గనుఁగొని యొక నిశాసమయమందు. 152

వ. యథాపూర్వంబుగా నతం డరుదెంచి రాజకన్యోపభోగంబునఁ గొంత దడవు గడపి యక్కన్యకా రత్నంబుతోఁ దదీయ శయ్యాతలంబున గాఢనిద్రావశుండై పవ్వళించియున్న సమయంబున నల్లనఁ దత్సమీపంబున కరిగి:— 153

గీ. అతని యుత్తరీయపుఁ గొంగులందుఁ జిన్న
చిన్న లత్తుక చుక్కలు గొన్ని గుఱుతు
గాఁగ నెలకొల్పి యన్యులు గానకుండ
వెడలి చనుదెంచి, మఱునాఁడు వేళ యెఱిఁగి. 154

వ. ఆ వృత్తాంతం బంతయు రహస్యంబుగా రాజున కెఱింగించుటయు నతండును త దన్వేషణార్థంబు చారజనంబుల నియోగించె; వారును రాజాదేశంబునఁ బురంబు నలుగడలం బరిశోధించి, యమ్ముదుసలి పడంతుక జీర్ణగృహంబున నున్న పుత్రకుని గుర్తించి తెలిసికొని రాజసన్నిధానంబునకుఁ గొనిపోవుటయు నాసమయంబున:— 155

గీ. క్రోధభరమునఁ దన్నుఁ గన్గొను నృపాలుఁ
గాంచి తనకేమి యవమతి గలుగునో యని

తలఁచి పుత్రకుఁ డపుడు చిత్రముగఁ దనదు
పాదుకలు దాల్చి వడి మింటిపైకి నెగసి. 156

క. బరువడి నృపకన్యాంతః
పురమునకుఁ బఱచి రాజపుత్త్రిం గని యో
తరుణీమణి! మీ జనకున
కెఱుకపడెన్ మన రహస్యవృత్తం బెల్లన్. 157

ఆ.వె. కాన, నిచట నుండఁగారాదు మన కింక
నరుగవలయు నెచటి కైనఁగాని
యొక నిమేషమేనియును జాగు సేయక
లెమ్ము; నాదు వెంట ర మ్మటంచు. 158

క. వడి వడి నప్పుడఁతియు వెం
బడి రాఁ బాదుకలు దొడిగి పఱువిడి మింటన్
బడి యరిగెఁ జూచు వారలు
గడు విస్మయ మొంద ధరణికాంతుఁడు కుందన్. 159

వ. అట్లు పుత్రకుండు పాటలీసమేతుండై బహుదూరంబు గగన
మార్గంబునం బఱచి పదంపడి గంగానదీతటనికటంబున కరిగి
యందు డిగ్గి, దూరపథపరిశ్రాంతమై యున్న యక్కాంతకు
దివ్యపాత్రప్రభావజనితంబు లైన మృష్టాన్నంబులచే సంతుష్టి
గావించి, యామెకు వినోదంబుగాఁ దన యపూర్వవస్తుప్రభా
వం బభివర్ణించి చెప్పుటయు నంత:— 160

క. తన విభుని మహత్త్వముఁ గనుఁ
గొని యప్పాటలియు మిపులఁ గుతుకం బడరం
గ నిజేశుఁ గాంచి "నాథా!
కనుఁగొంటిం బాత్రిపాదుకల మహిమంబుల్. 161

ఆ.వె. ఇంక యష్టిమహిమ మీక్షింప మదిలోన
వేడ్క యొదవెఁ గూర్మి వెలయ నాకుఁ
దత్ప్రభావ మదియు దర్శింపఁజేయఁ గా
వలయు నేదియేని వ్రాయుమిచట". 162

క. అని కౌతుకాతిశయమునఁ
దనప్రియసతి యడుగుటయును దదభీష్టముఁ దీ
ర్ప నపుడు పుత్రకుఁ డయ్య
ష్టిని గైకొని వివిధ చిత్రచిహ్నమ్ములతోన్. 163

గీ. బహుళగోపురసౌధ విభ్రాజితంబుఁ
బ్రథిత పటుతర చతురంగ బలయుతంబు
సకల సంపత్సమృద్ధంబు నొకపురంబు
వ్రాసె నచ్చట నత్యంత భాసురముగ. 164

వ. అంత నది యంతయుఁ దద్దివ్యయష్టిప్రభావంబున సత్యత్వంబు
నొంది యొక్కమహాపురంబై కనుపట్టుటయు. 165

ఉ. చిత్రచరిత్రుఁడై వినుతిఁ జెంది మహోన్నతి కెక్కియున్నయా
పుత్రకుఁ డప్పు డప్పురిఁ బ్రభుండయి, పిమ్మట మామగారితో

మైత్రియు నొంది యన్యనృపమండలి తన్ను భజించుచుండ
నీశ్వాత్రిఁ జతుస్సముద్రకలితంబుగ నేలె మహాప్రభావుఁడై.

గీ. అదియె యీదివ్యనగర; మిం దలరు పౌర
వర్గ మెల్లఁ దదీయప్రభావ జనిత;
మిదియు నద్దంపతుల పేర నెసఁగుచుండుఁ
బాటలీపుత్రికంబు నాఁ బ్రథిత మగుచు. 167

క. ఈ నడుమున ననుపమ మహి
మావిఖ్యాతమయి వెలసినట్టి పురంబౌఁ
గావుననే యియ్యది ల
క్ష్మీ వాణులు నెలకొనంగ క్షేత్రం బయ్యెన్. 168

వ. అని యివ్విధంబున వర్షోపాధ్యాయుండు మా కీవృత్తాంతంబు
మహానుగ్రహంబుతోఁ దెలియం బలుకుటయు:— 169

మ. అతిచిత్రంబగు నీ యపూర్వకథ నిట్లావేళ నవ్వర్షపం
డితవక్త్రంబున నుండి మేము విని, వింటే కాణభూతీ! మహా
ద్భుతసంతోష రసంబు లుల్లముల సంపూర్ణంబులై నిండ న
మ్మతిమన్ముఖ్యుని గొల్చుచుంటి మట సమ్మానం బనూనంబు
గాన్. 170

శ్రీ శ్రీ శ్రీ

కథాపీఠలంబకంబునఁ
ద్వితీయ తరంగము
సమాప్తము.

ఓమ్ !

# ఆంధ్ర కథాసరిత్సాగరము.

క థా పీ ఠ లం బ క ము. ౧.

---

## చతుర్థ తరంగము

---

గీ. అనుచు వరరుచి యిట్లు వింధ్యవనసీమఁ
గాణభూతి కవాంతరకథ వచించి
నెండియును వేడ్క నాతఁడు వినుచునుండఁ
బ్రకృతవృత్తాంత మిట్లు చెప్పం దొడంగె. 1

వ. అది యెట్లనిన? నో కాణభూతీ! పదంపడి నే నవ్విధంబున నా వ్యాడీంద్రదత్తులతో నచ్చట నివసించుచుఁ గాలక్రమంబున నవ్వర్షోపాధ్యాయునివలన సమస్త విద్యాపారంగతత్వంబు వడసి, యతిక్రాంత శైశవుండ నై యున్నసమయంబునఁ ద న్నగరంబునం దొకప్పు డింద్రోత్సవంబు ప్రవర్తిల్లుచుండు టయు నంత మే మందఱము న య్యుత్సవంబు నవలోకింప నరిగి యచ్చట. 2

## ఉపకోశావృత్తాంతము.

క. కుసుమేతర మగు మన్మథు
ని సాయకం బనఁగ వెలయు నిరుపమ సౌంద
ర్య సమన్విత నొక కన్య వి
కసితాంభోరుహదళాక్షిఁ గాంచితి మంతన్. 3

సీ. నిండు చందురు పొందు నిందసేయఁగఁజాలు
చొక్కపు నెమ్మోము సోయగంబు
మెఱుఁగుటద్దముల నక్కఱకుఁ గైకొనఁబోని
నిద్దంపుఁజెక్కుల నెఱతనంబు
మరుని విండులకు వంకరల నెన్నఁగఁ జూచు
కనుబొమదోయి చక్కందనంబు
కటికిచీఁకటి యొప్పు నటమట యొనరించు
కుదిరిక గల గొప్ప కొప్పు బెడఁగు

గీ. మేల్మి బంగారు పస మించు మేని చెలువు
ముదురు పవడంబు దొరయు కెమ్మోవి సొబగు
కలదు లే దనఁదగు లేఁతకౌను సొగసుఁ
గలిగి చెలువొందుచున్న యక్కన్నెఁ జూచి. 5

వ. ఏ నిది యెవ్వతె యై యుండు నని యింద్రదత్తు నడిగిన నతం
డక్కన్యక యుపవర్షుని తనూజయైన యుపకోశ యని చెప్పెఁ;
నంత నయ్యువతియు నిజసఖీముఖంబున నన్నుం దెలిసికొని,

గీ. పరిణయపేశలమగు చూపువాఱి నన్నుఁ
గాంచుచు మదీయ చిత్తపరికర్షణంబు
చేసి సవిలాసముగ సఖీశ్రేణితోడ
నెట్టు లెట్టులో తనయింటి కేఁగె నంత. 6

క. ఆ సరసిజాక్షి రూప వి
లాసంబులు నామనమున లగ్నము లగుటం
జేసి యపు డేనుఁ గుసుమ శ
రాసనునకు లక్ష్యమగుచు నరుదెంచుటయున్. 7

గీ. పృథుతరాసమబాణ నిర్భిన్నమైన
హృదయ మొక్కింత యేనియుఁ గుదుటఁ బడక
యేమి సెప్పుదు? నారేయి యెల్ల నాకుఁ
గోర్కెలే కాని కనులకుఁ గూర్కె లేదు. 8

క. తరువాత నెట్టు లెటులో
చరమ నిశావేళ నొక్క క్షణకాలము ని
ద్దురమైకము గ్రమ్మిన న
త్తఱి నా కంతేని యద్భుతంబుగఁ గలలోన్. 9

క. పరిశుభ్రమాల్య భూషాం
బరధారిణి యొక్క దివ్యవనిత కృపా ని
ర్భర నిజదృష్టుల నాపైఁ
బఱపుచుఁ గనవచ్చి యిట్లు పలికెన్ బ్రీతిన్. 10

చ. ఉడుగుము వత్స! యిట్లువగపొందక; మాయుపకోశతొల్లినీ
పడఁతియు; వెండి నీ కిపుడు భార్యగఁబుట్టెధరిత్రి; నామె యె
య్యెడల గుణాఢ్య యౌట నిఁక నెవ్వరినిన్వరియింపఁబోదు నిన్
విడిచి; యి దింతయున్ నిజము;వీడుముసంశయమింకనీమదిన్.

గీ. ఏను నినుఁ గూర్మిమై నాశ్రయించి యున్న
పద్మభవుని సతిని సరస్వతిని వత్స!
యడలు గొనకుము; నీ వగ పరయులేక
వచ్చియుంటి నీకిప్పు డివ్వార్తఁ దెలుప. 12

వ. అని యిట్లు వచించి యాదివ్యవనిత యంతర్ధానంబు సేయు
టయు నంత నాసమయంబున నేనును, 13

చ. తెలతెలవాఱ మేలుకొని దేవి సరస్వతి స్వప్నదృష్టయై
పలికిన తత్కృపాభరితభాషితముల్ దలపోసికొంచు న
గ్గలిక వహించి యేఁగి యుల కన్న వసించు నికేతనంబు నుం
గల నెలమావికిందఁ గుతుకం బడరన్ సవిలాసభంగిగాన్.

వ. ఒంటిమై నుపవిష్టుండనై యుండుటయు:— 15

గి. అంత నయ్యుపకోశ నెయ్యమ్ము సేయు
సఖి యొకర్తుక వచ్చి తత్సరసిజాక్షి
సొందు నభినవానంగ విజృంభితంబు
తెఱఁగు సవిశేషముగ నాకుఁ దెలియఁబలికె. 16

క. అది వినిన యంత నామదిఁ
గుమురుకొనిన తాప మది ద్విగుణితం బయ్యెన్

బదపడి యచ్చెలితో నా
మొదఁ గలిగిన తలఁపు దెలుప నే నిట్లంటిన్. 17

ఉ. మీచెలి నాపయిన్ వలపు మీఱఁ గలంగెడు నంటి; వల్లె నే
నాచపలాయతాక్షిఁ బడయం దపియించుచునుంటిఁ; గానిసం
కోచ మొకండు నాకిపుడు గోచర మయ్యెడుఁ; దల్లిదండ్రులా
మేచకవేణి నాకిడఁగ మేకొనువారలొ కారొ యారయన్.

క. తలిదండ్రు లిడక నే న
త్తలిరాకుంబోణి నేకతంబుగఁ బడయన్
దలపోయుట యుక్త మొకో
కలికీ! యది యరయఁ గాని కార్యంబు గదా? 19

క. తెలిసి యకార్యం బేటికిఁ
వలుపంగా వలయు? దుర్యశము పైఁబడినన్
దొలఁగునె? యకీర్తి కంటెన్
దలఁపఁగ మరణంబు మేల్గదా మనుజునకున్? 20

క. కావునఁ దజ్జనకులతో
నే వెరవున నైన నామె హృదయముఁ దెలుపం
గా వలయు; నటులొనర్చిన
చో వల నగు నెప్పుడేని శుభముల్ వడయన్. 21

గీ. ఈవె దీని కుపాయ మూహించి, నీదు
నెచ్చెలియు నేను విషమాస్త్ర నిశిత కుసుమ

మార్గణములకు గుఱి యయి మ్రగ్గుచుండఁ
గాచి బ్రదికించి పుణ్యంబు గట్టుకొనుము. 22

క. అని పలికిన విని యాచెలి
చని సర్వముఁ దెలియఁబలికెఁ జతురతఁ దత్త్వా
మిని జనని; కంత నాపెయుఁ
దనపతి యుపవర్షునకును దగ నెఱిఁగించెన్. 23

సీ. అవల నయ్యుపవర్షుఁ డగ్రజుండగు వర్ష
గురుని యంగీకృతిఁ గోరుటయును
హర్షించె నతఁడు నా కక్కన్నియ నొసంగ;
జరిగె వివాహ నిశ్చయము; నంత
వ్యాడి, వర్షాచార్యవర నిదేశంబున
నరిగి మజ్జననిఁ గౌశాంబినుండి
కొనివచ్చెఁ గడువేగముగఁ; బదంపడి యుప
వర్షుండు పరిపూర్ణహర్షుఁ డగుచుఁ
గీ. గూర్మిఁ దనపుత్త్రి నయ్యుపకోశ నుచిత
విధివిధానంబుగా నిచ్చి పెండ్లిచేసె
నాకు మత్ప్రియసికి మహానంద మెసఁగ
బంధు మిత్త్రులు సంతోషబంధురులుగ. 24

వ. పదంపడి నే నప్పురంబున నభీష్టపత్నీలాభంబు వడసి యా ప్రేయసీ రత్నంబుతో మదీయమాతృదేవత నర్చించుచు నప్పురంబునందె సుఖంబుండి నయ్యనంతరంబున. 25

క. వర్షాచార్యుని విద్యో
త్కర్షము నలుగడల సువిదితంబై తమ్మా
కర్షింప శిష్యు లెందఱో
హార్షముతో నరుగుదెంచి రాతని కడకున్. 26

— పాణినికథ. —

గీ. అట్లు వచ్చిన శిష్యజనాళియందుఁ
"పాణిని" యనంబడెడు నొక్కబాలకుండు
పరమమూర్ఖతతో నుండువాఁడు; పాప !
మతని కేపాటి విద్యయు నంటకుండె. 27

క. గురువరునకుఁ దత్పత్నికి
నిరతము శుశ్రూష సలిపి నేర్చుచు నున్నన్
సరిగా నాతని కొక య
క్కర మైనను రాకయుండె గృహచారమునన్. 28

ఆ.వె. అపుడు వర్షపత్ని యాతని మౌర్ఖ్యంబు
నరసి జాలిజెంది "యకట! వత్స!
యేల కష్టపడెద? విఁక నీకుఁ దపమునం
గాక విద్య పడయఁగాదు; వినుము. 29

ఆ.వె. కాలహరణ మురక గాకుండ తోడన
చను మటంచుఁ జెప్పి పనుప నతఁడు
సనియె శీతశైలమునకు విద్యాకాంక్షఁ
జేసి మిగుల ఖిన్నచిత్తుఁడగుచు. 30

చ. చని యట నిష్ఠమైఁ దపము సల్పి యభీష్టవరప్రదున్ మహే
శునిఁ బరితుష్టుఁ జేసి మతిశోభితుఁడై తదనుగ్రహంబునన్
గనియె సమస్త వాఙ్మయముఖం బగు వ్యాకరణంబు సర్వనూ
తనమగు దానిఁ బూర్ణముగఁ దత్తదశేషవిశేషవేత్తయై. 31

వ. ఇట్లతం డతినవీనంబగు మాహేశ్వరవ్యాకరణంబున మహా
పండితుండై యత్యంతోత్సాహంబుతో మరల మా చెంత
కరుదెంచి యప్పు డచ్చట వర్షోపాధ్యాయశిష్యులం దెల్ల నే
నొకింత పెద్దనై యున్నవాఁడ నగుటం జేసి:— 32

గీ. నన్నుఁ దనతోడ వాద మొనర్పఁ బిలిచె
నంత నతఁడును నేను శాస్త్రార్థమునకుఁ
దొడఁగి వాదించుచుండఁగాఁ గడచె సప్త
దినము; లవ్వేల నష్టమదినమందు. 33

సీ. అతఁడు నాచేఁ బరాజితుఁ డౌటయును, నభ
స్థలినుండి భర్గుఁ డుద్ధత మహోగ్ర
హుంకార మొనరించె నుద్భూతకోపుఁడై
దానఁ దత్క్షణమె యైంద్ర మగు నస్మ
దఖిల శాబ్దము నష్టమయ్యె సీధర; నంత
నే మెల్లరము శాబ్దహీనుల మయి
పాణినిచే నోటుపడితిమి మరల శా
స్త్రప్రసంగంబున శక్తి లేమి

గీ. నట్లు పాణిని కోడి లజ్జానమాన
వశుఁడనై నేను మిక్కిలి వగపుఁ జెంది
మొదలిమగు శబ్దశాస్త్ర మయ్యాదియుఁ దొలఁగ
వివిధగతుల సంజాతనిర్వేదుఁడ నయి. 34

వ. ఈశ్వరానుగ్రహంబు వడయు పొంటెఁ దపంబు సేయ నిశ్చ
యించుకొని మాతల్లికిని నాయిల్లాలికిని మరల నే వచ్చు
నంతదనుక సమస్త గృహకృత్యంబులకుం జాలినంత యర్థం
బు మాకుఁ బరిచితుండగు హిరణ్యగుప్తుండను నొకా నొక
వైశ్యముఖ్యునియొద్ద గుప్తంగా నిక్షేపించి;— 35

క. అది నాసతి యుపకోశకు
విదితముగాఁ దెలిపి భార్గవీ వల్లభు శం
భుఁ దపంబున నారాధిం
పఁ దలఁచి యరిగితిని శీతపర్వతమునకున్. 36

—♦ ఉపకోశపాతివ్రత్యము. ♦—

వ. ఇట్లు నేను హిమవత్పర్వతంబున కరిగి యందు నిరాహారుం
డనై యీశ్వరునింగూర్చి మహోగ్రతపంబు సలుపుచుండు
టయు నంత నక్కడ:— 37

చ. కులతరుణీలలామ ముపకోశయు మద్గృహమందు నాకు మేల్
దలఁచుచుఁ బ్రత్యహంబు నియతవ్రతయై సుపవిత్రజాహ్నవీ
సలిలములందు స్నానము లల్పుచు భక్తి నభీష్టదేవతా
వలి భజియించుచుండెఁగనువారలుతచ్చరితంబు మెచ్చఁగన్.

గీ. అంత నొక్కవసంతర్తు వరుగుదెంచె;
నప్పు డాసాధ్వి పాండు మోహాన కృశాంగ
భాసుర విలాస యయి ప్రతిపచ్చశాంక
రేఖగతి నవహృతపౌరదృష్టి యగుచు. 39

క. కులతరుణీమణి గావునఁ
దలవంచుకొని పురవీధిఁ దన యిరుపార్శ్వం
బుల నడచువారి నైనం
దిలకింపం బోక తన గతియె తనయది గాన్. 40

గీ. స్నానమున కయి గంగకుఁ జనుచు నున్న
తఱి నృపపురోధసుండును దండనాథి
కారియుఁ గుమార సచివుండు దారిలోన
నామెఁ గనుఁగొని మన్మథాయత్తు లైరి. 41

వ. అంత:— 42

క. ఏమి పని గలిగియో నాఁ
డామగువయు స్నానమాడ నాలస్యము కాఁ
గా, మార్తాండుఁడు గ్రుంకెఁ
గామార్తులకుం బ్రమోదకరుఁడై యంతన్. 43

గీ. సంజ చీఁకటి న జ్జలజాతనయన
యొంటిమై నింటి కేఁగుచు నుండుటయును
శఠమతి కుమారసచివుఁ డాసాధ్వి నచట
నడ్డదవిలె బలాత్కృతి నాచరింప. 44

వ. ఇట్లాఘూర్ణుండు తలవని తలంపుగా వచ్చి యొంటిక త్తెయై యున్న తన్నడ్డగింపంబోయిన నా సాధ్వీతిలకం బెంతయుఁ గలంతవడి ధైర్యంబు దెచ్చికొని:— 45

చ. పదపడి యామె దొడ్డ ప్రతిభావతి గావున నప్పు డట్టి దు
ర్మదునకు నడ్డుసెప్పుట ప్రమాదకరంబని యిట్లు పల్కె నో
మదనవిలాస! దీని వినుమా; యెది నీకు హితంబొ నాకు న
య్యదిహితమే! బలాత్కరణ మక్కఱలేదొక యించుకేనియున్.

గీ. అట్టులైనను, నేను కులాంగనను; మ
దీయ వల్లభుఁ డిపుడు విదేశమునకు
నేఁగి యున్నాఁడు; మన మిట్టు లిచట నున్న
నెవ్వరేనియుఁ గనుఁగొందురేమొ కాదె? 47

ఆ. వె. పౌరజనుల కనులఁబడినచో నాకును
నీకునుం గడింది నింద వుట్టుఁ
గాన రేపు పౌరగణము వసంతోత్స
వమున కరుగు నపుడు వలనెఱింగి. 48

క. తొలి జాము రేయి నేరికిఁ
దెలియం బడకుండ నరుగుదె మ్మల్లన మా
నిలయంబున; కచ్చట నీ
తలఁపునఁ గలకోర్కి తీర్చెదన్ రసికవరా! 49

క. అని నమ్మఁ బలుక నా దు
ర్జనుఁ డంధుఁడు కనుఘుతించి ఛన నవ్వటి క

వ్వనితామణి భాగ్యవశం
బున విడి; యాసతియు వెడలెఁ బో వీఁ డనుచున్. 50

క. సింగంబు బారినుండి త
లంగిన మృగి పోల్కి నగ్గలంబుగఁ దద్భీ
తిం గొంకుచు వడివడిగా
ముంగల నొక్కింతదూరమున కరుగుటయున్. 51

ఉ. ఏమని చెప్పవచ్చు? గుణహీనుఁడు రాజపురోధసుండు ను
ష్టామ నిబద్ధ బుద్ధి యయి సంశయ మింతయు లేక యంత న
క్కోమలి నడ్డగించెఁ దనకోరికఁ దీరుపు మంచు; నప్పు డా
సామజయాన వెండిభయసంభ్రమముల్ దనుఁజుట్టిముట్టఁగాన్

గీ. తోడనే ధైర్య మూని "ముందుగతిఁ జూచు
కొంద"మని వానికిని దొంటిచందముననె
మఱుసటి నిశన్ ద్వితీయయామమ్మునందుఁ
దన గృహమ్మున సంకేతమును వచించి. 53

ఉ. ఆదురితాత్ముచే సయిత మప్పటి కెట్టటులో విముక్తయై
మీఁద నొకింత మేఱ నన మీఱి ప్రమత్తుఁడు దండనాథుఁడున్
సాదరబుద్ధి వచ్చి సరసత్వముఁ జూపఁ దొడంగె; నప్పు డిం
కేదియుఁ జేయఁజాల కొక యించుక సేపటి కామె వెండియున్.

గీ. వానికిని యట్లె తద్యామవతిఁ దృతీయ
యామమందు సంకేత మొయ్యన వచించి

కడకు వానిచేతను విముక్త యయి భీతిఁ
దడఁబడుచు నెట్లొ యాత్మసద్మమున కరిగె. 55

వ. ఇట్లరిగి జరగిన యావద్వృత్తాంతంబును రహస్యంబుగా నిజపరిచారికాజనంబుల కెఱింగించి కర్తవ్య నిశ్చయం బొనరించి మఱుసటినాఁటి రాత్రి యాదుర్మార్గు లరుగుదెంచి నప్పుడు చేయవలసిన కృత్యంబు సర్వంబును వారల కుపదేశించి యంతఁ దనమనంబున నిట్లు చింతింపందొడంగె. 56

చ. పతిపరదేశగామి యగుపట్టఁ గులాంగన యొంటి నింట, నం
చితకమనీయరూపలగు స్త్రీల నెగాదిగఁ జూచుచుండు దు
ర్మతులకు దృష్టిపాత్రలయి మ్రగ్గుచు నుండుటకంటె వెంటనే
మృతిఁ గొని యెగ్గు పాయుటయ మేలుగదా తలపోసి చూ
డఁగన్. 57

మ. అని చింతించుచు, నన్ దలంచికొను, చత్యంతానుతాపంబుతోఁ
దనసౌందర్యము దూఱికొంచు, నపు డత్తన్వంగి, యారాత్రిభో
జనపానంబుల నైన నొల్లక నిజస్వాంతంబునం దార్తర
క్షు ననాథావనబద్ధదీక్షు నలికాక్షున్ భక్తి భావించుచున్.

వ. తద్విచారాతిశయంబునఁ గంటిపై నొక్కకూర్కేనియు రాక యొట్టులెట్టులో యారేయి గడపి యమ్మఱునాఁటి యరుణోదయంబున బ్రాహ్మణాతిథిపూజాదికార్థంబై యింట నేమియు నర్థంబు లేమిం జేసి మన్నిక్షిప్తంబైన విత్తం బొకింత యడిగి కొనితేర నొక్కచేటికను హిరణ్యగుప్తుని సమక్షంబున కను

పుటయు నంత నక్కటిలుండును నది యొక్కయవకాశం
బుగాఁ గొని లబ్ధావకాశుండై మద్గృహంబున కరిగి యేకాం
తంబున నాకాంతం గని మన్మథాకాంతుండై యామెతో
నిట్లనియె. 59

క. వనజాయతాక్షి ! నీపై
మన సయ్యెను నాకు; నన్ను మన్నించి కృతా
ర్థుని జేయుము; నీపతి దాఁ
చిన యావిత్తంబు నీకు శీఘ్రము యిడుదున్. 60

గీ. అనిన విని వానిచెంగట నాధనంబు
నే ననాక్షికముగ దాఁప నిడుటఁ దలఁచి
పాపవర్తను నవ్వణిక్పతిని గాంచి
కోపఖేదము లాత్మలో గుదిగొనంగ. 61

వ. అమ్మహాపతివ్రతాతిలకం బది యించుకయు వెలుపలఁ బ్రక
టంబు గానీయక వానికిని నాఁటి రేయి పశ్చిమయామంబున
నంకేతం బేర్పఱచుటయు నంత నవ్వైశ్యాధముం డందుల
కంగీకరించి యప్పటికేఁ దన యింటి కరిగె నయ్యనంతరంబున.

సీ. ఉపకోశయును గార్య నిపుణతమైఁ గొంత
కాటుకపొడి మెట్లొ గడనచేసి
దాన నయ్యాయి సుగంధద్రవ్యములు గూర్చి
తైలంబుఁ జేర్చి మర్దన మొనర్చి

యది యొక్కభాండంబునం దుంపఁ జేటికా
జనులతోఁ జెప్పి, యావెనుక నాల్గు
కౌపీనకములు తత్కజ్జల దిగ్ధ విలి
ప్తములు గావించి గుప్తముగ నుంచి
గీ. వెడఁదయై పైని దృఢమగు గడియ గలిగు
నొక్క మంజూష వాకిట నుంపఁ బంచి
చేయవలసిన పనులెల్ల చేటికలకు
వెల్లడిగఁ జెప్పి తా నింట వేచియుండె. 63
వ. ఇట్లయ్యుపకోశ వేచి యుండుటయు:— 64
గీ. అమ్మధూత్సవసమయంబునందు రాత్రి
ప్రథమ యామంబునన్ కుమార సచివుండు
వేడ్క దళుకొత్తఁగా మహావేషుఁ డగుచు
నరుగు దెంచెను మాయింటికి; నంతలోన. 65
క. వానిఁ గని, యామె "నీ విట
స్నానం బొనరింప కేను స్పర్శింప నిను
గానఁ, జను మింటిలోనికి
స్నానముఁ గావించి వేగ చనుదేవలయున్." 66
సీ. అనిన, నమ్మూర్ఖుండు నట్ల సేయుదు నంచు
నంగీకరించెఁ దా; నంతలోన
గదుపరి పరిచారికలు వానిఁ దమవెంటఁ
గొనిపోయి యచట నిగూఢమైన

యొక చీఁకటి టిలోనికిఁ జేర్చి త ద్వస్త్ర
భూషణాదులు దుల్లఁబుచ్చివైచి
యూనాల్గు మసిపాఁతలం దొండు వానికి
గోఁచిగా ధరియించుకొన నొసంగి

గీ. తైల మిళిత తత్కజ్జల ద్రవము వెట్టి
వాని యొడలెల్ల నభ్యంగభంగి వెలయ
నంటి రాపాదమస్తమ్ముఁ; నద్దురాత్ముఁ
డెఱుఁగలేఁడయ్యె నచ్చీఁకటింటిలోన. 67

వ. ఇవ్విధంబున నప్పనికత్తియలు వానికి సుఖంబుగాఁ బ్రత్యంగ మర్దనంబు గావించునప్పటికి రెండవ జాము గుటయు నంతఁ దన సంకేతానుసారంబుగా రాజపురోహితుండును జనుదెంచె; నప్పు డాచేటికలు ససంభ్రమంబుగా నక్కుమార సచివునితో నిట్లనిరి. 68

క. వరరుచికి మిత్త్రి మగు నృప
పురోధసుఁడు వచ్చె నతఁడు వోయెదుదనుకన్
ద్వరితముగ దీనిలోనికిఁ
జొరఁబొఱు; మతండు నిన్నుఁ జూడకయుండన్. 69

వ. అని యమ్మసిపూఁతలోనున్న సచివకుమారునకు వెఱఁగొల్పి కొనివచ్చి వాకిటనున్న మందసంబున డించి పైని దృఢంబుగా గడియవెట్టి యదంపుడు రాజపురోహితునికడ కరిగి, 70

క. స్నాన మిషంబున వాసిని
లోనికిఁ గొనివచ్చి భూషలున్ వస్త్రములున్
బో నూడ్చి గోఁచి నిడి యా
చానలు వానికిని యట్లె చతురత మీఱఁన్. 71

గీ. అంధకారమయం బైన యాగృహమ్ము
నందు మసిపూసియుం దల యంటుచుండ
నంతి చూడఁదవ జా మయ్యె; నపుడు దండ
నాథుఁడును వచ్చె భోగసన్నద్ధుఁ డగుచు. 72

క. అత్తఱి నాతని రాకకుఁ
జిత్తంబున మిపుల భీతిఁ జెందిన యట్లా
బిత్తరులు నృపపురోధసుఁ
దత్తరమున సచివతనయు దాఁచినపగిదిన్. 73

గీ. పెట్టిలో డాఁచి గొళ్లెంబు వెట్టె, యవల
దండనాయకుఁ గొనివచ్చి తద్విధమునఁ
గజ్జలముఁ బూసి యాజ్ఞను గడచుదనుక
గాత్రమర్దన మొనరింపఁ గడఁగి రంత. 74

వ. పశ్చిమ యామం బగుటయుఁ దన సంకేతంబు ననుసరించి హిరణ్యగుప్తుండు నచ్చటికి కరుగుదెంచె; నప్పు డుపకోశ పరిచారికలు తద్దర్శనభయంబునం బోలె నద్దండనాయకు నిప్పైత ము యథాపూర్వంబుగా మంజూషికాంతర్నిష్టుం గావించి వెలుపలి యర్గళంబు దృఢంబుగ బంధించుటయు:— 75

గీ. అంత నమ్మువ్వురును దము కబ్బ నున్న
యంధతామిస్రవాసంబు నభ్యసించు
నట్టు లామందసంబున నడఁగి మడఁగి
యొండొరులు భీతిఁ 'గి'మ్మనకుండి రందు. 76

వ. అట్లుండ నంత నాయుపకోశయు నింట దీపంబు వెలిఁగించి యాహిరణ్యగుప్తుని వాకిటిలోనికిం బిలిచి యమ్మందసంబు చెంత నిలిచి "తొల్లి నాభర్త నీకడ నిల్లడ యుంచిన మొల్లంబు ని"మ్మని యడుగుటయు నంత నాశరుం డచ్చోట నొరు లెవ్వరును లేకుండుటఁ గనుఁగొని యామెతో ని ట్లనియె. 77

ఉ. ఇచ్చెద నంటిఁగాదె సుదతీ! మును నీపతి నాకు డాఁపఁగా
నిచ్చిన విత్తమెల్ల; నిపు డేటికి నంశయ మొందె? నీవు నా
నచ్చినకార్య మద్ది ఫలవంతము సేయుము; పైని నేను నీ
యిచ్చకొలంది వర్తిలుదు నింతయు నిక్కము పంకజాననా.

గీ. అనిన నయ్యుపకోశయు నచట నున్న
మందసమువంక నల్లన మరలి యిట్టు
లనియె "నోగృహదేవతలార! వీని
నుడు లవెల్ల మీచే వినంబడెనుగాదె? 78

వ. ఇవ్వైశ్యుని వచనంబులు నాకు విశ్వసింపం దగినవి కావు. కావున మీ రిందులకు సాక్షులరై యుండురుగాక! 79

క. అని యాసతి దివ్వియ నా
ర్పినఁ, దచ్చేటులును బూర్వపథమునసే మ
జ్జన మిష యిడి కజ్జల లి
ప్తు నొసర్చఁగఁ జీకటింటఁ దూర్చిరి హాసిన్. 80

వ. ఇట్లప్పరిచారికలాహిరణ్యగుప్తు నంధకారమయంబైన యింటిలోనికిఁ గొంపోయి కాఁటుకనూనియ వెట్టి యల్లనల్లనం దల యంటం దొడంగుటయు. 81

గీ. అంతఁ దెల్లవాఱె; నచ్చేటులును "రేయి
గడచిపోయె నోయి వెడఁగ! యింక
నిచట నుండఁబోల దెట్లువచ్చితి వట్ల
యరుగు"మనిన వాఁడు నెఱఁగుపడుచు. 82

క. ఎదియుం దోఁచక యొకచోఁ
జదికిలఁబడి, వీథివెంటఁ జన సిగ్గగుటన్
గదలక యట్లే యస్మ
త్సదనము విడిపోవఁడయ్యెఁ దన గృహమునకున్. 83

గీ. అట్లు పోకుంటఁ గని చేటు లలుక మీఱఁ
"జెనఁటి కోమటి! నీ కేమి సిగ్గులేదె
తొలఁగి పొమ్మన్నఁ బోవేమి పలుగ!" యనుచుఁ
దిట్టి మొట్టుచు మెడఁబట్టి నెట్టి రంత. 84

గీ. చేల ఖండైకధరుఁడు మషీవిలిప్త
తనుఁడు నయి యెల్గుగొడ్డుచందమున వాఁడు

వీథిఁ బడి, తన్నుఁ గనుఁగొని, వెఱచి కుక్క-
లఱవ వడివడి నాత్మగేహమున కేఁగె. 85

వ. అంత : 86

ఆ.వె. నూనెమడ్డి జిడ్డుతో నాని లెస్సగా
నంటుకొన్నవాని యొంటిమీఁది
కజ్జలం బదెంతగాఁ దోమి కడిగినం
గాని తొలఁగఁ జేయఁ గష్ట మయ్యె. 87

ఆ.వె. అట్లు వాని మేనియందు దున్న యస్మసిఁ
గడుగఁ దొడఁగు దాసగణముచెంత
సైత మోడె సిగ్గుచేత వాఁ; డక్రిమ
క్రమము కష్టతరము గద భరింప? 88

వ. పదంపడి యాప్రాతఃకాలంబున నుపకోశయు, రాత్రి జరగిన వృత్తాంతం బేమియుఁ దన గురుజనంబున కేనియు నెఱింగింపక యే నిజపరిచారికానుగతయై తిన్నఁగా నందమహారాజ మందిరంబున కరిగి "మాపురంబుననున్న హిరణ్యగుప్తుం డను కోమటి, తనయొద్ద నాభర్త న్యాసంబుగానుంచిన యర్థంబు నపహరింపం జూచుచున్నవాఁ" డని విన్నవించె; నంత నాజననాయకుం డది విచారణం బొనరింపం దలంచి తోడన యావణిజుని రావించి యడిగిన, వాఁడు "నాకడ నీమె విత్తం బించుకయు లే"దని బొంకుటయు నప్పు డా యుపకోశ ఱేనితో నిట్లనియె. 89

గీ. ధర్మరక్షక! యది యథార్థమ్ము గాదు
సాక్షు లున్నారు నాకు మా సదనమందు;
మత్పతి విదేశగమనసమయమున గృహ
దేవతల నొక్క మందసం దిగిచి యుంచి. 90

క. చని యున్నవాఁడు విను మో
జనవర! యాదేవతలును సతతము మాయిం
టను జరగు పనుల నన్నిటిఁ
గనుచుందురు సాక్షు లగుచుఁ గడు మెలఁకువతోన్. 91

క. వారల చెంగట నీతఁడు
ధారాళంబుగ మదీయ ధన మిడ నంగీ
కారమ్ము చేసె; వారి వి
చారణ మొనరింపవలయు జనపాలమణీ! 92

వ. మాయింట సంసిద్ధంబుగా నున్న యామంజూష నొక్కవరి నీకొలువునకుఁ దెప్పించి నీ వా గృహదేవతల నడిగిన నిందలి సత్యంబెల్ల నీక తెల్లంబు గాఁగల దనుటయు నది విని యవ్వ డానందనరపాలకుండు విస్మయావిష్టచేతస్కుండై యమ్మంద సంబు నచ్చటికిఁ గొనితేరఁ బరిజనంబుల కానతిచ్చుటయుఁ దత్క్షణంబ పెక్కండ్రు రాజభృత్యులు చని దానిం గొని తెచ్చి రాజసమక్షంబునం బెట్టి; రాసమయంబున నుపకోశ యాపెట్టెవంకఁ దిరిగి యిట్లనియె. 93

ఉ. ఈవణిజుండు, మీరు విన నేమని పల్కినవాఁడు? సెప్పుఁడో
దేవతలార! సత్యమది తెల్పిన పిమ్మట మీర లిండ్లకుం
బోవఁగ వచ్చు; బొంకిన మిము న్దహియించెదనొండె నీ మహా
భూవిభుకోల్పునన్ బయటఁబుచ్చెదనొండె భవచ్చరిత్రమున్

గీ. అనిన నమ్మందసంబునం దడఁగి యున్న
ముగురు ధూర్తులు భయమున బెగడుపడుచుఁ
దమకుఁ గీడొదవకయుండ దాఁటుపొంటెఁ
బలికి రిబ్బంగి విస్పష్టభాషణముల. 95

క. ఈకోమటి యోరాజా!
యేకాంతమునన్ వచించె నీయమతో నే
దో కొంతధనముఁ దనకడ
నేకతముగ నీమె భర్త యిడి యున్నట్లున్. 96

గీ. అదియుఁ దనకోర్కి తీర్చిన యంత నొసఁగ
నమ్మతించె మాచెంత విస్పష్టరీతి
సత్యమియ్యది; యిందు సంశయము లేదు
వింటి మే మప్డు చెవులార! వీని నుడులు. 97

వ. అని యివ్విధమ్మున నమ్మందసంబునుండి వినవచ్చుటయు నా
సమయంబున. 98

క. వెలవెలఁ బోవుచు నేమియుఁ
బలుకఁగ నోరాడ కాకృపణుఁ డగు వణిజుం

డలుకుచు నంతయు నిజముగఁ
దెలిపెన్ దద్భూమిపతికిఁ దెల్లముగాఁగన్. 99

వ. పదంపడి యానందమహీనాథుం డమ్మందసంబునం దున్న దేవ
తలచందం బెట్టిదియో తెలియంగోరుచు నమందకౌతూహల
వశంబున నయ్యుపకోశ నభ్యర్థించి తన్మహామంజూషార్గళ
భేదంబు గావించి తెఱపించుటయు నప్పుడు:— 100

క. అడఁగొన్న యిగురులముద్దల
వడువున నమ్మగురు పాపవర్తనులును వె
ల్వడి రమ్మందసఁ గడుఁ దడఁ
బడియెడు హృదయములతో సభాస్థలి నడుమన్. 101

వ. అంత:— 102

క. మసిపూఁత బ్రుంగి, కౌపీ
న సహితులై యున్నవారి నరపతియుఁ దదీ
య సచివగణమును గనుఁగొని
పొసఁగన్ గుఱుతింపలేకపోయిరి తొలుతన్. 103

వ. పదంపడి యెట్టకేలకుఁ బోల్చి తెలిసికొనుటయు నంత నచ్చటి
సభాసదు లందఱును వారిం గనుంగొని కడుపు లగల నవ్వఁ
దొడంగి; రప్పు డానందమహీనాథుం డంచుల కెంతయు వింత
పడుచు నిది యెట్లు సంభవించె నని యుపకోశ నడిగిన నా
సాధ్వియు జరగిన యావద్వృత్తాంతంబును యథాక్రమంబుగా
నాతేనికి విన్నవించె నప్పుడు:— 104

ఆ.వె. లలిత శీల లైన కులకామినుల చరి
త్రము లచింత్యములు గదా యటంచు
నచట నున్న సభ్యు లందఱు నాసతీ
తిలకమును గడున్ నుతించి రంత:— 105

మ. పరదారాపహృతిచ్ఛఁ దిరుగు నప్పాపాత్ములన్ మూఁవురన్
ధరణీనాథుఁడు నందుఁ డల్కమెయి విత్తభ్రష్టులం జేసి త
త్పురమున్ వీడి విదేశవాసమునకుం బోవంగ శిక్షించె; ని
వ్వారి కేనిన్ గుపథప్రవృత్తి శుభసంపత్తిన్ బ్రతిష్ఠించునే? 106

వ. ఇవ్విధంబున నాదుర్జనులు మూఁవురకును బ్రవాసశిక్ష విధించి
పదంపడి యుచితజ్ఞుం డైన యమ్మహీకాంతుం డుపకోశ
నుద్దేశించి యిట్లనియె. 107

శా. అమ్మా! నీవు మహాపతివ్రతవు; నీయత్యద్భుతోదారవృ
త్తమ్మున్ నీసుగుణప్రశస్తియును సంస్తవ్యంబు; లింకెట్టిలో
పమ్మున్ గల్గదు నీకొకప్పుడు; భవత్పాతివ్రత్యమున్ మెచ్చి నిన్
సమ్మానింపఁ దలంచితిన్ సహజవాత్సల్యప్రమోదమ్ములన్.

క. నిను మత్సహోదరిని గా
ననయము భావించుకొందు నడలకు మనుచున్
జనవుగ నూరార్చి మహో
ధన వస్త్రాభరణవితతిఁ దనిపి పనుపఁగాన్. 109

క. ఉపకోశయు నవ్వడువున
నృప సమ్మానంబు వడసి నెమ్మదిలో గ

ర్వపడక మోదమ్మునఁ ద
న్నృపు నాపృచ్ఛన మొనర్చి నిండుమనముతోన్. 110

గీ. అవనివల్లభ దత్త విత్తాదికములు
సేకరించి సహాగతచేటి యగుచుఁ
గాంచువా రెల్లఁ దనుఁ బ్రస్తుతించుచుండఁ
జనియె వెండియు నిజ నివాసమున కంత. 111

క. వర్గోపవర్గు లెంతయు
హర్షించిరి నిజతనూజ యమలిన చరితో
త్కర్షమునకుఁ; బౌర మనః
కర్షణముం జేసె నామె కథ యప్పురిలోన్. 112

వ. అది యక్కడ నట్లుండ:— 113

సీ. అంత నేనును దుషారాచలసీమఁ దీ
వ్రతపంబుఁ గావించి ప్రమథనాథు
సేవింప నా దేవదేవుండు వరదుఁడై
యాపాణిని కొసంగినట్టి శబ్ద
శాస్త్రంబ నాకుఁ బ్రసాదించె; నేఁ దది
చ్ఛానుగ్రహములఁ దచ్ఛాస్త్ర మెల్లఁ
బూర్ణీకరించి, సంపూర్ణభర్గప్రసా
దామృతపూర్ణుండ నగుచు వెడలి

గీ. యవిదితాధ్వపరిశ్రాంతి నయి సుఖముగ
మాగృహమ్మున కరిగి మన్మాతృదేవ

113

తకును గురుజనమునకు వందనము సలిపి
పిదప నుపకోశ వృత్తాంత మదియు వింటి. 114

గీ. అది వినినయంత నాహృదయమున మోద
విస్మయమ్ములతోఁడ నావెలఁది మీఁది
సహజవాత్సల్య సౌహార్ద సమరసతలు
తోంటికంటెను వర్ధిల్లఁ దొడఁగె మిగుల. 115

వ. అయ్యనంతరంబున వర్షోపాధ్యాయుండు మున్ముఖంబున నా నూతనవ్యాకరణంబు వినవలయు నని యభిలషించెంగాని, యది యతనికి భక్తాభీష్టప్రదాతయగు షణ్ముఖదేవుండె ప్రకాశం బొనర్చె; నంత మఱికొంతకాలంబు సనిన పిమ్మట నొక్కనాఁడు వ్యాడీంద్రదత్తులు వర్షోపాధ్యాయునితో గురుదక్షిణం గూర్చి విన్నవించుటయు నప్పు డస్మద్గురువరుండును దన కొక కోటిసువర్ణంబులు దక్షిణగా నొసంగుఁ డని యడిగిన, వ్యాడీంద్రదత్తు లందుల కంగీకరించి వచ్చి నాతో నిట్లనిరి.

క. మన గురునకు దక్షిణ యిడఁ
గొని తేవలయున్ సువర్ణకోటి నిపుడు; గా
వున నంద మహీశ్వరు నా
ధన మర్థింపంగఁ బోవుదము రమ్ము సఖా! 117

గీ. నంద భూమీశ్వరుఁడు నవనవతి కోటి
పరిమితస్వర్ణముల కధిపతి; యతండు

దక్కు వే ఱొక్కరం డింత ధనము మనకు
నొసఁగఁ జాలెడువాఁడు లేఁ డుర్విలోన. 118

వ. అదియునుంగాక, యతండు తొల్లి నీధర్మపత్ని యుపకోశ పాతివ్రత్యసౌశీల్యంబులకుఁ దద్దయు మెచ్చికొని సమ్మానించి యాసాధ్విం దనకు ధర్మభగినిగాఁ జేకొని యున్నవాఁ డగుటం జేసి నీకు శ్యాలకుం డయ్యెం; గావున మన మాతనివలన నెద్ది యేసియుం బడయ నగు; ననుటయు నది యెంతయు లెస్సగా విచారించి నిశ్చయించి సబ్రహ్మచారులమైన మేము మువ్వురము నయోధ్యాపురంబున నున్న నందమహారాజు కటకంబున కరిగితి; మాసమయంబున:— 119

గీ. ఏమి సెప్పుదు? మే మట కేఁగునాఁడె
జనవిభుఁడు నందరాజు పంచత్వ మొందె;
నుల్లముల మాకు నగ పుప్పతిల్లి నల్లె
రాష్ట్రమం దెల్లచో శోకరవము లెసఁగ 120

వ. అంత, మా మువ్వురలో యోగసిద్ధి సంపన్నుం డైయున్న యింద్రదత్తుం డు తత్క్షణంబ యొక్క యుపాయంబుఁ జింతించి, సోదరులారా! నే నీక్షణంబునందె యోగబలంబున నందుని మందిరంబున కరిగి యందు గతాసువై యున్న నందశరీరంబునం బ్రవేశింపఁ గలవాఁడ; నంత నాతఁడు పునర్జీవితుం డగు; నయ్యనంతరంబున:— 121

క. వరరుచియు నర్థియై యట
కరుదెంచి తదర్థ మడుగ నగు; నయ్యెడ భూ
వరదేహవర్తి నగు నే
నెఱిఁగి యతని కిడుదు నస్మదీప్సితధనమున్. 122

ఆ.వె. ఇచ్చి మరల నేను వచ్చెదు నందాఁక
నాకళేబరమ్ము నేకతమున
భద్రపఱిచి వ్యాడి పరికించుచుండెడుఁ
గాత; మిట్లు సేయఁ గడఁగవలయు. 123

క. అని చెప్పి యింద్రదత్తుఁడు
తనయోగబలంబుచే స్వతనువు విడిచి నం
దుని మృతదేహమునం జొ
చ్చె; నతండును మరల బ్రదికి చెచ్చెర లేచెన్. 124

వ. అంత:— 125

క. మృతుఁడైన ఱేఁడు క్రమ్మఱ
బ్రతుకఁగఁ దద్రాష్ట్రమెల్లఁ బరమాశ్చర్యా
న్వితమై నిరుపమ కౌతుక
యుతమై కావింపఁదొడఁగె నుత్సవశతముల్. 126

వ. ఇది యిట్లుండ:— 127

గీ. వ్యాడి యట నొక్క శూన్యదేవాలయమున
నింద్రదత్తుని తనువున కేదొసఁగును

గలుగ కుండఁగ నరయుచుఁ గాచుచుండె
నేను రాజకులంబున కేఁగి యాచట. 128

గీ. యోగనందుని దర్శించి యుచితభంగి
స్వస్తికారం బొనర్చి ప్రశస్తఫణితి
నతని నడిగితి గురుదక్షిణార్థమునకు
హేమకోటి యొకండు నా కిమ్మటంచు. 129

క. అడిగిన శోకోద్రేకవ యా
తఁడు నలరుచు సత్యనందధరణీశ్వరు ప్రే
గ్గడయగు శకటాలుని కే
ర్పడ నన్నుం జూపి యిట్లు పలికెన్ బ్రీతిన్. 130

క. గురుదక్షిణార్థమై ధీ
వరుఁ డితఁడు సువర్ణకోటి వాంఛించుచు నన్
దరిసింప వచ్చె; నది యి
త్తఱి నీతని కొసఁగి యనుపఁదగు మంత్రివరా! 131

వ. అని యివ్విధంబున, యోగనందుం డైయున్న యింద్రదత్తుండు శకటాలున కాజ్ఞాపించుటయు నంత, నమ్మహా మతిమంతుం డగు మంత్రిసత్తముం డది యంతయు నరసి:— 132

గీ. విగతజీవితుఁ డైన భూవిభుఁడు మరల
బ్రతుకుటయు నట్టి తఱి నర్థి వచ్చుటయును
గోటి హేమమ్ము లి మ్మని కోరుటయును
గోరి నంతయు తేఁ డీయఁ గోరుటయును. 133

ఆ.వె. తన మనంబులోనఁ దలపోసి తోఁడనే
కల నిజం బదెల్లఁ దెలిసికొనియె
మంచిచెడ్డ తెలుఁగు మతిమత్తరుల కేది
తెలియఁబడక యుండుఁ దలఁచి చూడ ? 134

చ. తెలిసియు నాతఁడెంతయును ధీరుఁడు గావున రాజు నాజ్ఞనో
దల ధరియించినట్లి వసుధావర! చిత్త మటంచు నమ్రుఁడై
పలికి, యుపాయకల్పనము భావమునం దొనరించు కొంచు ని
ట్టులు తలపోయఁజొచ్చె నొకఁడున్ నిజ బుద్ధివివేకసంపదన్.

వ. అది యెట్లనిన:— 136

చ. మహిపతి తా గతించె; ననుమానము లేదిఁక దీన; నెందఱే
నహితులు లేచియుందురు గదా తటియయ్యెనటంచు రాజ్య
సంగ్రహమొనరింప? బాలకుఁడు రాజకుమారుఁడు; గాన నా
మహాత్ముని శరీర మెట్లయిన మన్చుట ధర్మము సర్వ
భంగులన్. 137

ఉ. ఎవ్వఁడొ యోగసిద్ధుఁ డొకఁ డీన్నృపదేహమునందుఁ జొచ్చి తా
నివ్విధి నుండఁ బోలు! మృతు లేడఁ బునస్స్థితిఁగాంచు టేడ? నే
నెవ్వలనన్ గణించిన నిదేమియు సంగత మాట లే; దరుల్
దవ్వుల వార లియ్యదియుఁ దథ్యమకాఁగఁ దలంతు రజ్ఞతన్.

ఆ.వె. అట్లు తలఁచి తొంటి యనువున నుంకురు
గాని యెత్తిరారు కయ్యములకు

దాన నిపుడు నందధరణీశు తనయున
కొక దొసంగు నొదవ కుండుc గాదె? 139

వ. ఇది యిట్లుండుటంజేసి, యితం డేయోగ సిద్ధుండై ననేమి! నంద దేహంబున నిట్ల ప్రవర్తించుచుండుట యన్నివిధంబుల శ్రేయ స్కరంబై యుండు; రాజ్యవ్యవహారంబు నిరుపద్రవంబుగా నిర్వహింపం బడుచుండు; ననంతర కార్యవిచారంబు తరువాతఁ గావించుకొందుము గాక! ప్రస్తుత మీయోగనందుం డేని యిట్లు నిల్చియుండు నుపాయం బొనరింపవలయు నని యివ్వి ధంబున నాలోచించి మంత్రినంబున:— 140

ఉ. చారులఁ బెక్కురం బిలిచి చయ్యన నప్పురియం దనాథులౌ వారి శవంబుల న్వెదకి వారక తోడనె వాని కగ్ని సం స్కార మొనర్పఁగాఁ గఠినశాసనమొక్కఁడు పెట్టి పంపె; న ద్ధీరవరేణ్యు శాసనముతీరున వారును దత్పురంబునన్. 141

ఆ.వె సత్త్రములను ధర్మశాలల జీర్ణదే
వాలయముల వీధులందు సందు
గొందులను ననాథకుణపముల్ పరికించి
తోడనే దహింపఁ దొడఁగి రంత. 142

గీ. అన్నడుమ నింద్రదత్తు కాయమును వార
లప్పురాతనదేవాలయమునఁ గాంచి,
వ్యాడి యడ్డుచునున్న నవ్వలకుఁ ద్రోసి
కాల్చివైచిరి మంత్రి యాజ్ఞాబలమున. 143

ఆ. వె. అంతలోన నర్థి కావిత్తము నొసంగ
వేగపఱచుచున్న యోగనంద
విభుని సుచితవాక్యవిభవుండు శకటాల
మంత్రివరుఁడు నిట్లు మనవిచేసె. 144

క. దేవా! దేవర పునరు
జ్జీవితులై యుంట నిపుడు చిత్తంబుల మో
దావిర్భావ మ్మయ్యెఁ; ద
దావేశమువలనఁ బరిజనావళి యెల్లన్. 145

గీ. ఉత్సవాక్షిప్త చిత్తమై యుండెఁ; గాన
నచిరకాలంబునందె యీ యవనిసురున
కేలిక యనుగ్రహించిన హేమకోటి
నిడుము; నందాఁక నీతఁడు తడయుఁ గాక! 146

వ. ఇంత మాత్రంబున నే యపచారంబును సంభవింపనేరదుగాదె?
యని యిట్లు శకటాలుండు సముచితంబుగ విన్నవించి కాల
యాపనంబు సేయుచుండుటయు నాసమయంబున:— 147

గీ. వ్యాడియును రేనిచెంతకు వచ్చి, కన్ను
దోయి నశ్రుజలంబులు దొఱఁగ మిగుల
నిట్టలంబైన దుఃఖంబు నెట్టుకొనఁగ
నిట్లు మొఱవెట్టఁ దొడఁగె నానృపుని యెదుట. 148

వ. అది యెట్లనిన:— 149

మ. అకటా! నందమహామహీశ్వర! యనాథాధార! యో ధర్మర
క్షక! నీ యభ్యుదయోత్సవంబున, బలాత్కారంబుగా నొక్క
విప్రకులోత్తంసుఁడు యోగసంస్థితుఁ డనుత్క్రాంతాసుఁ!
డయ్యయ్యో! యూరక దగ్ధుండయిపోయెఁ దావక భట
వ్రాతంబుచే నియ్యెడన్. 150

గీ. తగవు గా దిది; యోగసంస్థద్విజుండ;
కాని, శవ మది గా; దేల కాల్చివైతు
రనుచు నేమొఱ్ఱ లిడుచున్న వినక కాల్చి
వైచి రోయీ! యనాథ శవం బటంచు. 151

ఆ.వె. మానవేంద్ర! నీదు మంత్రియానతియయ్యె
నఁట! యదోషులైన యట్టి యోగి
వరుల కేని రక్ష వలదె? యీ యన్యాయ
పాలనమున కెవరు బాధ్యులయ్యె! 152

క. అని యతఁడు మొఱ్ఱ వెట్టఁగ
విని, నందశరీరమందు విలసిల్లెడు బు
ద్ధి నిధి యగు నింద్రదత్తుఁడు
తన తను వది యగుటఁ దెలిసి తబ్బిబ్బగుచున్. 153

వ. అత్యంత శోకవిహ్వలుండై తనలోనఁ దా నిట్టి దట్టిది యని
వివరింప నలవిగాని దుఃఖావస్థనొందె; నయ్యనంతరంబున:—

గీ. ఆత్మ దేహదాహంబుచే నాతఁ డట్లు
నంద దేహస్థిరుండైన కందు వరసి

మతిమదగ్ర్యుండు శకటాల మంత్రివరుఁడు
నిచ్చె నా కప్పు డాకోటి హేమములును. 155

గీ. అంత నిజదేహనాశ శోకాకులాత్ముఁ
డైన యయోగ్యనందుండు నన్యు లెవరుఁ
దెలియకుండఁగ నిర్జనస్థలముఁ జేరి
వ్యాడిఁ గనుఁగొని యిట్లనె వగపు నిగుడ. 156

గీ. "కటకటా! యగ్రజా! నాదు గతి యరసితె?
మహిత భూదేవవంశసంభవుఁడ నయ్యుఁ
దుదకు నే నిప్పు డిట్లు శూద్రుండ నగుచు
నిచటఁ జిక్కితి; నేమి నాకీ యవస్థ! 157

క. కులము సెడిపోయె; నీ సిరి
గలిగిన నేమాయె? ధరణి గలిగిన నేమా
యె? లవంబేనియు గౌరవ
ము లభించునె బ్రాహ్మణత్వమునకుం బోలెన్. 158

వ. బహుజన్మాంతర పుణ్యవిశేషంబున లభ్యంబైన మదీయ బ్రాహ్మణ్యంబు నిష్ఫలంబునఁ గోలుపోవలసివచ్చెంగదా" యని యనేకప్రకారంబులఁ జింతింపందొడఁగుటయు నంత నయోగ్యనందుని వచనంబులు విని వ్యాడియుఁ దత్కాలోచిత సంభాషణంబుల నతని సమాశ్వాసించి యిట్లనియె.నాయనా! కడచినకార్యంబునకు విచారించినఁ బ్రయోజనంబు లేదు. నీ విప్పుడు ప్రస్తుత కార్యావేక్షణం బొనరింపవలసియున్న

యది; కావున నేఁ జెప్పిన దంతయు నాలింపుము:— 159

క. శకటాలుఁడు మన చరితము
సకలంబు నెఱింగె; నతని చక్కనెపుడు నీ
వొక కన్నిడి నేర్పున మెలఁ
గక యున్నెడ నెగ్గు వుట్టఁగల దో యనుజా! 160

మ. మతిమన్ముఖ్యుఁ డతం డనంగ నొక సామాన్యుండు గాఁ; డెప్పు డేగతి నేమి యొనర్చునో! యది యెఱుంగన్ రాదు; తత్పూర్వనంద తనూజుండగు చంద్రగుప్తునకు నేతద్రాజ్య మిప్పించి భూపతిఁ జేయన్ దలపోసి నిన్నుఁ గడతేర్పం జూచు చుండుంజుమీ! 161

ఉ. కావున, నేదియేని యొక కారణముం గలిగించి సన్మతి శ్రీవిభవాఢ్యుఁడౌ వరరుచిన్ దగ నీకుఁ బ్రధానుఁజేసి త ద్ధీవిభవంబు పెంపున నతిస్థిరతన్ భవదీయరాజ్య మెం తే విలసిల్ల నత్తమగతిన్ బెనుపొందుము భోగభాగివై.

ఆ.వె. అనుచుఁ దెలియఁబలికి యావ్యాడి యాతని
వీడుకోలువడసి వెడలి చనియె
వర్షగురువరుండు వలచిన దక్షిణ
నొసఁగుపొంటె నతనియొద్ద కంత. 163

గీ. యోగనందుండు ననుఁ బిల్చి యుచితరీతి
నాత్మ మంత్రిపదం బిచ్చె నాదరమున

నేను నాతని కయ్యెడ హితముఁ గోరి
యేకతంబున నతనితో నిట్లు లంటి. 164

క. ఓయీ! నీ కిఁక విపరీత
కాలమె విధివశమునఁ; బోయిన దేదో
పోయెం గా కీరాజ్య
శ్రీయేనియు నిలుచునట్లు చింతింప నగున్. 165

వ. ఇందులకు నేఁ జెప్పంబోవు విధానంబు నవధరింపుము. 166

ఆ.వె. పూర్వమందు మంత్రిపుంగవుఁ డగు శక
టాలుఁ డింక మున్నుపోలె సచివ
పదమునందు యున్న నిది నీకు నిలుచుట
కల్ల యని యెఱుంగు ముల్లమందు. 167

ఆ.వె. కాన, నేదియేని కారణ మొక్కండు
వలికి తత్పదంబుఁ దొలఁగఁజేసి
యతని నెట్లులైన నడఁగఁద్రొక్కక యున్న
నధిప! నీకుఁ బ్రభుత యస్థిరంబ. 168

క. అని చెప్పిన నాపలుకులు
విని యాతఁడు "బ్రదికియున్న విప్రుని మోగ
స్తుని గాలిపించెఁ గావున
ఘనతరదోషుఁ" డని దండ్యుఁగాఁజేసి వేసన్. 169

క. శకటాలుని నాతని పు
త్రికుల న్నూర్వురను గష్టదశఁ దన్నగరీ

నికటస్థిత నిస్తోయాం
ధకూప వివరాంతరంబునన్ నిలిపించెన్. 170

వ. ఇట్లు ఘోరదండనవిధానంబున నిలువం జేసి యన్యోన్యోత్తర శతజీవులకును బ్రత్యహంబు నేక శరావమాత్ర పరిమితంబులైన సక్తువులును దావన్మాత్రంబుల యైన దాహోదకంబులు నొసంగుచుండ నాజ్ఞాపించుటయు నంతి సమ్మహామాత్యుండైన శకటాలుం డత్యంతాద్భుత ధైర్యసంపన్నుం డయ్యును దత్కాలజనిత విషాదాతిశయంబున నిజప్రియసుతశతంబు నవలోకించి యిట్లనియె. 171

శా. కట్టా! పుత్త్రకులార! చూచితిరె యీకష్టస్థితిన్? దైవమెట్టీయాపద వెట్టెనో మన కహా! యీసక్తుమాత్రంబునన్ బొట్టల్ నూఱు నొకండు నించికొన నౌనో? యీజలంబెట్లు నీర్వట్టుం దీర్పఁగఁజాలు నిందఱకు నా రా జేమి గానెంచెనో!

ఉ. ఏటికిఁ బుత్రులై పొడమి రిందఱు నిట్లు కుమారులార! నా పోటికి? నేను మిమ్ములను బ్రోవఁగలేని నిరర్థకుండనై కూటికిఁ గ్రుంగు మిమ్ముఁ గనుఁగొంచు నమానుషమైన యిట్టియా! రాటము నొందువాఁడఁ గద రాజకృతాపకృతిన్ భరించుచున్. 173

చ. కడుపునఁ గన్న మిమ్ములనుగా దని యే నెటుతిందు? లేక యీ కొడుకులలోన నెవ్వనికిఁ గూరిచి తక్కినవారి నాఁకటన్

జెడుఁ డని చెప్పుదున్? గణనసేయఁగ నెల్లరుఁ బ్రేమపాత్రులౌ
కొడుకులెకారె మీ రరయఁ గూరిమి తుల్యము కాదె తండ్రికిన్?
ఉ. కావున నొక్కమాట పలుకన్ దలకొంటి; వినుండు పుత్రులా
రా! విపరీతకృత్యమున రా జయి తా నల యోగనందుఁ డే
దో వెలఁగొంది, నావలన నొప్పమి పుట్టు నటంచు నెంచి న
న్నీవిధి గీటడంప విధియించినవాఁ డిటు ఘోరదండమున్.
చ. అపగతజీవుఁడై చనియె నస్మదధీశుఁడు సత్యనందభూ
మిపుఁడు; తదీయపుత్రకుఁడు మిక్కిలి బాలుఁడు చంద్రగుప్తుఁ డీ
కపటపుమార్గముల్ దెలియఁగాఁ దగువాఁడును లేఁడు రాజ్యమీ
నెపమున యోగనందునకు నిల్కడగా ననుభోగ్య మాఁజుఁడీ!
ఉ. బాలుఁడు చంద్రగుప్తుఁడు విపన్నత నొందక యుండఁగావ, న
న్నేలిన సత్యనందు ఋణ మీఁగ, నహేతుమహాపకారి ని
బ్బాలిశు యోగనందుఁ బగఁబట్టి తెగించి ప్రతిసేయ నెన్నఁడేన్
జాలినఁగాక వ్యర్థమగు జన్మము లేమిటి కస్మదీయముల్.
గీ. కాన, సుతులార! యీమనలోన యోగ
నందు పగఁదీర్చికొనఁగల్గిన నాఁ డొకండె
యీజలమ్మును సక్తువు లెట్లొ కొంచుఁ
బ్రాణధారణ మొనరింపవలయువాఁడు. 178
క. మనయెడ నిర్దయుఁడై యి
ప్పని సేసిన యోగనందు పగఁ దీర్పఁగఁ జా
లినవాఁడ కాక మఱి త
క్కిన వారలు బ్రతికియున్న గిట్టిన నొకటే. 179

వ. మనలో నెవ్వం డీకార్యంబు నిర్వహింప సమర్థుండు సెప్పుఁ
డని యడుగుటయు:— 180

ఆ.వె. అంతఁ దండ్రిపల్కు లాలించి తత్పుత్రు
లార్య! యట్టి వీరకార్యమునకుఁ
జాలినట్టి శక్తసంపన్నుఁ డొకరుండుఁ
జూడఁబడఁడు నీదు సుతులలోన. 181

క. కావున వినుమో తండ్రీ!
నీవే యీనక్తువులును నీరముఁ గొనుచున్
జీవించి యుండి సేయుము
తీవరమగు విద్వమత్ప్రతీకారంబున్. 182

క. ఊరక యరి చేసిన యప
కారమునకు మాఱు సేయఁగాఁ జాలని ని
స్సార నిరర్థక జీవులు
ధారిణిపై బ్రదికియున్నఁ దత్ఫల మేమీ? 183

గీ. తనువు లివి యెన్నఁటికి శాశ్వతములు గావు!
పౌరుషవిహీన మైనది బ్రదుకు గాదు!
దారుణారిజనప్రయుక్తమగు దుస్స
హాపకారము సైరించు నదియుఁ గాదు! 184

గీ. చాలు నీ కొక్కరునకు నీసక్తుజలము;
లే ముపవసించి విడిచెద మీాయసువులు
సంశయింపకు పుత్రనాశమున కాత్మ
వద్దరా! యంచుఁ దత్సుతుల్ పలికి రహహా! 185

క. శూరవరుల కహితప్రీతి
కారము ప్రాణములకంటెఁ గడుఁ బ్రియము గదా
పూరికిని గొనరు జీవము
లౌరా! శూరులచరిత్రి లవి చిత్రింబుల్ ! 186

వ. అది యట్లుండె. 187

చ. పదపడి యాయమాత్యుఁడును బ్రత్యహ మట్లులె తా నొ
కండు నిర్యుదకము సక్తులున్ గొనుచునుండె నెటో తన
మేని కొండు కి ౹ డొదవక యుండ నిల్చుకొన; నున్నతిఁ గన్న
జిగీషుచిత్తముల్ ౹ మదిఁ దలపోయుఁ గొర్యమదమత్తములై
విలసిల్లు నక్కటా! 188

చ. తనయులు నూర్వురున్ క్షుధకుఁ దప్పికిఁ జిక్కి క్రమక్రమం
బుగాఁ ౹ దనువులు వీడుచుండ సవిధంబున వారి యసూర్ధమ
వ్యధన్ ౹ దన కనులారఁ గన్గొనుచు "దైవవశం బిది ! రాజు
నాజ్ఞ చే ౹ కొనక చరించువారి కొడఁగూడవు సేమము!"
లంచు నెంచుచున్. 189

క. సుత శత కరంక గణ పరి
వృతుఁడై యానూఁత శత్రువిజిగీపాసం
శ్రితమతి శకటాలుఁడు జీ
వితము భరించెన్ స్వకర్మవిధిఁ దా నొకఁడున్. 190

ఆ.వె. అంత యోగనందుఁ డఖిలసామ్రాజ్యంబు
నందు బద్ధమూలుఁడై తనర్చు

చుండె; నచట వ్యాడియును గురుదక్షిణ
నొసఁగి తిరిగి వచ్చి యెసక మెసఁగ. 191

వ. యోగనందుని సందర్శించి నిజభ్రాతృవాత్సల్యంబున నతనితో
నిట్లనియె. 192

మ. అనుజా! నీవిభవంబు సుస్థిరతరంబై వర్ధిలుంగాత! నా
పను లెల్ల న్నెఱవేఱె; వర్షగురు సంభావించితిన్ దక్షిణన్
దనియంజేసి; యిఁక కెందునేని చని స్వస్థంబైన చిత్తంబుతో
ననవద్యస్థితి నొందఁగాఁ దపము నేయం బోవుచుంటిన్ జుమీ!

క. కాన నను నీవు వెండియుఁ
గానంగా నేర వెంతకాలమునకు; నీ
స్థానమున నీవు సుపరి
జ్ఞానముతో మెలఁగి కీర్తిఁ గనుము కుమారా! 194

చ. అన విని యోగనందుఁడు నిజాప్త సహోదర విప్రయోగసం
జనిత విషాదబాష్పములు జాల్కొన నాతని గౌఁగిలించి "యో
యనఘచరిత్ర! నన్ను విడనాడఁగఁ బోలునె? యట్లుకాదు! నీ
వును నిట రాజ్యభోగములు వొందుచు నాకడ నుండు
మెప్పుడున్. 195

క. నీ క్షేమి కోఱఁతె? రాజ్య
శ్రీ కీవును గర్తవే భుజింప ; ననుఁడు న
వ్వాకులు విని యును, వ్యాడి ని
రాకులుఁడై యిట్లు వలికె నాదర మొప్పన్. 196

సీ. విను మోప్రియానుజా! విశ్వంభరాధీశ!
యీభోగముల నా కొకింతయేని
రతి లేదు; క్షణనశ్వరము శరీరము నమ్మి
కొని మహాసంసారఘోరవార్ధి
మునుఁగుచుం దేలుచుఁ గొనఁగానఁగా లేక
వసటల నొంద నావల్లఁగాదు
తెలిసియు నెవ్వఁడీ తీరైన నిస్సార
విషయములం జిక్కి వేడ్కసేయు?
ఆ.వె. లచ్చి మరుమరీచి; లలిత విజ్ఞాన సం
పన్నులైన వారి భావములను
మోహపాశబంధముల బిగింపఁగఁజాల;
దిది యెఱింగి మనుట హితముగాదె? 197

క. నీ వనిన, రాజవైతివి
కావున భోగానుభూతిఁ గనుచును ధర్మ
ప్రావీణ్యమునఁ దరింపం
గా వచ్చున్ యజ్ఞ దాన కర్మాదులచేన్. 198

వ. అని యివ్విధంబున నా వ్యాడి యుచితవచనంబుల నయ్యోగ
నందు ననునయించి యతని వీడ్కొని తపోవనంబున కరిగె;
నయ్యనంతరంబున:— 199

గీ. యోగనందమహీజానియును స్వకీయ
పురవరంబగు పాటలీపుత్రకమున

కరిగి యట రాజభోగంబు లనుభవింపఁ
దలఁచి సకలపరీవారకలితుఁ డగుచు. 200

క. ననుఁ దన వెంటన్ దోడ్కొని
యనుకూలం బైనతఱి బయల్వెడలి చిరం
తనరాజధాని కచటికిఁ
జనియె మహావైభవాతిసంరంభముగాన్. 201

వ. ఇట్లు చని యోగమిత్రమా! కాణభూతీ! యోగనందుం డందు రాజ్యంబు సేయుంగడంగుటయు నేను నాతని సన్నిధానంబునఁ గొలువుసేయుచు:— 202

చ. కులపతి యాసుశీల యుపకోశ సతంబుఁ బ్రియోపచారముల్
సలుపుచునుండఁ దల్లియును సద్గురులున్ హిత ముగ్గడింప ను
జ్జ్వలమతిఁ దన్నరేంద్రసచివత్వధురంధరతన్ వహించుచున్
గలుములఁ దేలుచున్ సుచిరకాలము నే నచటన్ వసించితిన్.

చ. అనుదివసంబు నాకట సురాపగ నిత్యతపః ప్రసన్నయై
కనకమయాన్నముల్ తనివిగా నిడ, భారతియున్ సతంబు న
న్ననుగమనించి మూర్తిమతియై, బహువిస్తరరాజకార్య సా
ధనముల వెల్లడించుచు ముదంబునఁ దోడ్పడ నేఁగెఁ గాలమున్

శ్రీ శ్రీ శ్రీ

కథాపీఠలంబకంబునఁ
చతుర్థ తరంగము
సమాప్తము.

ఓమ్ !

# ఆంధ్ర
# కథాసరిత్సాగరము.

## క థా పీ ఠ ల ం బ క ము. ౧.

:o:

### పంచమ తరంగము

వ. అని చెప్పి యవ్వరరుచి వెండియుఁ గాణభూతితో నిట్లనియె.

క. విను మోయికాణభూతీ !
మన మలరఁగ యోగనంద మహీపతి తా న
య్యనువున నిజధాత్రీపా
లన మొనరించుచుఁ బ్రభూతలక్ష్మీవశతన్. 2

గీ. కామపరతంత్రుఁడై క్రమక్రమముగ నృప
భోగములఁ జిక్కి మద మెక్కి నాగ మట్లు
మత్తిలి స్వకీయదేహంబ మఱవఁజొచ్చె
రాజసంబున విషయానురక్తిఁ దవిలి. 3

క. ఇవ్విధమునఁ గామాదుల
కవ్వసుధేశుండు వశ్యుఁ డగు టబ్రమొకో?

యువ్వెత్తుగ వచ్చిన సిరి
యెవ్వనికి మదంబు గూర్ప దీక్షించినచోన్ ? 4

వ. అనయమయంబున:— 5

గీ. అట్లతండు విశృంఖలుం డగుచుఁ దిరుగ
నేను దద్రాజకార్య విధాన చింతఁ
దవిలి యుండఁగ వలసె స్వధర్మమునకు
హాని వాటిల్లుచుండఁగా నహరహంబు. 6

గీ. ఎడతెగని రాజకార్య సమీక్షణముల
నైహికసుఖంబులకు హానియైనఁగాని
స్వీయధర్మంబునకు నట్టి చేటు పుట్ట
నైనఁప నెట్లగు సత్కులసంభవులకు ? 7

క. అంత నిది యంతయును నేఁ
జింతించి యొకప్పుడేనిఁ జిత్తమునకు వి
శ్రాంతి యొదవంగ వేఱొక
మంతిరి తోడున్న యెడల మంచి దటంచున్. 8

సీ. అయ్యంధకూపంబునం బట్టి దురవస్థ
నున్న యాశకటాలు నుద్ధరించి
నాకుఁ జేయూఁతగాఁ జేకొని నిజధర్మ
నిర్వహణము నెట్లొ నెఱపువాఁడఁ;
బూర్వవైరమున నీభూమీశ్వరున కతం
డే నుండఁగా నెగ్గు లేమిసేయుఁ ?

గృతి మెఱింగి యతండు మతిమంతుఁడై నాకు
వశవర్తిగా నుండవచ్చుఁ గాదె?

గీ. యట్లు వర్తింపకున్నచో నతఁడె గాసిఁ
జెంది చెడిపోవు; నట్లేల సేయు నతఁడు?
లోక మెఱిఁగిన సదసద్వివేకి గాఁడె?
యనుచు నాలోన నే నిశ్చయ మ్మొనర్చి. 9

క. అనువైన వేళ నృపునకు
ననుకూలముగా వచించి, యర్థించి తదా
జ్ఞను గొని, శకటాలునిఁ జ
య్యనఁ గూపము వెడలఁ దిగిచి, యర్హావిధమునన్. 10

గీ. మంత్రిపద మిచ్చి నిలిపితి మరల నతని
దీనభావమునకు జాలి నూని; యెపుడు
మెత్తఁదనమేకదా బ్రాహ్మణోత్తములకుఁ
బరుల దుస్థితి తమకంటఁ బడినచోట? 11

వ. ఇట్లు నే నాశకటాలునకు వెండియు మంత్రిపదం బిచ్చి నిలు
పుటయు నంత నతండును. 12

శా. విజ్ఞానంబు వివేకసంపదయుఁ బ్రావీణ్యంబునుం గల్గి తాఁ
బ్రాజ్ఞుండై విలసిల్లుచుంట సహజ ప్రాగల్భ్య మేపార నా
యాజ్ఞావృత్తి మెలంగుచున్ సకలకార్యంబుల్ ఫలింపన్ నృపా
వజ్ఞాలేశము వెల్లడింపక గడున్ వైదగ్ధ్య మొప్పారఁగన్. 13

ఉ. పెత్తనమూని నేన నృపు పేర్మి సమీక్షయొనర్చుచుంటఁ దా
నత్తఱి నామహీశునకు హాని యొకండును జేయనేరమిన్
జిత్తమునం దెఱింగి తఱిసి క్కెడు నంతకు నెట్లొ వైతసిన్
వృత్తి వహించి యుండె; సువివేకిగదా శకటాలుఁ డారయన్! 15

వ. ఇవ్విధంబున శకటాలుండు నిజవైరప్రతీకారంబు నేమఱం బోవక వేచియుండియు నిగూఢాంతరంగంబున మదీయాజ్ఞానుకూలంబుగా రాజకార్యంబులం బ్రవర్తించుచుండుటయు నయ్యనంతరంబున:—

—♦ వరరుచి గూఢవిజ్ఞాన కౌశల్యము. ♦—

సీ. యోగనంద మహీశుఁ డొకనాఁడు నగరంబు
బయట గంగానదీప్రాంతమందుఁ
జనుచుండ నంత, నాజాహ్నవీ సలిలాంత
రమ్మున మివులఁ జిత్రమ్ము గాఁగ
మనుజహస్త మొకండు తనవేళ్లు నైదింటిఁ
గలియఁగూరిచి పైకిఁ గాన వచ్చె
వచ్చిన, నది సూచి వసుధేశుఁ డెంతయు
నబ్బురపడుచుఁ దానాక్షణంబ

గీ. నాకు దానిని జూపి "యెన్నండు నిట్టి
వింత గనుఁగొన; మిది యేమి యంతిరి! వచి
యింపు" మనవుడు నింతలో నెట్లు దీని
దెలుపఁగలవాఁడ నని తొల్తఁ దలఁచి పిదప. 16

క. నా కిది తెలియ దనిన నీ
భూకాంతుఁడు నవ్వి చిన్నబుచ్చుఁగదే! కా
నీ, కొంతొక్క విధానముఁ
గైకొని యుత్తరము నిడుదుఁగా కని యంతన్. 17

గీ. శారదానుగ్రహమునఁ దత్క్షణము యొక్క
యూహ వొడమ మదంగుళీయుగ్మకంబు
నట్టె నేనును గదియంగఁ బట్టి యప్పు
డక్కరమువంకఁ జూపితి; నంత నదియు. 18

ఆ.వె. అనిమిషాపగాజలాంతరంబున మున్గి
తిరిగి కానరాక దృశ్య మయ్యె;
మనుజ విభున కంత మఱియు విస్మయ మయ్యె
నప్పు డతని కిట్టు లంటి నేను. 19

గీ. వినుము రాజేంద్ర! యాచేయి తనదువ్రేళ్ల
నేనిటిఁ గూర్చి "లోకమం దేవు రిట్లు
కలసియున్నచో సాధింపవలనుగాని
కజ్జ మేమున్న" దని సూచకముగ నడిగె. 20

వ. నేనును దాని భావవిశేషంబు గ్రహింపంజాలి. 21

గీ. ఏకమతిఁ గూడి యున్నచో నేవు రేల?
యిర్వురే చాలుఁ జుమి యనియెడు తలంపు
దోఁప నాయంగుళీద్వయిం జూపినాఁడ
నదియె తన కుత్తరం బౌట నరిగె నదియు. 22

వ. ఇంతకంటె విశేషం బొం డెద్దియు లేదు:— 23

క. అని యేను విన్నవింపఁగ
విని తేఁడు మదీయగూఢవిజ్ఞానంబున్
గని కడు వినుతింపఁ దొడం
గెను; శకటాలుండు నంతఁ గృతవిక్లబతన్. 24

ఆ.వె. నన్ను గెలిచి యోగనందుని పగఁదీర్చు
కొనుట తన కశక్య మని యెఱింగి
చింత పడియె; నేమి సెప్పుదు నోకాణ
భూతి! నాఁటి రాజనీతి రీతి? 25

—◆ శుష్క మత్స్య హాసము ◆—

వ. ఇది యిట్లైన యనంతరంబున మఱికొంతకాలంబునకు వేఱొ
క్క విశేషంబు సంభవించె; నది యెట్టి దనిన? నయ్యోగనం
దుం డొకానొక దివసంబున నిజసౌధభాగంబునందు కొండొ
క చో సుఖోపవిష్టుండై యుండి పురవీథి వంకం బరికించు
చున్న సమయంబున. 26

క. తన పట్ట మహిషి వాతా
యనాగ్రమున నుండి, బ్రాహ్మణాతిథి నొకనిన్
దన వంక నున్నమిత లో
చనుఁడై కనువానిఁ జూచుజాడన్ గాంచెన్. 27

క. కని తావన్మాత్రమునన
యనుమానము సెంది డెంద మం దపుడు మహా

ఘనతరకోపజ్వాలలు
గనకనలాడంగ మిపులఁ గలుషితమతియై. 28

శా. ఏదోషంబును లేని విప్రకులు నిన్నే! యర్థియై యున్న ని
ర్వేదన్ వానినిఁ బట్టుకోఁ బనిచి యీ వెన్వెంటనే చంపఁగా
నాదేశించె; నితండు దోషియగుఁ గాదంచున్ విచారింపఁ! డీ
ర్ష్యాదుల్ నిత్యవివేకశత్రువులుగావా యెమ్మెయిం గాంచు దోన్

ఆ.వె. అంత నాద్విజన్ము నాతేని యానతి
వధకు లపుడ పట్టి వధ్యభూమి
పొంత కీడ్చికొనుచుఁ బోయెడు తఱిఁ బుర
వీథి లోన నొక్క విపణియందు. 30

గీ. అమ్మకము సేయఁగా నుంచినట్టి శుష్క-
మత్స్య మొకఁ డాతలారులన్ మహీసురవరుఁ
గాంచి, నిర్జీవ మయ్యు నక్కజముపడుచు
నల్వురుం జూడ వికవిక నవ్వఁ దొడఁగె. 31

వ. అప్పు డచ్చటనున్న పౌరజనంబు లెల్లరు నభూతపూర్వం
బైన యయ్యద్భుతంబుఁ గనుంగొని యనేకవిధంబుల నాశ్చ
ర్యంబు నొందఁదొడంగి; రంత నాతలవరులు నవ్వింతం బరి
కించి మరలి చని యమ్మహీకాంతున కెఱింగించుటయు:—

ఆ.వె. తత్క్షణంబ భూమిధవుఁడు నయ్యది విని
యిట్టి వింత యిప్పు డెట్లు పుట్టె

ననుచు సంశయాత్ముఁడై నాఁటి కాపవ్రి
వధము మాసిపించి వైచి పిదప. 33

క. ననుఁ దోడ్తోడన పిలువం
బనిచి "మహామాత్య! విపణిభాగస్థిత శు
ష్క నిరసు మత్స్య ము దేటికి
విన వింతగ నవ్వెఁ? నాకు వివరింపఁగదే." 34

క. అని యడిగిన నే నపు డా
తనితో నిట్లంటి "నోయి ధరణీశ్వర! యీ
వినిగూఢ కారణము నే
మనమునఁ బరికించి పిదప మనవి యొనర్తున్. 35

ఆ. వె. ఇట్టి వింత కేదియే నొక్క ప్రబలమౌ
కారణాంతరంబు గలుగవలయు
దాని నెఱుఁగఁ గొంత తడ వీయఁదగు నంచుఁ
బలికి యతని యాజ్ఞఁ బడసి వచ్చి. 36

ఉ. అస్థిరచిత్తుఁడై నృపతి యాడిన ప్రశ్నకు మాఱుసెప్ప నీ
దుస్థితి వచ్చెనే యనుచు దుఃఖము నొందుచు నింటి కేఁగి సు
స్వస్థ మనస్కుఁతన్ జలజసంభవపత్ని స్మరింపఁ జింతితో
పస్థిత యౌచు నాయము కృపామతి నిట్లనె సుప్రసన్నయై. 37

గీ. దీనికై వత్స! యింత చింతింపనేల?
నేఁటి నడిరేయిఁ జూడుము మా తాటిమ్రాని

వెనుక నొదిఁగి యున్నాఁడ నీకు వినఁగ వచ్చు
శుష్కమత్స్యంబు నవ్విన చొప్పదెల్ల. 38

గీ. సంశయము లేదటంచు నాశారద యిటు
లానతిచ్చిన విని మున మంది నాఁటి
యర్ధరాత్రంబునందు నే నట్టు లరిగి
వేచియున్నాఁడ నాతాళవిటపి చెంత. 39

వ. అంత నామహాభయంకర నిశీధ సమయంబున. 40

చ. వికట కరాళ దంష్ట్రిలును, విస్ఫురదగ్నికణారుణాక్షి యు
గ్మకముఁ, బ్రచండభీకరముఖంబుఁ, బ్రగాఢతమస్సమాసితాం
గకములుఁ గల్గి కొండొక వికారపు రక్కసి పిన్నపిన్న పుత్ర
కులను గొంచు నచ్చటికిఁ దాఁ జనుదెంచె భయంకరంబుగాన్.

వ. ఇట్లు చనుదెంచుటయు నంత నచ్చట నవ్వల లాసినీ తనూజు
లెల్లరుం దమతల్లిచుట్టునుం బరివేష్టించి "యమ్మా! యాఁకలి
యగుచున్నది మాం కెద్దియేని యాహారంబు వెట్టుమని కోరిన
నప్పు డది వారితో నిట్లనియె. 42

ఆ.వె. పుత్రులార ! యొక్కపొద్దట్లో యీనాఁటి
కోర్చి యుండుఁ డెల్లి యుదయముననె
యడిగినంత బ్రాహ్మణామిషంబున మీకుఁ
దృప్తి సేయుదానఁ దేఁచునట్లు. 43

క. నేఁడే యీవిప్రుని దును
మాడఁగ వలసినది; కాని, యంగడి చేదో

బేడిన యెండుది నగె నని
వీడి రతని నేఁటి కవనివిభు నానతిచేన్. 44

ఆ.వె. ఎల్లి తప్పు దింక నెల్లన నోబిడ్డ
లార ! వానిఁ జంపు టది నిజంబ
యంతిదనుక నిల్లు యూఁకట నకనక
పడఁగవలయు నీకు ప్రాసముండి. 45

చ. అనవుడు రాక్షసీశనయు లాఁకటఁ దూలుచుఁ దల్లిఁజూచి బా
పనిదునుమాడఁ దోడుకొనివచ్చెదునప్పు డటేల యెండుచేఁ
ప నగఁ దోడంగెఁ జెప్పుమది బాగుగ మాకిపుడూనుపోక యా
ననుటయు నన్నిశాచరి నిజాత్మజులన్ గని పల్కె నీగతిన్.

ఆ.వె. అన్నలార ! మీకు నాఁకలి గనరాక
యుబుసుపోక గాఁగ నుగ్గడింతు
నెండుఁ జేప నగిన హేతువు; నద్దాని
వినుఁడు మీరలెల్ల వేడ్క మీఱ. 47

వ. ఆచేఁప నవ్వున కొక్కయర్థంబు గల దది యెట్లనిన ? 48

ఉ. రా జెటుఁగండు గాక తనరాణులలోన నొకర్తె యేని య
వ్యాజ విశుద్ధబుద్ధిగలదా? యిపు డంతిపురంబులోనఁ గాం
తాజన రూపధారు లయి తప్పఁ జరించెడు పూరుషాళి నీ
యోజ వధింపఁగాఁ గలిగెనో! యిటు లీద్విజుఁ జంప నేటికో.

క. తనదేవి వంకఁ గనుఁగొన
ననుచు నిరపరాధి యగు ధరామరు నితనిన్

దునుమఁ బంచెదు నహాహా !
జననాయకుఁ డెంత సద్విచారణపరుఁడో ! 50

ఆ.వె. చెడిన రాణు లుండ, చెఱచెడు విటు లుండ
వీథినుండి కనిన వెట్టివాని
కితని కిప్పు డిట్లు మృతి తటస్థం బయ్యె
విధి విధాన విధము వింత ! యహహా ! 51

క. అని యియ్యర్థముఁగో నా
తనిఁ గని యయ్యెందుఁ జేఁప దానవ్వెఁ; జ
చ్చిన జంతువే నకార్యముఁ
గనఁ బరిహాసంబు సేయఁగాఁ దొడఁగుఁగదా ? 52

క. అని యారక్కసి సుతులకు
వినిచిన వృత్తాంత మెల్ల విని యేనుం జ
య్యన మరలి వచ్చి మఱునటి
దినమున నుదయమున నరిగితిన్ నృపు కడకున్. 53

గీ. అరిగి యతనికిఁ దన్మత్స్యహాస హేతు
వెఱుక పఱచుటయును నాతఁ డేఁగి యంతి
పురములోని కాంతావేష పూరుషాళి
కపటవర్తనముల నెల్లఁ గాంచి తెలిసి. 54

వ. వారల కందఱకు నుచితదండనంబులు విధించి వెడలంబంచి
యయ్యనంతరంబున:— 55

క. నను( బెద్ద మెచ్చి, బహుధా
ననముం గావించి, బ్రాహ్మణవధ ముడిపి, యా
తనిని యథేష్టంబుగఁ జనఁ
గ ననుజ్ఞ యొసఁగె నుచితకార్యజ్ఞుండై. 56

—♦ యోగనందుఁడు వరరుచిని వధింప నియోగించుట. ♦—

క. ఈపగిది విశృంఖల మగు
భూపాలవిచేష్టితములఁ బొడగని నే సం
తాపించుచుండ నొకనాఁ
డాపురి కొక చిత్రకారుఁ డరుదెంచి యొగిన్. 57

ఉ. భూవిభుదర్శనంబునకుఁ బోయినవేళ నొసంగుపొంటెఁ ద
ద్దేవిని నామెచెంత నృపతిన్ బటమందు లిఖించె; మిత్రమా!
యావెరవేమి సెప్పనగు? నాతని లేఖిని వారి కొక్క చే
ష్టావచనంబుల న్నిలుపఁజాలకపోయె నటన్నఁ జాలదే?

గీ. అట్టు లాచిత్రమును గళ లుట్టిపడఁగ
వ్రాసి యది రాజునకుఁ గాన్కవట్టుటయును
దానిఁ గనుఁగొని నృపతియుఁ దద్ద మెచ్చి
యతనికి విశేషముగ బహూకృతులు సలిపి. 59

క. అది చేకొని వేడుక మెయిఁ
బదిలముగఁ దదీయవాసభవనంబున కిం
పొదవఁగ నభ్యంతరమునఁ
గుదురుగఁ గట్టించె నొక్క కుడ్యంబునకున్. 60

సీ. అవల నే నొక్కనాఁ డభ్యంతరగృహంబు
నకు నేఁగినపుడు గోడకుఁ దగిల్చి
యున్న యప్పటమునం దొప్పు నట్టపుదేవి
సంపూర్ణభవ్యలక్షణము లరసి
లక్షణాంతరసముల్లాస సంబంధంబు
వలనఁ దన్మేఖలావలయ సీమఁ
దిలక మొక్కటి యొప్పవలసి యుండుటఁ గళా
ప్రతిభావిశేషసంపద నెఱింగి

గీ. చక్కఁగాఁ దత్కటీప్రదేశమున నొక్క
తిలకము ఘటించి యా లొచ్చు దిద్ది తీర్చి
పూర్ణ లక్షణ సంపత్తిఁ బొందుపడఁగఁ
జేసి వచ్చితి నుఱియుఁ దచ్చిత్రి మలర. 61

వ. అయ్యనంతరంబున:— 62

గీ. అచట నాభూపతియు గృహాభ్యంతరమున
కరిగినపు డందుఁగల మూర్తి నరసి చూచి
యంతిపురము సంరక్షించునట్టివారి
నడిగె దీని నెవ్వరు వ్రాసి రనుచు నపుడు. 63

వ. అంతఃపురపాలకు లది మదీయకృత్యంబుగా విన్నవించుటయు
నతం డది విని సంశయాయత్తచిత్తవృత్తుండై తనమనంబున
నిట్లని తలంచె. 64

చ. అరు దిది! రాజ్ఞి మేన సురహస్యతలంబున నున్న చిహ్నమే
నెఱుఁగుదుఁగాక వేఱొకని కెట్లు తెలుఁగఁగవచ్చు? దీని న
వ్వరరుచి యెట్లు సూచె? నను వంచనచేసి నగళ్లలోపలన్
దిరుగుచునుండఁబోలు గడిదేఱి రహఃకృతిదుష్ప్రచారుఁడై.

క. అంతిపురము ద్రోహం బతఁ
డంతట నింతట నొనర్చు టది నిక్కము, యే
కాంతమునఁ; గావుననె మును
కాంతావేషుల నెఱింగి కనుఁగొనఁ గలిగెన్. 66

ఆ.వె. అనుచు నిశ్చయించి యతికోప శిఖి శిఖా
జ్వలిత హృదయుఁ డయ్యె జనవిభుండు
మూర్ఖజనుల భ్రాంతి ముంప నిట్టి నిదర్శ
నములు దొరకఁ గాదె నెమకి చూడ. 67

వ. ఇట్లుయోగానందుండు విశేష రోషదూషితాంతరంగుండై తత్క్షణంబ ద్వితీయసచివుండైన శకటాలుం బిలిపించి యత నితో నిట్లనియె. 68

క. కంటివె వివేకధూర్వహా!
తుంటరి వరరుచి యొనర్చు దురితమ్ములు? నా
బంటయి బ్రదుకుచుఁ దుద కెటు
వంటి పనుల్ సేయుచున్నవాఁడో కంటే? 69

క. దేవీ విధ్వంసనముం
గావించెడు పరమదుష్టకర్ముం డయ్యెం

గావున నాద్రోహిని నీ
వేవెరవున నైన నేఁడ హింసింపఁ దగున్. 70

క. ఈహింస సేయుటకు సం
దేహింపఁగ వలవ దింత తీవ్ర మవి ప్రభు
ద్రోహి యగు నిట్టి యీ దు
స్సాహసికునిఁ జంప ఁగరక చనునే విడువన్? 71

చ. అనుచు మహోగ్రకోపమున నాధరణీపతి యాజ్ఞ నెట్టఁగా
విని శకటాలుఁ డెంతయును విస్మయ మందియుఁ దత్ప్రమత్త భూ
పునకు మఱేమియుం బలుకఁబోవఁగనొల్లక "తేనియానచొ
ప్పునని మెలంగువాఁడ"నని పోయి మదిం దలపోసె నీగతిన్.

చ. వరరుచియన్న దివ్యమతి వైభవుఁ! డాతని సంహరింప నీ
నరపతి దుర్వివేకుఁడయి నా కిటు లానతియిచ్చె; నిప్పు డీ
ప్పురమవరేణ్యు నిష్కలుషబుద్ధి మహాప్రతిభావిభాసి న
ప్పురుషునవధ్యుఁజేయఁగలవాఁడ,నసాధ్యుఁడతండునూడఁగన్

ఉ. నీతివిచారదూరుఁ డవనీపతి యానతి యిచ్చెఁగాక నే
నాతని సంహరింపఁదగునా? నను నిట్టులె యుద్ధతాత్ముఁడై
నూతఁబడంగఁ ద్రోసె మును నూర్వురుపుత్రులఁగోలుపోవ;న
చ్చోఁతలు మర్వఁగానగునెచిత్తము నేర్చుచునుండ నెప్పుడున్.

వ. ఇదియునుం గాక, 75

గీ. ఆమహాత్ముండు వరరుచి యప్పు డట్టి
యంధకూపమ్మునుండి దయార్ద్రబుద్ధి

నుద్ధరించి నాకీ పద మొసఁగియుండ
నాద్విజవరేణ్యుఁ డనుమ నెట్లనుమతింతు ? 76

ఉ. ఘోరవిపత్తిలో మునిఁగి కుందెడు నన్ను వివిర్మలాత్ముఁడో
దారత నుద్ధరించి యుచితస్థితి నిల్పినవాని నిప్పుడే
తీరున మంత్రసంబున వధాపఁ గడంగెదు వాఁడ నేను ని
ష్కారణమున్ బ్రమత్తనృపశాసనమూనదలఁ దాల్చి యక్కటా!

వ. కావున నే నిప్పు డేదియేని యొక్క గుప్తమార్గంబున నీతని
రక్షించుటయ పరమధర్మం బని తలపోసి యాశకటాలుండు నా
యొద్ద కరుదెంచి రాజకోపకారణంబు వధశిక్షాంతంగా నా
కెఱింగించి యతిరహస్యంబుగా నాతో నిట్లనియె 78

క. అవివేకియు మత్తుఁడు నగు
నవనీనాయకుని యాజ్ఞ యది యట్లైనన్
బ్రవిమలచరితా! నీ కది
యవమానముగాదు సందియం బేమిటికిన్ ? 79

క. పరు లెఱుఁగకుండ నా మం
దిరమున నుండు మిఁక నీవు ధీరవరేణ్యా !
మఱి యెవ్వనినో వేఱొ
క్కరు నిపుడు ప్రమాదమునకుఁగాఁ జంపింతున్. 80

వ. పదంపడి దైవానుకూల్యంబునఁ గొంతకాలంబున కన్నియుం
జక్కపడవచ్చుంగాదె యని యిట్లు శకటాలుండు పెక్కు
తెఱంగుల వక్కాణించుటయు:— 81

సీ. అంత వేఱొక యుపాయము లేమిఁ బ్రచ్ఛన్న
వృత్తి నే నాతని యింట నుంటి;
నానాఁటి నడిరేయి యందు దతుండును, నొక్క-
మనుజు ననాథునిఁ దునుమఁ బంచి
వరరుచి మఱిసె నన్ వార్తఁ బట్టనమున
వెలయించి, చెప్పె భూవిభునితోడ;
నేను నాశకటాలు నీతి ప్రయోగ కౌ
శలమున కెంతయు సంతసించి
గీ. యతని కిట్లంటి; "నో మహామతివరేణ్య!
దక్షుఁడవు నీవు; నీతి విచక్షణుఁడవు
సచివు లెవ్వారలును నీకు సాటిరారు
మహిని నీ వొక్క-ఁడవకా వె మంత్రివనఁగ. 82

వ. అది యెట్లన? 83

మ. జననాథుం డపనీతుఁడై పనిచినన్ స్వచ్ఛందసంచారివై
నను హింసింపఁ దలంపవైతి; విది విన్నాణంబు; నీ వల్లు నన్
దునుమం జూచిన నీకు నే నిటు నవధ్యుండం జుమీ యెత్తెఱం
గున నేనిన్; నను సంహరించుటకు నీకున్ శక్తి లే దియ్యెడన్.

వ. అందులకుఁ గతం బే మనిన? 85

గీ. కలఁడు విను మొక్క- బాహువిక్రమఘనుండు
రాక్షసవరుండు ప్రాణమిత్త్రంబు నాకుఁ

గోరునెడ వచ్చి యరుల మార్కొనుట కాక
విశ్వవిధ్వంసమేనిఁ గావించు వాఁడు. 86

వ. అట్టి మిత్త్రిసాహాయ్యంబు గల్గెనేని యీయోగనందు నేల
సాధింపరా దంచు వేని:— 87

గీ. ఇతఁడు మును నాసఖుం డైన యింద్రదత్తుఁ;
డాగమజ్ఞాననిధి; భూసురాగ్రిసరుఁడు;
గాన, నిపు డేమియుఁ జేయఁ గాకపోయెఁ;
గాని వేఱొక్కరుం డైనఁ గలదె బ్రదుకు. 88

క. అనినన్ విని శకటాలుఁడు
మనమున నచ్చెరువు వేడ్క మల్లడిగొనఁ ద
ద్ఘను దైత్యుని దన కొకపరి
గనిపింపం గోరె వినయకౌతుకములతోన్. 89

గీ. అంత నే నానిశాచరు నాత్మఁ దలఁచి
యెదుటఁ బ్రిత్యక్ష మొనరింప నేమి సెప్ప
విస్మయ త్రాస సంభ్రమ వివశుఁ డగుచుఁ
గాంచెఁ దమాొప మతఁడా వెక్కసముగాఁగ. 90

వ. పదంపడి యారాక్షసుండు మదీయానుమతంబున నంతర్హితుం
డగుటయు నంత నాశకటాలుండు నాతో నిట్లనియె. 91

—♦ వరరుచికి రాక్షసుఁడు మిత్త్రుండైన వృత్తాంతము. ♦—

క. ఎక్కడివాఁ డనఘా! యీ
రక్కసుఁ డత్యంత వికృతరౌద్రాకారుం

డెక్కరణి నీకు వీనికిఁ
జిక్కని యిటువంటిమైత్రి సిద్ధించె నిటుల్ ? 92

వ. అది నా కెఱింగింపఁ దగినది యగునేని చెప్పు మని యడుగు
టయు:— 93

సీ. అప్పుడే నతని కిట్లంటి; నోమంత్రీశ !
నీపదంబున నేను నిలిచియున్న
తఱి నిప్పురమున నిత్యము రాత్రులయందు
నగర రక్షణము సేయఁగ నరిగెడు
పురపాలకులు క్రమంబుగ నొక్కఁ డొక్కఁడే
కడతేరఁ దొడఁగి రక్కజము మీఱ;
నయ్యెడ యోగనందావనీశుఁ డిదేమి
యనుచు నెంతయు విస్మయంబు నొంది

గీ. నన్ను నియమించెఁ గొండొకనాఁటిరేయి
నగరరక్షకు; నేను నానడికి రేయిఁ
బురమునం దెల్లచోటులఁ దిరుగుచుండి
కంటి నొకచోట నీభయంకర నిశాటు. 94

వ. అంత నీరాక్షసుండును నన్నుఁ గనుంగొని చేర వచ్చి భయం
కరంబుగా నిట్లనియె. 95

గీ. ఈపురంబున సుందరి యాపడంతి
యెవ్వతయొ తెల్పవలయు నా కిపుడు నీవు

యుక్తముగ నట్లు తెలుపకయున్న నిన్నుఁ
జంపి పంపెదఁ బూర్వరక్షకుల కడకు. 96

చ. అనవుడు వీని యానుడుల కాత్మ నొకింతయు నేఁ దలంకఁబో
క నిభృతధీరభావమున గట్టిగ నవ్వుచు నోయి! భేల! యె
వ్వని కది యిష్టయాంనదియె వానికి సుందరి! యిప్పరీవరం
బనవె యనంగి నేంకవిను;మూఁడుజగంబులనిట్లయాంఁజుమీ.

క. ఇంతకు భిన్నంబుగ నా
వంతియు లే; దరుగు; మని యనాదరభావం
బును వెల్లడిసేయుచుఁ బ
లికిన విని యిద్ధానవుండు కృతవిస్మయుఁడై. 98

వ. తన యౌద్ధత్యంబు నంతను విడనాడి సవినయంబుగా నాతో
నిట్లనియె. 99

ఉ. ఓడితి నెంతకాలమునకో యిటు నీకు; మహానుభావ! యె
వ్వాఁడవొ నీవు; నీవచనవైఖరి నిక్కము; మోదమయ్యె;ని
ప్పోడిమి నాకు మార్వలుకఁబోవఁగఁజాలక యోడి యెందఱో
వీడిరి ప్రాణముల్ సుమతివిశ్రుత! నీవొకరుండుతక్కఁగన్.

క. నీకికఁ జొక్క యెగ్గును
జేకూరదు; మఱియు నాకుఁ జెలికాఁడవునై
యేకొదవయు లేకుండ ని
రాకుల మతి నంచరింపు మయ్యయి పట్లన్. 101

గీ. అనుఁగుఁ జెలికాఁడ ! వినుము నెయ్యమునఁ జేసి
యెపుడు నను నీవు దలఁచిన నపుడ వచ్చి
యెట్టి ప్రార్థనాగోష్ఠంబుల నేనిఁ దీర్చ
ననుచుఁ బలికి యంతర్హితుం డయ్యె వేగ. 102

క. అతఁడే యీరాక్షసుఁ డీ
వితమున నాపత్సహాయవేళల మిత్త్రా
ర్థితుఁడై యేతెంచి మదీ
ప్సిత సంసిద్ధులు ప్రసంగఁ జేయుచు నుండున్. 103

వ. అని యిట్లు నేనారాక్షసుని వృత్తాంతంబు సెప్పిన విని శక
టాలుం డెంతయు నబ్బురం బొందుచు నొండియు నన్నుద్దే
శించి "యార్యా ! నీకు గంగాదేవియు సుప్రసన్నభావం
బునఁ దలంచిన యంతన సాక్షాత్కారంబు సేయు నని వింటిఁ;
గావున నామెడఁ నను గ్రహించి యొక్క మారు అప్పుణ్యా
భాగీరథీస్వరూపదర్శనంబు సంతతము నాకుఁ గలుగఁ జేయు
మని ప్రార్థించుటయు:— 104

గీ. అంత నేనును దన్మహాభ్యర్థనమున
గొండొక తెఱఁగునన్ బల్క నొల్లఁ బోక
మానసములోన గంగాభవాని భక్తి
తత్పరత ధ్యానవిధమునఁ దలఁచుటయును. 105

క. ఆదేవియుఁ దోడనె నా
పై దయ నిజదివ్యమూర్తిఁ బ్రత్యక్షముగాఁ

ప్రాదుర్భవించె; నాఁడో
నాఁదట నాతఁడును గాంచి యానందింపన్. 106

వ. ఆసమయంబున నేనును:— 107

చ. స్తుతు లొనరించి యామెఁ బరితోషితఁ జేసితి;నంతలోఁదిగో
హిత యయి జహ్నుకన్యక యునేఁగెఁ;బదంపడిమత్ప్రభావద
క్షిత లటుగాంచియెంతయుఁ బ్రశంసలుసల్పుచు నప్పుడామహా
మతిశకటాలుఁడాదృతియు,మన్నన,భక్తియుమీఱనమ్రుఁడై

క. ఏకోదవ యొదవ కుఁడుఁగ
నా కటఁ దన మందిరంబునన్ బహు మర్యా
దాకలనము సేయుచుఁ దో
డై కలసి మెలఁగుచుండె; నట్లుండంగాన్. 109

మ. ఒకనాఁ డేనొకచో రహస్స్థితుఁడనై యుద్విగ్నతంజెంది, మా
మకదీనస్థితినాత్మ నెంచుచు "మహామాత్యుండనై యుండి యా
గక తేఁ డాక్రియ శిక్షసేయ నుసుఱుల్ రక్షించుకో నన్యసిం
టికిఁజేరన్ వలసెంగదే" యనుచు నొంటింజింతతో నుంటయున్

వ. అంత:— 111

క. శకటాలుఁడు నాచిత్తం
బు కలంత యెఱింగి, నాదు పొంతకుఁ జనుదెం
చి "కటా! సర్వజ్ఞుఁడ వీ
వె కలంగన్ బోలునే వివేకనిధానా! 112

మ. క్షితినాథుల్ పరమార్థ సత్యముల సంశీలింపఁజో; రవ్యవ
స్థితచిత్తుల్ గదవారు? తద్వ్యవహృతుల్ శిక్షానమానంబులున్
మతిఁ జింతించి ప్రమోదశోదములు పొందన్ వచ్చునే? యోముహా
మతి మద్వర్య! భవద్విధార్యజనులీమాత్రంబు యోజింపరే?

ఆ. వె. కాలవశమువలనఁ గలిగినదోషంబుఁ
దలఁగు; నీశువిద్ధతయును దెలియు;
మరల రాజు నిన్ను మన్నించు; నీ వేల
చింతపడెదు శుద్ధశీల ! యిట్లు ? 113

వ. నీయెఱుంగని వృత్తాంతోదాహరణమ్ములు లేవు; కాని, యిప్పుడ యిందులకు దృష్టాంతంబైన యొక్క పూర్వకథ సెప్పెద నాలకింపుము. 114

—◆ శివశర్మ యను మంత్రికథ. ◆—

క. ఆదిత్యవర్మ యనియెడు
భూదయితుం డొకఁడు తొల్లి భుజవిక్రమసం
పాదిత యశుఁ డిచ్చట నీ
మేదిని పాలించువాఁడు మించిన కడిమిన్. 115

క. అతని సవిధమున నిరుపమ
మతి యగు శివశర్మ యనెడు మంత్రివరుం డం
చిత రాజభక్తియుతుఁ డూ
ర్జితవర్తనుఁ డగుచుఁ గొల్వు సేయుచునుండున్. 116

వ. ఇట్లుండ నంత నొకానొక సమయంబున నమ్మహీపాలుని
రాణివాసంబునం గల రాణులయం దొక్కతె గర్భవతి
యగుటయు నప్పు డా రేఁడు తద్వృత్తాంతంబుఁ దెలిసికొని
యెంతయు విస్మయాక్రాంతుండై. 117

క. బిఱబిఱ నంతఃపురమున
కరిగి యచట రక్షార్థమై నిలిపిన త
త్పరిచారికా సమూహముఁ
దరిఁ జేరఁగఁ బిలిచి కోపదర్శనుఁడగుచున్. 118

వ. వారితో నిట్లనియె. 119

గీ. ఏ మిటకు నన్యు లూడిగి రెండేండ్లు గడచె
గర్భ మెట్లయ్యె మీయమ్మగారి కిపుడు
దాఁపఁ బోవక దీని సత్యమది విన్న
వించుచో మిమ్ము నేను మన్నించి విడుతు. 120

క. అటుగాక, మాయమాటల
నిటు నటు ముడిపెట్టఁ జూతురేని మదీయో
ద్భట ఖడ్గధార మిము ని
ష్పట నిలువునఁ జీల్చి యుప్పుఁ బాఁతఁ బెట్టిడుదున్. 121

క. అనవుడు నప్పరిచారిక
లనుపమ భయ విహ్వలాత్మలై యాతని కి
ట్లనిరి; యోదేవా ! మే మే
మని నొడువఁగ నేర్చువార మజ్ఞలము గదా ! 122

ఉ. రేవగ లిట్లు నిత్యము చరించెద మిర్వ్యేడ జాగరూకతన్
గావలి గాచువేళ మనుఁ గా దని యొండొక పోటుటీ
బోవను లోని; [illegible] క [illegible]టు పోఁ[illegible] [illegible]
దేవర! యే[illegible] [illegible] దే[illegible] [illegible]

క. ఇంతకు మిక్[illegible] [illegible] [illegible]
క్కింతయు [illegible] [illegible]. మిది [illegible]
కాంతా! [illegible] [illegible]
జింతింపుము చి[illegible] ము[illegible] [illegible]తము[illegible] [illegible].

చ. అనుటయు రాజు [illegible] ''[illegible]! శివశ[illegible] [illegible]
జనులకు వేఱయి [illegible]నికి శక్య[illegible]'' యంచు మహా[illegible]
ననుపమ బుద్ధి వైభవ సమన్వితుఁ డైన యమాత్యవర్య
తనిఁ గడతేర్పఁగాఁ దలఁచె దథ్యము గాసరుగా నరేశ్వరు[illegible]

వ. ఇవ్విధంబున నయ్యాదిత్యవర్మ భూపాలుండు తనమంత్రియగు
శివశర్మం గడతేర్ప నిశ్చయించియుఁ బదంపడి లోకమువంకం
గనుంగొని కొంకుచు:— 126

గీ. బాహిరంబున మంత్రిఁ జంపం గడఁగిన
వచ్చు నెంతయు లోకాపవాద మిపుడు
గాన నేదేని యొకయుక్తి నూని యేక
తముగ నడపుట మిగుల యుక్తమని యెంచి. 127

క. తన ప్రియసఖుఁడును సామం
త నృపుఁడు నగు భోగవర్మ దరి కమ్మంత్రిన్

బనిచె; నొక రాజకార్యము
పనిగాఁ గల్పించి కపటభావుం డగుచున్. 128

క. పనిచి పదంపడి తత్సచి
వునిఁ గడతేర్పింప నానృపుని చెంతకు లే
ఖను వ్రాసి తాను నమ్మిన
మనుజునిచే నంపె గూఢమార్గమున వెసన్. 129

వ. అంత:— 130

ఆ. వె. అయ్యమాత్యుఁ డట్టు లరిగిన యెడవ
నాఁటిరేయి రాచనగరు విడిచి
యుఁడుమూపుగొన్న కోడకానిఁ గూడి
పాఱిపోవు రాణి పట్టువడియె. 131

వ. ఆయ్యవసరంబున:— 132

క. జనవిభుఁడు రాజ్ఞి నడవడి
విని యకటా! యూర కట్టి విమలాశయు మం
త్రిని గడతేర్పించితి నని
యనుతాపముతోడ మిగుల సలముట నొందెన్. 133

వ. ఇది యిచ్చట నిట్లుండ:— 134

గీ. అచట, శివశర్మ భోగవర్మాంతికమున
కరుగుటయు, లేఖయుం జేరె నతని వెంట
భోగవర్మయు దాని విప్పుకొని చదివి
దైవవశమున ధర్మచింతనము గలుగ. 135

వ. అందున్న విషయం బంతియు రహస్యంబుగా శివశర్మకుఁ
 దెలియఁ జేయుటయు:— 137

మ. అపు డామంత్రివరేణ్యుఁ డిట్లనియె; నయ్యా! భోగవర్మా! మహా
 ధిపు నాజ్ఞాపరిపాలనార్థ మయి సందేహింపఁగా నేల న
 న్నుపసంహారము సేయు మిత్తఱిని; నీయుల్లంబునం దేమియున్
 గపటత్వంబు వహింపరాదు; ప్రభునాజ్ఞన్ దీర్పు చో నెప్పుడున్.

ఆ. వె. అట్లు నీవు నన్ను నపగతాసు నొనర్ప
 నంశయింతు వేని సత్వరముగ
 నాకు నేన యాత్మనాశంబుఁ గావించు
 కొందుఁ; దప్పదింక మఱింది టిచట. 138

చ. అనినఁ దదీయవాక్యముల కచ్చెరు వందుచు భోగవర్మ యా
 తనిఁ గని "యోయిబ్రాహ్మణవతంసము! యేమిది! యిట్లు పల్కెదీ
 ఘనతరనీతిఁ యేమిటికిఁ గంటి స్వనాశముఁ గోరుకొందురే
 పనివడి యెట్టివారయినఁ? బ్రాణము లింత నిరర్థకంబులే !

క. చా వనిన నెంతమాత్రము
 భావమునను గలఁతపడవు! పైగా నిను నేఁ
 బోవిడిన బ్రదుక నని; దీ
 నీవర మిట్టుల గలిగెఁ దెలుపఁ గదయ్యా ! 140

వ. నీ విచిత్రాభినివేశంబు నాకు వివరింపక తప్పు; దట్టు తప్పిన
 నొట్టుసుమీ" యని భోగవర్మ సవినయంబుగను సకౌతు

కలుగను సానునయంబుగను జనవుగొని ప్రార్థించిన శివశర్మ
యతని కిట్లనియె. 141

శా. తండ్రీ! విన్మిదిభోగవర్మ నరనాథా! యిప్డు నీవింతగాఁ
దీవ్రం బైన కడంకతో నడుగుటన్ దెల్పం దలంపయ్యె; నే
వాండ్రున్ దీని నెఱుంగ; రేనెచటఁ జావంగూరునో యచ్చటన్
బండ్రెండేఁడు లవృష్టిదోష మొదవున్ బర్జన్యరోషంబునన్.

క. ఏ నిట్టివాఁడ నని తా
నా నరపతి యొకఁడ యెఱుఁగు; నట్లెఱిఁగిన వా
రేనాఁడు నను వధింపం
బూనరు దేశమున కెగ్గుపొడము నటంచున్. 143

వ. అది యిట్లుండె; నిప్పుడు రాయేలికయైన యాదిత్యవర్మ భూపాలుండు తా నేకాంతంబుననో నన్ను వధింప సమకట్టియున్నవాఁడు; గావున నే నాతఁ డిట్టివాఁ డైనను దదభీష్టసంసిద్ధి పొంటె నస్థిరం బైన యీశరీరంబు పరిత్యజించి రాజఋణంబుఁ దీర్చుకొని స్వధర్మనిర్వహణంబుఁ గావించుకొనఁ దలంచి యున్నవాఁడ; నింతకంటె వేఱేమియు లేదని యిట్లు శివశర్మ నొడివిన విని భోగవర్మయుఁ దోడనె తన సచివాధికృత వర్గంబు రప్పించి వారితో నిట్లాలోచింపఁదొడంగె. 144

క. ఆదిత్యవర్మ నరపతి
గాదిలి చెలి యనియు, నమ్మఁగల విభుఁ డనియున్

భేద మెఱుంగక మనసీతి
మాందుష్యం బెంత తలఁచె నది గనుఁగొనితే ? 145

క. శివశర్మను మునిమినచోఁ
దవులు ననావృష్టి యనునుఁ దా నేకీఁగియుఁ, గై
తవమున మన దేశం బిపు
డనగ్రహముచే నశింప నాత్మఁ దలంచెన్. 146

వ. అతని కట్టి దురుద్దేశములు లేనియెడ శివశర్మ నిందేల పథింపఁ
బంచి యుండును ? 147

క. హంతలు లేనే తన కట
శాంతుం డగు నీద్విజన్మ సచివశ్రేష్ఠున్
మంతనమునఁ గడతేర్పఁగఁ?
జింతింపుదు తత్కుయుక్తిచేష్టల తెఱఁగుల్. 148

ఉ. మంతనమందుఁ గేవలము మాఱుచేసిం బడకుండునట్లు లే
మంతిరిఁ జంపఁగాఁ దగిన మానిసు లెయ్యెడ లేకకాదు; ము
శ్శింతి, నుపాంతదేశ మిది చేద్పడఁగాఁ దలపోసె నమ్మహీ
కాంతుఁడు; దీన సంశయము గల్గ దొకించుకయేని యూరయన్.

క. కావున సచివోత్తముఁడగు
నీవిప్రు వధింపఁగూడ దిట మన; మితఁడున్
జీవత్యాగం బీయెడఁ
గావింపక యుండఁజూడఁగాఁ దగు మనకున్. 150

క. అని మంత్రాలోచనముం
బొనరిచి శివశర్మ కేమ పొందకయుండన్
గనుఁగొనఁగ రక్షకుల నిడి
తనదేశము వెడలఁబంచెఁ దత్క్షణ మతఁడున్. 151

గీ. ఇట్లు తన ప్రజ్ఞ శివశర్మ యెడరుఁ బాసి
తొంటి తన తప్పు పూర్వమే తొలఁగఁ గానఁ
దిరిగి చనుదెంచెఁ దనవాసదేశమునకు
నిజమహీశుండు మరల మన్నించె నోలి. 152

వ. కావున నోమహామాత్యా! ధర్మం బేనాఁటికి నన్యథా కానేరదు:— 153

గీ. అట్లు నీవును శుద్ధుఁడ వగుదు; చింత
యుడిగి మద్గేహమున నిట్టు లుండు మనఘ!
యీనృపాలుండు తనతప్పు తా నెఱింగి
సానుతాపుఁ డగున్ సంశయంబు వలదు. 154

క. అని శకటాలుఁడు దేర్చఁగ
మనమునఁగల చింత యుడిగి మంతనమున నా
తని యింటనె తగుసమయం
బును వేచుచు నుంటిఁ గాణభూతీ! వింటే? 155

— వరరుచి హిరణ్యగుప్తుని శాపముఁ దొలఁగించుట. —

వ. ఇవ్విధంబున నేను శకటాలునిగృహంబునఁ బ్రచ్ఛన్నుండనై యుండి కాలయాపనంబు సేయుచుండుటయు నంత:— 156

ఉ. కొండొకనాఁడు తద్విభుని కూరిమి పుత్త్రకుఁడౌ హిరణ్యగు
ప్తుండు నిజానుచార సహితుం డయి వేడుక మీఱఁ గానలన్
మెండయియున్న సత్త్వముల మేకొని త్రుంపఁదలంచి, వేఁటకై
విండులు నమ్ములున్ వలలు వేఁపులు మున్నగుసాధనాళితోన్.

ఆ.వె. పురము వెడలి విపినభూమికిఁ జని యందు
వేఁటలాడువేళ బాటఁ దప్పి
తురగ వేగవశత దూరమార్గమ్మున
నొంటి యయ్యె నెంట నొకరు రాక. 158

వ. అంతఁ దదీయపరివారం బెల్ల నమ్మహారణ్యభాగంబున నతని
వెంబడించి ముట్టనేరక వెనుకఁ జిక్కె, యతనిజాడ యెఱుంగక
పరిభ్రమించుచుండె; నివ్విధంబున:— 159

క. నృపతనయుం డొంటరియై
విపినస్థలియందుఁ జిక్కి నెర నఱె యుండన్
దపనుఁడు నపరదిశాసతి
లపనమునకుఁ జెందిరపుఁ దిలకమై పొలిచెన్. 160

వ. అంత:— 161

గీ. పవలు గడచని రాతిరిపడుట నూచి
రాజపుత్త్రకుఁ డచట నారాత్రిఁ గడప
నొక్క నికట మహీజంబు నెక్కి యుండెఁ
గానన మృగంబుల భయంబు గలుగకుండ. 162

గీ. అంత నొక యెలుఁగొడ్డు సింహంబు దలఁకు
వెఱచి పఱతెంచి వచ్చి యావృక్ష మెక్కె-
దానిపై నున్న రాజపుత్రకు మనంబు
సాధ్వసాయత్తమై గడు సంభ్రమింప. 163

వ. ఇట్లు లాభల్లూకంబు తద్భూరుహంబు నధిరోహించి యచటఁ
దనవలన బెట్టు గుట్టుసెడి సంభ్రమించుచున్న యాపుడమి
ఱేనిపట్టిం గనుంగొని, కనికరించి మనుష్యభాషణంబుల నత
నితో నిట్లనియె. 164

క. "వెఱవకుము రాజపుత్రక!
కొఱగామి యొకింత నీకుఁ గొలుపఁగఁ బో; ని
త్తఱి మిత్త్రుల మైతిమి మన
మిరువురమును; దలఁక వలవ దీవింక యున్. 165

వ. నీవు నావలన వెఱపు నొందుచున్న యట్ల నేను నొక్క సిం
గంబువలన వెఱపు నొందుచుఁ బఱచి వచ్చితిం గావున
నీభయంబు చందంబు నే నెఱుంగుదు; మన మిద్దఱము
నిప్పుడు సమానధర్ములమై యున్నవార; మట్లగుటం జేసియు
మిత్త్రుల మని చెప్పుచుంటి; నీ విది విశ్వసించి యివ్విశాల
వృక్షశాఖపైఁ బవ్వళించి సుఖంబుగ నిదురింపుము; తెల్ల
వాఱిన పదంపడి యెవ్వరి త్రోవను వారు పోవుదము"

క. అని యెలుఁగు దనకు వేఱ యుడి
పినఁ దేకొని రాజసుతుఁడు భీతిఁ దొఱఁగి త

ద్ఘటన విటపిశాఖ యొకటి శ
యనముగ నిదురించె నడవి నందిన యలఁతన్. 167

ఆ.వె. భల్లుకంబు వెంటఁ బఱతెంచి వచ్చిన
మృగపతియును జెట్టు మీఁదు గనుచుఁ
దలఁగ కందె యుండె; నెలుఁగును నిద్రింప
కరయు చుండెఁ దద్గజారివంక. 168

వ. అట్లు గొంతవడి గడచిన పదంపడి యమ్మృగేంద్రం బా
భల్లూకంబు నుద్దేశించి యిట్లనియె. 169

గీ. ఈవు నాబారిఁ దొలఁగి చెట్టెక్కి యెట్లొ
బ్రతికిపోయితి; పోనిమ్ము; భల్లుకంబ!
మ్రానిపై నిద్రవోవు నమ్మనుజు నైనఁ
గ్రిందఁ ద్రోయుము నేను భక్షింతు వాని. 170

క. మానవుఁడు వాఁడు! వన్యమృ
గానీకమ్మునకు దుస్సహారి! పిదప నీ
ప్రాణముల కెగ్గు దలఁచుఁ జు
మీ! నీవాశ్రను నమ్మ దేమిటి కహహా! 171

క. తడయక వానిం గ్రిందికిఁ
బడఁద్రోయుము దుష్టశత్రు భక్షించి నినున్
విడిచెద; నీ వీయాపదఁ
గడచి యభీష్టముగఁ బోవఁగా వచ్చు నిఁకన్. 172

చ. అనుటయు భల్లుకంబు "కలుషాత్మక! నన్నిటు విశ్వసించియి
మ్మనుజుఁడు మిత్త్రభావమున మ్రానిపయిన్నిదురించుచుండె; నీ
తనిఁ బడఁద్రోసి చంపు టది ధర్మమొ? యేనటు మిత్త్రఘాత సే
యన; నను నీవు వీడ కిటు లాపదఁ బెట్టినఁ బెట్టు మియ్యెడన్.

క. అన విని సింగము సిబ్బితి
గొని యూరకయుండె; నవలఁ గొంతవడికిఁ ద
జ్జనపాలక తనయుఁడు మే
ల్కొనె; నపు డయ్యెలుఁగు నిదుర గూర్కొని రాఁగన్. 174

వ. రాజపుత్రుండు మేల్కొనియున్నవాఁడు గదా యని తాను నాతని సమీపంబున శయనించి నిర్భయంబుగా నిదురింపం దొడంగె; నాసమయంబున:— 175

ఆ.వె. ఆగి నెలుఁగు నడిగి నల్లె యాహార్యక్ష
మాన్నృపాత్మజున్మ నడిగె; దుష్ట
భల్లుకమును గ్రిందఁబడఁద్రొబ్బు; మీవు నీ
యిచ్చ మెయిఁ జనంగ వచ్చు ననుచు. 176

వ. అంత:— 177

చ. నృపసుతుఁ డాత్మరక్షణమునే పరమార్థముగాఁ దలంచి పా
పపుఁ జని నాక, సింగము కృపం గడియింపఁగ భల్లుకంబు ని
ట్టి పడ విదిల్చె; దానిని వడిం గడతేటిచి వేగ తాను జి
క్కు పడక స్వేచ్ఛగాఁ జనెడు క్రోరిక నెమ్మది ముమ్మరంబుగాన్.

గీ. అప్పు డాభల్లుకంబు దైవానుకూల్య
వశత మేల్కాంచి పుడమిపైఁ బడక, నిబిడ
విటపి విటపాగ్రములఁ బట్టి వ్రేలఁ బడుచు
నామహీపాల సుతున కిట్లనియెఁ గినుక. 179

క. ఏలా దుశ్శీలా! న
న్నీలీలన్ ద్రోసివైచి తేమిటి కకటా!
చాల నిను నమ్మియుండఁగ
మేలా యిటు సేయ నీకు మిత్త్రద్రోహీ! 180

గీ. ఈవు నా కొనరించిన యీ నికార
మెంత కాలంబునకు నన్ను మఱుఁగ నేర్తు
రంత దనుక మహోన్మాదహతవివేక
మతి వయి చరించెదవుగాత మఱపు గలిగి. 181

ఆ.వె. అని శపించెఁ; బిదప నరుణోదయం బయ్యెఁ
దెల్లవాఱె ననుచుఁ దెలిసి సింగ
మచోటు వాసిపోయె; నాభల్లుకంబును
జెట్టునుండి దుమికి యట్టు చనియె. 182

ఉ. అంత, హిరణ్యగుప్తుఁడు గృహంబున కేగ్లేటోయేఁగి, శాపవి
క్రాంతి గతప్రబోధుఁడునుగాఢవిమోహహతమోహితుండునై
యెంతయుఁ దూలియుండఁ గని యియ్యది యేమనియోగనం
దుఁడత్యంతవిషాదమొందుచువిజ్ఞప్తజనంబులతోడనిట్లనెన్.

మ. అనుగుంబుత్రకుఁ డెక్కటంబునఁ గృతవ్యామోహుఁడై వేఁ
డుఱున్ గానెనో యేరునెఱుంగరై రకట! తద్ఘోరాటవీభూమినీ
తని కేమయ్యెనో? యెట్టు లియ్యది నివృత్తంబౌనో? యేవారలీ
ఘనగూఢార్థము విప్పి చెప్పెదురు ప్రజ్ఞావైభవోన్మేషులై?

గీ. గూఢవిజ్ఞాన దక్షుండు కూర్మి మంత్రి
సకలకార్య వివేకవిచక్షణుండు
నైన వరరుచి గతియించె; నతఁడ యున్న
నెఱిఁగి సెప్పెడువాఁడు గాదే యి దెల్ల. 185

క. విజ్ఞానమహోవార్ధి మ
దాజ్ఞాపాలన సమర్థుఁ డాతఁడు నాచే
నజ్ఞానవశమునఁ గృతా
వజ్ఞుండై సంహరింపఁబడె నకటకటా! 186

గీ. అని వగవ సాగ శకటాలుఁ "డదిర! నేఁటి
కొదవె సమయంబు వరరుచి నుద్ధరించి
ప్రభుని చెంగట వెండియు బయటఁ బెట్టి;
నంత మాత్రాన నా కేమి హాని యొదవు! 187

ఆ.వె. మనుజ విభుఁడు తన్ను మన్నించి వేఁడినన్
మానవంతుఁడైన మహితుఁ డాతఁ
డింక నీనృపాలు నేల్బడి నిల్వఁగా
నిచ్చగింపఁ బోవఁ డిది నిజంబు. 188

ఆ వె. అట్లు యగునుగాక, యవనీశ్వరుఁడు నన్ను
విశ్వసించి గారవించు మివుల
మఱియు వరరుచికిని మాటయుఁ దక్కు; ని
ర్దోషతయు లభించుఁ దుద కతనికి" 189

వ. అని యిట్లు తనమనంబున నిశ్చయించుకొని యవసరజ్ఞుం
డైన యాశకటాలుండు యోగనందున కిట్లనియె. 190

చ. పృథువర! నీవు తన్మృతికి భావమునన్ దురసిల్ల నేల? నా
కభయ మొసంగుదేని మహితాత్మకు నాతని దేవమంత్రిస
న్నిభుఁ గొనితెచ్చి నీయెదుటఁ నిల్పుదు; దేవరయాజ్ఞ గాఁదగున్
రభసముమీఱ;నాయెడల రావల దాగ్రహ మల్గొనర్చుటన్.

క. ఆనాఁడు తేని యానతి
నైనను వధియింప నైతి నయ్యనఘు మహా
ధీనిధి నేకాంతమ్ముగ
మానిలయమునందు నిల్పి మనుచుచు నుంటిన్. 192

గీ. అతఁడు మాయింట సుఖముండె నధిప! నేను
బ్రభుని యానతిమీఱి తత్ప్రాణరక్ష
చేసితి; యథార్థముగ దీన గాసి లేదు
గాన నాతప్పు సైఁపు మోమానవేంద్ర! 193

చ. అన విని యన్నృభుఁడు హృదయంబునఁ దద్దయు సంతసించి
తో। డన కొనితెమ్మటంచు శకటాలునిఁ బంచిన నాతఁ డంతఁ
జ। య్యనఁ జనుదెంచి నేను గడునబ్బుర మొందుచునుండ

వేడ్కతో౯ గొని చనె నన్ను రాజుకడకుం బురవాసులు
తన్ను మెచ్చఁగాన్. 194

వ. ఇట్లు నేను మరల రాజసన్నిధానంబున కరుగుటయు నంత
నక్కడః— 195

గీ. ఒడ లెఱుంగక తడఁబడు నుదులు నోట
వెడల, వెడవెడ చూపులు వెకిలి నగవు
నడర నున్మత్తుఁడై యున్న యాత్మజున్మ
నతనిఁ దోడ్తెచ్చి చూపె నయ్యవని విభుఁడు. 196

గీ. అంత నే నాతని వికార మట్లు చూచి
శారదాదేవి సత్కటాక్షమున మఱియు
లక్షణానుమానాదిక వీక్షణమున
నెఱిఁగి యాయోగసంఘట౯ నిట్టు లంటి. 197

క. ధాత్రీనాయక ! నీప్రియ
పుత్రుం డితండు విపిన భూమిఁ దిరుగుచో
మిత్రద్రోహము సేసె, గ
త త్రపుఁడై ; దాన నిట్టి దశ వాటిల్లెన్. 198

గీ. తన్ను నమ్మిన యొక్క మిత్రమ్ము నితఁ
డాత్మ సంరక్షణార్థమై యాసఁజేసి
కడఁగి కడతేర్పఁ జూచె నిష్కారణముగ
నక్కతన నితఁ డున్మత్తుఁ డయ్యె నిట్లు. 199

ఆ.వె. అని తదీయ వృత్త మట్లు నే నెఱిఁగింప
నాక్షణంబ శాపమోక్ష మగుడు
మబ్బు విడిన మాడ్కి- మంచు విరిసి నట్లు
వేగ నృపకుమారు వెఱ్ఱి దొలఁగె. 200

వ. అంత:— 201

శా. ఉన్మత్తుం డగుసూనుఁడట్లు గతమోహోద్రేకుఁడై నూత్నబో
ధోన్మేషంబు వహింప రాజు మదినత్యుత్సాహముం జెంది, నన్
సన్మానించి యనేకభంగులఁ బ్రశంసల్ సల్పెఁ; దత్పుత్రకుం
డున్మోదంబునఁ దేలి యచ్చెరువుపాటున్ జెందె మత్ప్రజ్ఞకున్

ఆ. అవల యోగనందుఁ డత్యంత కౌతుకా
యత్త చిత్త వృత్తి యగుచు "నో మ
హాత్మ! యెట్టు లెఱుఁగ నయ్యె నీ కీవృత్త
మడవిలోన జరగి నది గదయ్య! 203

వ. అదియు నాకెఱింగింపవలయు, నని వేడుకపడి వేఁడుకొనుట
యు నంత నే నతనితో నిట్లంటి:— 204

మ. జననాథా! వచియించుచుంటి, విను; ప్రజ్ఞావంతులౌ వారు
తా।మనుమానంబున, లక్షణంబులను, సమ్యగ్జ్ఞాన సంపత్తి
చేతను సర్వంబు నెఱుంగు చుంద్రు! మును తద్రాజ్ఞీకటీమండ
లంబునఁ దచ్చిహ్నమ దెల్లెఱుంగఁబడె? నీ పోల్కింగదా
యుద్దియున్. 205

క. అనవుడు మద్వచనంబులు
విని యెంతయు సిగ్గుపడుచు, విదిత విషయుఁడై
యనుతాపము నొందుచు నా
కనుపమ సత్కృతులు సేయ నభిలాషించెన్. 206

వ. అంత:— 207

ఉ. ఏనును దద్బహూకృతుల నేమియు నొల్లక దోషశుద్ధియే
కానికగాఁ దలంచుచు సుఖంబుగ నాయిలు సేరుకొంటి; వి
జ్ఞానము గల్గు వారలకు స్వర్గము లేల? యనర్ఘ రత్నసం
తాన మదేల? శీలమె ప్రధానముగాక సుహృద్వ్రతంబవా?

వ. ఇవ్విధంబున నేను యోగనందునివలన దోషశుద్ధిం బడసి
మదీయ మాతృదేవతను మత్ప్రియ ప్రేయసీ తిలకంబును
గనుంగొను తమకంబున నస్మద్గేహంబున కరుగుటయు నా
సమయంబున:— 209

మ. అకటా! యేమని చెప్పువాఁడ వినుమయ్యా! కాణభూతీ!
భయానక మీదుర్భరవార్త నేఁటికి; నటుల్ నన్ గాంచి
యావేళ మామక బంధు ప్రకరంబు గొల్లుమని సంభ్రాంతిన్
విలాపించె దానికి నేనేమియుఁదోఁప కట్లియచట న్నిశ్చేష్టత
న్నిల్చితిన్. 210

వ. అంత నొకింత వడికి:— 211

క. ఉపవర్షుఁడు మచ్ఛ్వశురుఁడు
విపుల విషాదంబు వెల్లివిరియంగా న

న్నుపలక్షించి, తుదకు ధై
ర్య పటుత్వముఁ బూని యిట్టు లనియెన్ నాతోన్. 212

చ. అకట! కుమార! నీవు వసుధాధిపు చేసిన యట్టి ఘోర శి
క్షకు గుఱియైతివంచువిని చయ్యన మాయువకోశ తీక్ష్ణపా
వక శిఖలందు మే న్విడిచివైచి మమున్ విడనాడిపోయె; హ్మా
ద్వికలత నీ సవిత్రియును వీడె నిజాసువు లేమి సెప్పుదున్.

ఆ. త్వద్వియోగ దుఃఖదశ నోర్వలేక ల్లు
వార లిర్వురును దివమున కరిగి
పరమ ధన్యులైరి భాగ్యవతుల్ గాన;
నట్టి భాగ్యమొదవ దయ్యె మాకు. 214

క. అన విని పెనుగాడుపు తాఁ
కునఁ బెల్లగిలంగఁ బడిన కుజము వడువునన్
దనువు ధర వ్రాలి మూర్ఛన్
మునిఁగితి నే నధిక శోక ముగ్ధుఁడ నగుచున్. 215

గీ. అట్లు మూర్ఛ మునింగి నే నవలఁ గొంత
వడికి స్మృతి వచ్చుటయుఁ బ్రలాపములు సేయఁ
గడఁగినాఁడఁ బ్రాకృతుని కైవడి మదీయ
బంధుజాతమ్ము నను గూర్చి భయము నొంద. 216

గీ. కాణభూతీ! మనుష్యలోకమున నెంత
యెఱుక గల్గినవారలనేనిఁ బ్రియత

మాప్త బంధువినాశోత్థమైన శోక
వహ్ని దహియింపకుండునే వాఁడిమిగిలి. 217

వ. అట్లు నేను బ్రియబంధు వినాశంబున నజ్ఞుండునుం బోలెఁ బ్రలాపమ్ములు సేయుచుండుటయు నంత నవి యాకర్ణించి విజ్ఞాన నిధానంబైన వర్షోపాధ్యాయుండు వాత్సల్యాతిశయంబున నాకడ కరుదెంచి యిట్లనియె:— 218

ఉ. ఏ మిది వత్స? యజ్ఞుఁడవకే? జగతీస్థలి సృష్టి యాదిగా
నే మగుచున్నదో యెఱుఁగవే? నశియింపని వస్తువున్నదే?
ప్రేమభరంబునన్ మృతులఁ బేర్కొని యేడ్చిన వెండి వత్తురే?
పామరు నట్లు నీ వడలఁ బాడియె సర్వమెఱింగియుండియున్.

గీ. ఊహసేయ ననిత్యత యొకటి దక్క
నిత్యమైనది యొక్కఁడేనియును గలదె?
యట్టి నిత్యేతర పదార్థహాని కింత
వగవఁ దగునయ్య యోవెఱ్ఱినాఁడ యిట్లు? 220

వ. అని యివ్విధంబునఁ బెక్కుతెఱంగుల నగ్గురుదేవుండు తాత్త్విక వచనంబుల దుఃఖోపశమనంబు సేయుచుఁ బ్రబోధింప నే నట్టకేల కెట్టులెట్టులో గుట్టువడసి విరక్తంబైన హృదయంబుతో సర్వసంగంబులుం బరిత్యజించి పవిత్రమైక సహాయుండనై తపోవనంబున కరిగి:— 221

సీ. అచ్చోటఁ దపము సేయఁదొడంగి యొక యాశ్ర
మస్థానమున నియమముగ నుండ

జరిగెఁ గొన్నిదినంబు; లవ్వేల నొక్కనాఁ
డొక విప్రముఖ్యుఁ డయోధ్య నుండి
యయ్యాశ్రమంబున కరుదెంచె; నంత నే
నా యోగనందు వృత్తాంత మతని
నడుగులయును నా ధరామరుం డపుడు న
న్నానవాల్పట్టి శోకార్తుఁడగుచు

గీ. నిట్లనియె నన్నుఁ గూర్చి "యోయీ! మహాత్మ!
యిప్పు డేమని చెప్పుదు నింకయోగ
నందు వృత్తాంత మెల్ల సాంతమయి, యకట!
కడచిపోయెఁజుమీ యొక్క కలయుఁ బోలె. 222

వ. అది యెట్లనినఁ జెప్పెద నవధరింపుము:— 223

—♦ చాణక్యుఁడు యోగనందుని సంహరించుట ♦—

క. నీ వచోటు విడిచి వచ్చిన
యావెనుకన్ దన్నృపాలు నగ్రసచివతా
శ్రీ విలసిలు శకటాలుం
డావేళఁ గృతావకాశుఁడై చలముమెయిన్. 224

క. కపటత్వముఁ గొని, తన పూ
ర్వపు వైరముఁ దీర్చికొన నవసరం బగుటన్
నృపవధ మొనరింపఁగఁదగు
నుపాయముల నరయఁ దొడఁగె నుచితవిధమునన్. 225

వ. ఇట్లు శకటాలుండు నృపవధోపాయాన్వేషణంబు సేయుచున్న
యవసరంబున నొకానొక దివసంబున:— 229

సీ. చాణక్యుఁడను నొక్క జగతీ సువర్ణుండు
తా నేఁగు నొండొక దారి నడుమ
గర్త మొక్కఁడు త్రవ్వఁగనుఁగొని శకటాలుఁ
డేమయా! తొరవలో నిట్లు త్రవ్వ
ననుచుఁ బ్రశ్నింపఁగా, నది విని యావిప్రుఁ
డిట్లనె మొగముపై నీసు దోఁప
“నీ దర్భ నాకాల నిచట మిక్కిలి నోవఁ
గాఁడెఁ గావున దీని నూడఁబెఱికి

గీ. వైదిక నిర్మూల మొనరింప వలసి యుంట
నిట్లు త్రవ్వుచు నున్నాఁడ; నిది మదీయ
శత్రు వగుట నుపేక్షింపఁజనదు గాదె?
యనినఁ దద్వచనంబుల నాలకించి. 227

గీ. క్రూరనిశ్చయుఁ డితఁడతి కోపనుండు
చలము గలవాఁడు శత్రునాశమునఁ; గాన
యోగనందవధంబున కుపకరించు
నిట్టి దృఢకోపు నరక పోనీయఁదగదు. 228

వ. అని తలంచి శకటాలుండు సపరిచయంబుగాఁదన్నామధేయం
బడిగి తెలిసికొని సస్నేహంబుగా నతనితో నిట్లనియె:— 229

గీ. బ్రాహ్మణోత్తమ! కడుఁ జేదవానిభంగిఁ
దోఁచెదవు; జాలి వొడమె నిన్ జూచినంత
రమ్ము నావెంట సందభూరమణు నింట
జరగ నుండె త్రయోదశీ శ్రాద్ధ మొకఁడు. 230

ఆ.వె. అదియు నీకొసంగ నట్లు చేసెద; దాన
దక్షిణయు సువర్ణలక్ష యుండు
నఖిలభూమి సురుల యగ్రంబున భుజింప
వచ్చు; దక్షిణయును బడయ వచ్చు. 231

గీ. అచిరకాలంబుననె గల దా తిథియును
నంతదనుకను మాయింట నతిథి వగుము;
పాత్రులగు నిన్ను బోఁటి సద్బ్రాహ్మణులకు
సలుపు నుపకృతి సుమహితఫలముగాదె? 232

క. అని పలుకుచు నాచాణ
క్యుని దన వెంబడిని దోడుకొని గృహమునకున్
జని యాశ్రాద్ధ దినంబున
జనపతికిం జూపి చెప్పె సముచితరీతిన్. 233

వ. అంత నాయోగనందుండును శకటాలుని వచనంబుల ననుస
రించి యాచాణక్యుని త్రయోదశీ శ్రాద్ధభోక్తగా ననుమ
తించుటయుఁ జాణక్యుండును రాజానుమతంబునం జని యా
శ్రాద్ధంబున నగ్రోపవిష్టుండై యుండె; నంత నది చూచి

సుబంధుం డను వేఱొక్క విప్రుండు చిరకాలంబునుండి రా
జాశ్రితుండై యున్నవాఁడు వచ్చి తన కయ్యగ్రస్థానంబు
తొంటినుండియుఁ గ్రమలభ్యంబై యుండుటంజేసి యందులకుఁ
దాన యర్హుండ నని వాదింపం జొచ్చె; నప్పుడు శకటాలుం
డావృత్తాంతం బంతయు రాజునకు విన్నవించిన నతం డతని
కిట్లనియె.:— 234

ఆ. వె. అగ్రభోజనమున కాసుబంధుఁ డొకండ
యర్హుఁ డగును గాని యన్యు లెవరుఁ
దగ; రతండు మనకుఁ దద్దయు నాశ్రితుం
డగుట నగ్రభోక్త యతఁడ యగుత. 235

క. అన విని శకటాలుఁడు స
య్యనఁ జని చాణక్యుఁ జూచి యత్యంతభయం
బును వినయంబును దోఁపఁగ
జననాయకు నాజ్ఞ తెఱఁగు సకలము వినిచెన్. 236

వ. ఇట్లు వినిచి యందుఁ దన దోషంబు లేశంబు లేకుండుట
విశదీకరించుటయు:— 237

గీ. అంతఁ జాణక్యుఁ డుదీర్ణకోపాగ్ని యగుచుఁ
జుఱచుఱలుగాఁగఁ దన సిగ విరియఁ బోసి
కటకటం బండ్లు గొఱుకుచుఁ గటము లదరఁ
దీవ్రతరముగ నిట్లు ప్రతిజ్ఞఁ జేసె. 238

శా. బంధుం డంచు సుబంధుఁ గైకొని ననుం బాలింప కే రాజ్యగ
ర్వాంధుం డింత యవజ్ఞఁ జేసెఁ; గనుఁ డన్యూర్యా! వీరా
లేనాఖ్యలో|గంధర్వుల్ గయికొన్న పిసిపసి చక్రంబెట్టి నే నీ
శిఖా|బంధంబుం బొనరింతు సంతదనుకన్ బంధింప నీ కేశముల్.

క. కనుఁగొనుఁ డీ నా దృఢ దీ
క్షను! నే నీనృపతి నట్లు కడతేర్చి మనం
బునఁ గల యుడుకుం జల్లా
ర్చినపదపడిగాని నాదు శిఖ బంధింపన్. 240

క. అని బిట్టఱచుచు, దానికి
మనుజేశుఁడు కినుకఁ జెంది మార్కొనఁ బోవన్
గని యచటి నుండి వడివడిఁ
జనె నాతఁడు తీవ్రకోపసంరంభముతోన్. 241

వ. అంత రాజవధార్థంబు తటి వేచియున్న శకటాలుం డది
యంతయుఁ బరికించి శోడస రహస్యంబుగా నాతనికిఁ దన
గృహంబున నిలుచుటకుఁ దగిన వసతి యొసంగి నిలిపి
క్రమంబుగాఁ దదీయప్రతిజ్ఞా నిర్వహణంబు సేయించి తనపగఁ
దీర్చికొన నిశ్చయించుకొని, యందులకు వలయు నుపకరణ
మ్ములు సమకూర్చుచు నిగూఢంబుగా నతనిని సంరక్షించు
చుండుటయు నయ్యవసరంబునఁ జాణక్యుండును:— 242

గీ. అతినిగూఢస్థలంబున కరిగి యొంటొ
యేరుఁ గనకుండఁ గృత్యావిహిత మహాభి

చార హోమమును నొనరించె దారుణముగ
యోగనందుండు నాశంబు నొందునంటె. 243

గీ. అంతఁ దద్ఘోరకృత్యాభిచారమునను
నవనిపాలుండు దాహజ్వరార్తుఁ డగుచు
సప్తమ దినంబునందు పంచత్వ మొందెఁ
గటకటా! యాత్మ భాగ్యభోగ్యములు వాసి. 244

క. ధరణిపుఁ డతఁ డవ్వడువున
స్మరణీయుం డైన వెనుక శకటాలుఁడు ము
త్సరమునఁ దత్సుతుఁ డగు నా
హిరణ్యగుప్తుని వధించి స్వేచ్ఛావృత్తిన్. 245

గీ. పూర్వనంద మహీపాల పుత్రుఁ జంద్ర
గుప్తు రాజ్య లక్ష్మి విశిష్టుఁ జేసి
కడఁకఁ దద్రాజ్య మెల్ల నిష్కంటక మయి
చిరము నెలయంగఁ దన మదిఁ జింతచేసి. 246

శా. బుద్ధిన్ గీష్పతి కుద్దియై నెలయు తద్భూదేవుఁ జాణక్యు డం
శుద్ధాత్మున్ దగురీతి నా నృపున కచ్చో మంత్రిగా నిల్పి, తా
నద్ధాత్రీపతి యాజ్ఞనొంది కృతకృత్యత్వంబునన్ దృప్తుఁడై
యుద్ధీరాగ్రణి కాన కేఁగె సుతశోకాత్యంత నిర్విణ్ణుఁడై. 247

గీ. అనుచు నవ్విప్రుఁడు వచింప విని జగమున
నేది గనుఁగొన్న నస్థిరంబే యయి కనఁ

బడుఁ గదా యని నిర్వేద పరుఁడ నగుచుఁ
గలఁతఁ జెందితి మదిలోనఁ గాణభూతి! 248

క. ఆకరుణి హృదయ మెంతయు
వ్యాకుల పడుటయును, వింధ్య వాసినిఁ గన నే
నీకడకు వచ్చి తద్దే
వీ కృప నినుఁ గంటి నిట్లు విమలమనీషా! 249

వ. అయ్యనంతరంబున:— 250

క. నిను దర్శించిన తోడ్తో
డన జాతిస్మరత గలుగుటయె కాక పురా
తన దివ్య జ్ఞానంబును
బనుపడెఁ గృతకృత్యతయును బడసితి నేనున్. 251

వ. ఇమ్మహాకథయు నీకు సర్వంబు నెఱింగింపంబడియెం గావున:—

క. నే నిపుడు క్షీణశాపుఁడ
నైనాఁడ; నిఁకన్ మదీయ మగు నీతనువున్
బోనాడఁగఁ దగు యత్నము
నూనెద; సెలవిమ్ము నాకు నో మిత్త్రవరా! 253

వ. ఇది యిట్లుండె:— 254

చ. ఇఁక నొకమాట నీకు వచియింతు వినంగదవయ్య; నీవు చెం
తనుఁ జను దెంచు, శిష్యులనుదాను,గుణాఢ్యుఁడనంగ నొప్పు
నొక్క కవి; యతండు నీవలనఁ గ్రమ్మఱ నిక్కథ యాల

కించు; నంతఁగా నిట నుండు మీరును; బడంపడి శాపవిముక్తి
యయ్యెదున్. 255

ఆ.వె. అతఁడు మాల్యవంతుఁడను ప్రమథుండు మ
త్పక్షపాతి; నాకతమున దేవి
వలన శాప మంది యిల మనుష్యత్వంబు
పడసి యున్న పుత్త్రపత్నులుండు. 256

గీ. అతనికి మహేశ్వరోక్తి మున్నట్టి యిమ్మ
హాకథ వినిపింతువేని యనంతరమున
నీకు నతనికి సృతము నిశ్చయముగ
శాపమోక్షంబు తోడనే సంభవించు. 257

క. అని యివ్విధమున సర్వము
వినిచి, పిదపఁ గాణభూతి వీడ్కొని నిజదే
హం నిపాతంబునకై చ
య్యన వరరుచి చనియె బదరికాశ్రమమునకున్. 258

వ. అట్లు వరరుచి యత్యంతపావనంబైన బదరికావనంబున కరు
గుచు మార్గమధ్యంబున గంగానదీతీరంబున నొకానొక
యాశ్రమపదంబునఁ బ్రవేశించి:— 259

ఆ.వె. శాకమాత్రభుక్తి సలుపుచు నియతిమై
ఘనతపం బొనర్చు ముని నొకరునిఁ
గాంచె దర్భ వ్రేలఁగాఁడ నెత్తురుగాఱు
పాణితోడ నొప్పుహాని నచట. 260

వ. అట్లుగాంచి:— 261

క. ఉడుగక నెత్తురు చుక్కలు
వడిఁ దొరఁగుచు నుండ మౌనివరు హృదయం బె
వ్విధమున నుండు నొకో యా
యెడ నరసెదఁ గాక యనుచు నెంచి రయమునన్. 262

క. ఆ రుధిరము శాకరసం
బై రంజిలఁ జేసెఁ దనమహత్త్వంబున న
ద్ధీరుఁడు మునిదైన యహం
కారపరీక్షణము సేయు కౌతుకమున మఱియున్. 263

గీ. అంత నమ్ముని తన నెత్తు రట్లు శాక
రస మగుటఁ గాంచి మోదసంరంభ మెసఁగ
"సదితె! నారక్త మిట్లు పస రయ్యె నింక
నేను సిద్ధుండ నైనాఁడ నిది నిజంబు. 264

వ. తపస్సిద్ధుల రక్తంబు దక్క నన్యుల రుధిరంబెల్లను పసరుగాఁ
బరిణమింపం బోవ"దని తలంచి తనలోఁ దాను గర్వింపఁ
దొడంగుటయు:— 265

క. అది గని వరరుచి చిఱునగ
వొదవఁగ మునిఁ జూచి యోమహోద్దేశ! భవ
ద్ధృదయము సరయఁగ నాచే
నిది యిట్లొనరింపఁ బడియె నేనునువాఁడన్. 266

184

ఆ. వె. అంతఁ గాణభూతి యవ్వింధ్య వనభూమిఁ
దద్గుణాఢ్య విబుధ దర్శనాబ్ధి
కాంచు చిత్తమునఁ గడుఁ గోరఁ దత్సమా
గమము వేచుచుండెఁ గాననమున. 277

శ్రీ శ్రీ శ్రీ

కథాపీఠ లంబకమునఁ

బంచమ తరంగము

సమాప్తము.



ఓమ్!

# ఆంధ్ర కథాసరిత్సాగరము.

## కథాపీఠలంబకము. ౧

:o:

### షష్ఠ తరంగము.

గీ. మాల్యవంతుం డట్టులి మ్మహిం మనుష్య
జన్మ మొంది గుణాఢ్యసంజ్ఞఁ దనరుచు
సాతవాహన మేదినీశ్వరుని చెంత
మంత్రిపదస్థితుండయి మనుచునుండి. 1

వ. ఒకానొక సమయంబున న మ్మేదినీకాంతుని సముఖంబునఁ గొండొక నిమిత్తంబునకై తా నొనరించిన ప్రతిజ్ఞ ననుపాలించుకొనుచుం ఔ నిజాభ్యస్తంబులైన సంస్కృతాది భాషల మూఁడింటిని బరిత్యజింపవలసినవాఁడయ్యె, నయ్యనంతరంబున:— 2

సీ. ఆగతి భాషాత్రయము వీడి తత్పరి
త్యాగంబువలన ఖిన్నాత్ముఁ డగుచు
వింధ్యవాసినిని సేవింపఁ దత్సన్నిధి
కరిగి, యాదేవియాజ్ఞానుగతిని

జని, కాణభూతిదర్శన మాచరించి, పూ
ర్వజ్ఞానసంపత్తి పడసి, తాను
సంస్కృతాదిస్వభాషల మూఁటి విడియుంటఁ
దద్విలక్షణ మయి తనరునట్టి

గీ. భాషఁ బైశాచిఁ గొని యుక్తభంగిఁ దాన
గాణభూతికిఁ దన్నెఱుంగన్ వచించి
యవగతాఖిల పూర్వవృత్తాంతుఁ డగుట
నెనక మెసఁగంగ నతనితో నిట్టు లనియె. 3

వ. ఓయిపిశాచాధిపతీ! కాణభూతీ! నా కిప్పుడు నీసందర్శ
నంబునం జేసి జాతిస్మరత్వంబు గలిగె; నీ వృత్తాంతం బంతయు
నా కవగతంబై యున్నయది:— 4

గీ. పుష్పదంతునివలన నీవు వినినట్టి
దివ్య కథ శీఘ్రముగ నాకుఁ దెలుపు మిపుడు
దాన నీకును నాకుఁ దోడ్తోన శాప
మోక్షము లభించు నీరూపములు దొలంగి. 5

చ. అనవుడు సంతసంబు హృదయంబున నిండుకొనంగ నాగుణా
ఢ్యునిఁ గని కాణభూతి వినయోక్తుల నిట్లనె; నో మహాత్మ! నే
విని చెద నీకుఁ దత్కథ సవిస్తరతన్ దరువాత; నీవు పు
ట్టిన యదిదొట్టి నీ నడవడిన్ విన వేడుక య య్యె నియ్యెడన్.

క. కావున నాయం దాదర
భావము వెలయంగఁ దెలియఁ బలుకుము ధర నీ

యాంవిర్భావము మొదలుగ
యావద్వృత్తాంతమును మహాశయ! నాకున్. 7

వ. అని కాణభూతి యిట్లు ప్రార్థించిన విని గుణాఢ్యుం డతనికిఁ
దన వృత్తాంతం బిట్లు సెప్పం దొడంగె. 8

—♦ గుణాఢ్యుని కథ ♦—

సీ. విను సుప్రతిష్ఠితం బనునొక్క నగరంబు
చనుఁ బ్రతిష్ఠానదేశంబునందు;
నప్పురంబున నొప్పె నాగమజ్ఞుఁడు సోమ
శర్మనా నొక విప్రసత్తముండు;
త ద్విప్రవరున కుద్భవమైరి వత్స గు
ల్మకనాము లైన పుత్రకు లిరువురు;
మఱియు శ్రుతార్థనామాహ్వయంబుననొప్పు
కన్యకా మణియు నొక్కతె జనించె;
గీ. నంత నాబ్రహ్మవిదుఁడు భార్యయును దాను
గాలవశమున మనుజలోకమ్ము విడిచి
చనియెఁ బరలోకమునకు శాశ్వతసుఖంబుఁ
బడయఁ; బదపడి యాతని కొడుకు లపుడు. 9

క. అనుఁగుం జెలులై ప్రియమునఁ
బెనుచుచు నొండొరులు తగినప్రేముడి వెలయన్
మనఁదొడఁగిరి తమ గేహం
బున నొంటిగ నితర బాంధవులు లేకుంటన్. 10

ఆ.వె. అవల నాశ్రుతార్థ యర్థ్యవయోరూప
గుణవిశిష్ట యగుచుఁ గొమరుమిగిలి
యపరిణీత యయ్యు నాకస్మికంబుగాఁ
జూలు దాల్చె మివులఁ జోద్య మొదవ. 11

వ. అంతఁ దత్సోదరు లైన వత్సగుల్మకులు తమ చెలియలి కట్లు
గర్భోత్పత్తి యగుట యెఱింగి:— 12

క. విజనం బై వినివారిత
కుజనం బై యున్న చోటఁ గుదురైన నిజా
నుజ కట్లు చూలు గాన
కృజపడుచు విచిత్ర భావ కలుషిత మతులై. 13

క. పరపురుషా భావము, సో
దరి గర్భముఁ దాల్చుటయును దలపోసి, పర
స్పరపాపశంక మనముల
నిరవు కొన న్నాఁడునాఁటి కీర్ష్యాళువులై. 14

వ. అన్యోన్య సౌభ్రాత్రంబు లనుమానపాత్రంబులుగా నొండో
రువులు దోషాన్వేషణపరాయణులై మంతనంబునం దొకరి
తె ప్పొకరు గనిపట్టఁ గడంగు చుండుటయు:— 15

ఉ. అంతఁ బరేంగితజ్ఞ యగు నక్కొమ వారల చిత్తవృత్తు లే
కాంతమునన్ గ్రహించి "తగునయ్య సహోదరులార! మీకు
దుశ్చింత లొనర్ప నిట్లు కులశీలము లెన్నఁగఁబోక? దీని వృ
త్తాంతము నెల్ల నే వినిచెదన్; వినుఁ డూరక శంక లేటికిన్. 16

గీ. పన్నగాధీశ్వరుండయి వన్నెగాంచి
యున్న వాసుకి కనుజతనూద్భవుండు
గలఁడు కీర్తిసేనాఖ్య నాగసుతుఁ డొకరుఁ
డతఁడు ననుఁ గాంచె నేను స్నానార్థ మరుగ. 17

క. పదపడి యాతం డత్యతి
మదనాక్రాంతుఁ డయి వేడ్క మల్లగొడిన, నన్
గదిసి నిజాన్వయ నామము
లుఁ దెలిపి నాయెడ మహాభిలాషుం డగుచున్. 18

గీ. తత్క్షణము నన్ను విహిత గాంధర్వ విధి వి
వాహమై తన సతిగఁ జేపట్టె; విప్ర
జాతి యగు నతనివలన సంభవించె
నాకు నీగర్భ; మొరుల ననంగ నేల? 19

వ. అని చెప్పినఁ దమ సోదరి వచనంబులు విని వత్సగుల్మకు
లియ్యెడ మాకుం దగిన ప్రత్యయం బేమి యని యడుగుటయు
నయ్యవసరంబున:— 20

క. ఆ గరితయుఁ దోడనె త
న్నాగకుమారుని మనంబునం దలఁచెఁ దదీ
యాగమముఁ గోరి; యతఁడును
వేగమ చనుదెంచె వారు వెఱఁగుపడంగన్. 21

వ. అట్లు చనుదెంచి యతం డవ్వత్సగుల్మకుల నుపలక్షించి
యిట్లనియె:— 22

గీ. మీ సహోదరి నీమె నెమ్మి మెయి నేను
ధర్మపత్నిగఁ గొనుట తథ్య మది; యీమె
శాపవిభ్రష్ట యొక్క యచ్చరపడంతి;
మీరలును శాపహతులైనవారలె సుఁడీ. 23

వ. అది యట్లుండె:—

క. జనియించు నీమె కిట నొక
తన యుఁడు నిస్సంశయముగఁ; దదనంతర మి
వ్వనితకును మీకు శాపము
సను; మీరును దివ్యగతికిఁ జనియెద రంతన్. 25

ఆ. వె. అని వచించి యాతఁ డంత ర్హితుండయ్యె
నంతఁ గొన్నినాళ్ల కాశుభ్రితార్థ
సుద్భవించెఁ బుత్త్రిఁ డొక్కరుం; డాతఁడే
నీ సఖుండ నైన నేను జుమ్మి! 26

గీ. అట్లు నే నుద్భవించిన యప్పుడు విన
వచ్చె దిశనుండి యశరీరవాణి యొకఁడు
దారకుఁ డితండు పరమధావతారుఁ డనియు
నొనరఁగ గుణాఢ్య నామధేయుఁ డగు ననియు. 29

వ. అయ్యనంతరంబునఁ గొంతకాలంబునకు మునీయుజననియును
నాదు మేనమామ లైన వత్సగుల్మకులును విగతశాపదోషులై
మానవశరీరంబులు విడిచి దివంబున కరుగుటయు నప్పుడు నేను
బిన్నవాఁడనై యుండుటంజేసి యత్యంతాధీరుండనై కొంత

కాలంబు చింతించి పదంపడి తచ్ఛోకంబు నాయంతట నేన
పరిత్యజించి యెట్టు లెట్టులో కొంత ధైర్యంబు వహించి వి
ద్యాభ్యాసంబు సేయు తలంపుతో దక్షిణాపథంబునకుఁ జని:—

గీ. అచటఁ గాలక్రమమ్మున సకలకళలు
నభ్యసించి ప్రవీణుండనై స్వదేశ
మునకు వచ్చితి మద్విద్యలను వెలార్చి
పరిచితులలోన మన్ననఁ బడయఁదలఁచి. 30

వ. అంత:— 31

క. చిరకాలమునకు శిష్యా
కర సహితుఁడ నగుచుఁ దన్నగరమున కటు లే
నరిగి, యొకానొక శోభా
స్ఫారణము నటఁ గంటి నేత్రములు తనియంగన్. 32

వ. అది యెట్లనిన:— 33

సీ. ఒకచోట నైగిక ప్రకరంబు మధురస్వ
రంబులో సామగానం బొనర్ప
నిగమార్థవేత్తలై తగు విప్రులొకచోట
వేదనిర్ణయ ఫక్కి వాదు సేయ
నొకచోట "జూదగానికిఁ జేతఁ నిధి యుండు"
నని కితవులు జూద మభినుతింప
వణిగుత్తములు నిజ వాణిజ్య కౌశలం
బొకచోట నొండొరు లుగ్గడింప

గీ. నవ్యశోభావిశేష సంస్తవ్య మగుచుఁ
బొలుచు తత్సుప్రతిష్ఠితపురముతీరు
తొంటికంటె ఘనం బయి యుంట యరసి
యాత్మ నలరుచుఁ జనుచున్న యావసరమున. 34

— ♦ ఎలుకసెట్టి వృత్తాంతము ♦ —

గీ. అచటి రమణీయవిపణిమధ్యమున నొక్క
యెడ వణిగ్జనసంఘమునడుమ ధనికుఁ
డైన యొక వైశ్యుఁ డితర వైశ్యజను లెల్లఁ
జేరి వినుచుండ నీరీతిఁ జెప్పఁ దొడఁగె. 35

క. ధనవంతుఁడు ధనసంపా
దనముం గావించు టద్భుతమొకో? మును నే
ధన మించుకయును లేకయె
ధనికుఁడ నైతిని; వినుండు తద్విధ మెల్లన్. 36

వ. తొలుత నేను మదీయజననీగర్భగతుండనై యున్నయప్పుడ నా జనకుండు పంచత్వంబు నొందె; నప్పుడు పాప స్వభావులైన మదీయగోత్రజులు మాతల్లియొద్ద నున్న యర్థం బెల్లఁ గొల్లగొనుటయు నంత నాయమ్మ వారివలనిభయంబున నిల్లు విడిచి యాత్మగర్భసంరక్షణం బొనర్చుకొనుచుఁ దన పితృమిత్త్రం బైన కుమారగుప్తుం డను వణిగ్వరునింట నివసింపం దొడంగె నాసమయంబున:— 37

గీ. అచట నే నుద్భవించితి నా పవిత్ర
చరిత; కాపెయు ఘనమహోత్సాహ యగుచు
నన్ను నిజజీవితనిబంధనముగ నెంచి
యెట్లో పోషించెఁ బడరానిపాట్లుపడుచు. 38

గీ. అంత విద్యాభ్యసన యోగ్యమైన వయసు
వచ్చుటయు, నాకు నొకయయ్యవారి వేఁడు
కొని, యతనిచేత నవుడు మాజననియు నొగి
లిపియు గణితంబుఁ గఱపించెఁ గృప దలిర్ప. 39

వ. ఇట్లు కఱపించి, పదంపడి యొక్కనాఁడామె నన్నుఁ గనుం
గొని యిట్లనియె:— 40

ఉ. ప్రేముడి మీఱ నిన్నుఁ గని పెంచితి; నట్టిటో పెద్దఁజేసితిన్
గోమటి బిడ్డ వీవు; మనకుం గులధర్మము వర్తకమ్ముగా
దేమటి యింక నీ వెటులనేనియు దానిన పూసి యో కుమా
రా! మన జీవనంబునకునై తగువిత్తముఁ గూర్పనోఁ గదా? 41

గీ. చిల్లిగవ్వయునేని నాచేతలేదు
పెట్టుబడికై యొసంగ నింకెట్టు లనిన
నియ్యెడ విశాఖిలుం డనియెడు మహాధ
నికుఁడు కులపతి యొక్కవర్తకుఁడు గలఁడు. 42

క. ఆతఁడు కులీను లగుతన
జ్ఞాతి నిరర్థుల కొసంగు సంచిమొదలు; నీ

వీతఱేఁ జని మూలధనం
బాతని సర్థించి పడయుమనగును గుమారా! 43

వ. అని చెప్పుటయు నంత నేనును మాతల్లియూనతి శిరంబున ధరించి:— 44

చ. అరిగితి నవ్విశాఖిలు గృహంబున కర్థపరిగ్రహార్థ; మ
త్తఱి నుఱియొక్క కోమటియుఁ దన్నికటంబున కేఁగుదెంచెనా
కరణి ధనార్థియై; యతనిఁ గాంచి విశాఖిలుఁ దుగ్రకోపుఁడై
పరుసదనంబు మీఱ నిటు పల్కెఁ గఠోర గళస్వరంబుతోన్.

వ. అది యెట్లనిన:— 46

శా. 'కానీ, చూత'మటంచు నీ వడుగ వీఁకన్ జేతిలోఁబోసితిన్
దీనారమ్ములు పెక్కు; వాని కగు వృద్ధిందే; వదట్లుండె; నా
దీనారమ్ముల నేని నా కిడవు; సందేహింప కీరీతిగా
నౌనా! వెండియు వచ్చితే యడుగ? మూర్ఖా! సిగ్గులేదయ్యె నే?

క ఓ చెడుగా! యచ్చోఁ గల
యీ చచ్చిన మూషకమ్ము నైనఁ బణముగాఁ
జూచుకొని, కుశలుఁ డగువాఁ
డే చందంబుననొ ధనము నిల్పి గడించున్. 48

గీ. అట్టియెడ, నీవు, చేతిలోఁ బెట్టినట్టి
సొమ్ము గడతేర్చి వెండియుఁ దెమ్మనంగ
వచ్చినాఁడవు; హో సొమ్ము చచ్చినాఁడ!
దాఁచఁబెట్టితె యిచట నీ తాత మూట? 49

క. అని కసరుచుండ నే నది
విని యామృతమూషకమ్ము వేఁడెద నా కి
మ్మనఘా! యిదియ పణమ్ముగఁ
గొని నే వర్తకముఁ జేసికొందు నటంచున్. 50

క. చచ్చిన యాయెలుకను నా
కిచ్చినయటు పద్దు వ్రాసియిడి యతనికి, నేఁ
దెచ్చితి దానిం గని యత
డచ్చెరుపడి నవ్వుకొనుచు నభినందింపన్. 51

సీ. అట్లు నే విగతాసువైన యమ్మూషక
మును దెచ్చి యొక వర్తకుని బిడాల
మునకు నాహారార్థముగ రెండుదోసిళ్ల
చణకములకు సంతసమున నమ్మి
యాసెనగలు వేఁచి యవియుఁ గుండెడుశీత
సలిలముం గైకొని చని పురంబు
వెలుపల నొకచోట వృక్షంబునీడఁ గూ
ర్చుండి, యమ్మార్గంబునుండి దప్పి
గీ. గని శ్రమంబునఁ జనుదెంచు కాష్ఠభారి
కులకు సప్రశ్రయంబుగాఁ గొన్ని సెనగ
లిడుచుఁ శీతలపానీయ మీయఁదొడఁగి
నాఁడ; వారును దానికానందమొంది. 52

క. తనిసి యొకొక్కఁడు తనమోం
పున నొక రెండేసి కాష్ఠములు దివిచి ముదం
బున నా కొసఁగుచు నెల్లరుఁ
జనిరి బళా! యితఁడు దొడ్డసాహసుకొనుచున్. 53

గీ. అంతఁ దత్కాష్ఠచయము నే నాపణమున
నమ్మి తన్మూల్యమునఁ దొంటియట్ల చణక
ములను గొని మఱునాఁడు నపోలిక నడపి
కట్టెలు గడించినాఁడఁ; దత్క్రమముగాఁగ. 54

క. దినదినము నట్లు వర్తక
ము నొనర్చుచుఁ దుదకు వారి మోపుల నెల్లన్
గొనినాఁడ మూఁడుదినములు
ధన మిడి నాయంత నే స్వతంత్రముగాఁగన్. 55

వ. అంత నాసమయంబున:— 56

చ. విడుగర లేకయుండ నతివృష్టి హఠంబుగ సంభవించె; న
ప్పుడు పురమందు నెయ్యెడలఁ బుల్లలు లేమి యెఱింగి నేను
నా కడఁ గల కట్టెలన్ బ్రియముగా వెన విక్రయమాచరించు
చున్ బడసితి నెంతయేనిసులభంబుగ నూర్ల కొలందివిత్తమున్

క. ఆవిత్తమునను విపణిం
గావించి మదీయబుద్ధికౌశలమున నెం
తే వాణిజ్యము సలిపి మ
హా వసుమంతుండ నైతి నాశ్చర్యముగాన్. 58

గీ. అప్పు డే నొక్క కనకమయ మగు మూష
కంబు సేయించి ఋణముక్తి గా విశాఖు
లునకు నర్పింప నతఁడు నెమ్మనముప్రీతిఁ
బెరయఁ దన కూఁతు నా కిచ్చి పెండ్లిసేసె. 59

గీ. విత్తహీనుండనయ్యు నివ్విధమున మృత
మూషకముమాత్రమే సంచిమొదలు గాఁగ
విత్తవంతుండ నగుట నివ్విటజనము
లెలుకసెట్టి యటంచు నన్ బిలుచుచుండ్రు. 60

వ. అని యివ్విధంబున:— 61

ఉ. అత్తఱి నవ్విశుండు తన దైనప్రయోజకతన్ ముదంబు ద
ళ్కొత్త వచింపఁగా నచట నున్నవణిగ్వరు లెల్లవారలున్
జిత్తములందు విస్మయముఁ జెందిరి; వ్రాయఁగ గోడలేక యే
చిత్తరువున్ లిఖింప నది చిత్రముగాదొకొ చూచువారికిన్? 62

—♦ సామవేదిమూర్ఖునివృత్తాంతము. ♦—

క. అది విని మే మచ్చోటువిడి
కదలి మ ఱొక్కెడకు నరుగఁగా నచ్చట నె
న్మిది మాడలు దక్షిణఁ గొని
ముదమున నొక సామవేది మురియుచు నుండెన్. 63

వ. అంత నవ్వేదజడుం డైన విప్రునిపాలి కొక్క విటప్రాయుం
డగు పూరుషుండు వచ్చి పరిహాసగర్భితంబుగా నతనితో
నిట్లనియె:— 64

గీ. ఓయి బ్రాహ్మణవర్య! యే నొక్క మాట
వలుకుచున్నాఁడ వినుము నీ బాగుఁ గోరి
మూఁడ లివి యెన్మిదియు నక్రమముగ వెచ్చ
పెట్టుకొనకుము వెంబరగొట్ట వగుచు. 65

గీ. ఈవు బ్రాహ్మణుఁడవు భుక్తి కేమి బ్రాఁతి
ఛాందసత్వంబు వోవఁ గౌశలము గలుగ
లోకయాత్రావిధానంబులు గడియింప
వలయు నీమాఁడలొసఁగి యెవ్వలననైన. 66

చ. అనవుడు ఛాందసుండయిన యాద్విజుఁడిట్లనె; నయ్య! లోక
యాత్ర యెవరు దెల్పెదరు? దాని వచింపుము పోయి నేర్చి
కొందు నిపుడ; నీవె నా కిట ననుఁగునఖుండవు గాన నిన్ను
నే నననయ పూర్వకంబుగ మహాశయ! వేఁడెద నంచుఁ
బల్కనన్. 67

వ. అంత నవ్విటప్రాయుండగు పూరుషుండును నతనిమాఢ్యంబు
నకు వింతపడి మరలఁ బరిహాసార్థంబుగా నతనితో నిట్లనియె:

గీ. చతురికయనంగ నొక్క వేశ్య గల దిచట
నరుగు మీవు తదీయగేహమున కిపుడ
యది వచించును దల్లోకయాత్ర నీకు
వలసినంతయు మిక్కిలి సులభరీతి. 69

వ. అనిన నవ్వేదజడుండది నిక్కంబయనినమ్మి యయ్యా! నే
నచ్చటికేఁగి యేమిసేయువాఁడ నని యడుగుటయు:— 70

క. ఈయెనిమిది మాడలు నీ
వాయంగన చేతఁ బెట్టి యది రంజిల నే
దో యొక సామము దనరం
జేయు మనుచు వెండి యతఁడు సెప్పి పనుపఁగాన్. 71

క. ఆ వెఱఁగు వేదజడుఁ డప్పు
డా వేశ్యాగేహమునకు నరిగె వెసన్; ద
ద్భావం బెఱుఁగమి నది స
ద్భావంబున నతనిఁ గాంచి బహుమానముతోన్. 72

గీ. ఎదురుగా వచ్చి తోడితెచ్చి యింట నుచిత
పీఠము నొసంగి కూర్చుండఁ బెట్టుటయును
దానిఁ గని యాతఁ డోసి! కాంతామతల్లి!
యిదిగో దీనిని గైకొని యీక్షణంబ. 73

క. కరుణించి లోకయాత్రం
గఱపుము; నాయెడలఁ బ్రీతిఁ గావింపుము చె
చ్చెర; నని పలుకుచు నతఁ డా
హిరణ్యములు వేశ్యచేత నిడె వేడ్క మెయిన్. 74

క. అది గని పరిహాసంబులు
పొడలఁగ నచ్చటిజనంబు పొరిఁబొరి నగ నె
మ్మది నుంత సంశయించుచు
నిది పని గా దని తలంచి యింపు ఘటింపన్. 75

గీ. ఛాందసుం డప్పు డాబద్ధసారణంబు
లగు కరమ్ములు గోశ్రవణాకృతులుగఁ
జటులతారస్వనంబున సామగాన
మాచరింపఁగఁ దొడఁగె మూర్ఖాత్ముఁడగుచు 76

వ. ఇట్లు సామగానం బొనర్చి తనప్రజ్ఞావిశేషంబు ప్రకటించిన యెడల వా రందఱుం దన్నట్లు గేలిసేయక గౌరవింతురను తలంపున నత్యంతోచ్చైస్స్వరంబుతో సామగానంబు సేయుచుండుటయు నానమయంబున:— 77

చ. వికృతతరంబు తత్పరుష వేదనినాదము పర్వ వేశవా
టిక మఱుమ్రోయ నచ్చటి విటీవిట సంఘము లాలకించి హా
స్యకృతి దిదృక్షు నయ్యెడకుఁ జయ్యనగుంపులుగూడివచ్చియీ
వికటసృగాల మెట్లిటఁ బ్రవేశమొనర్చెనటంచుఁ బల్కుచున్.

గీ. అర్ధచంద్రంబు నొసఁగుఁ డీయన గళమున
కింక నిబ్భంగిఁ దడయంగనేల ? యనుఁడు
నర్ధచంద్రంబునా బాణ మని తలంచి
బ్రాహ్మణుండు శిరశ్ఛేదభయము గాంచి. 79

ఉ. పేర్చిన తంద్రమైఁ బరుగుపెంపు కొలంతవడంగ, నర్వమున్
నేర్చితి నేర్చి తింకఁ దరుణీమణి! చాలును లోకయాత్ర యం
చార్చుచు నెల్లవారుఁ బరిహాసమొనర్పఁగఁ బాఱి మే నటో
చేర్చెఁ దనంత నవ్వారవుచెప్పిన ధూర్తునిచెంత కూర్చుచున్.

గీ. చేర్చి జరగిన వృత్తంబు సెప్ప నతఁడు
సాలులే దొడ్డకార్యంబు సలిపినాఁడ
వేను జెప్పినదేమి? నీ వేమి సేసి
వచ్చితి వి దెట్లయా వెఱ్ఱి బ్రాహ్మణుండ! 81

ఆ.వె. సామ మనఁగ సాంత్వసంభాషణము గాక
వేశ్యయింట సామవేదపఠన
మునకు నేమి పని? విమూఢత యక్కటా!
వేదజడుల నింక విడువ దేమొ? 82

క. అని వికవిక నవ్వఁగ నా
మొనిమిది మాడలును బోయె నేమిగతి? సఖా!
యని విలపించె మహీసురుఁ
డనుతాపాకులితచిత్తుఁ డై; యట్టి యెడన్. 83

క. కనికరమున న మ్మూర్ఖుని
గని కరము విచార మొదవఁగా నవ్విటుఁ డా
తనిఁ దనవెంటన్ దోడ్కొని
చని వెండియు నప్పడంతి సదనంబునకున్. 84

వ. అట్లు చని యతం డవ్విలాసినిం జూచి నవ్వుచు:— 85

గీ. వనితరో! యీతఁడొకశుద్ధ వైదికుండు
వీని విత్తంబు నీ కెంత? వేలకొలఁది
మేని నీ కొక్క లెక్కగా; దీ ద్విపాద
పశువున కొసంగ్గు మా తత్సువర్ణతృణము. 86

చ. అనవుడు నట్టె నవ్వుచు ధనాంగన విప్రున కిచ్చివైచె నా
మెనిమిది మాడలున్, దగుదువె తటికేనియు బాపనయ్య పో
మ్మని మొగతాళి సేయుచు; ధరామరుఁడున్ దన సొమ్ముఁ గోఁ
బునర్జననముఁ గాంచినట్లు కడు సంతస మొందుచుఁ బోయె
నింటికిన్. 87

ఉ. ఇట్టి విచిత్రకౌతుకము లెన్నియొ మాటికి మాటి కండుఁ గ
న్పట్టఁగఁ జూచుచున్ ముదమునం జని యే నటు శిష్యపాళితో
నెట్టనఁ దన్మహానగరి నిర్జరనాథ నికేతనంబుతోఁ బు
ట్టన నొప్పు రాడ్భవనముం గని తన్నృపదర్శనార్థినై. 88

గీ. ద్వారపాలునిచే నివేదన మొనర్చఁ
బనిచి ధరణీశుననుమతిఁ బడసి యుచిత
భంగి శిష్యగణంబులు బలసి కొలువ
లోనికిం జని యా మహాస్థానియందు. 89

చ. అసదృశవైభవంబున సురావళి గొల్వఁగ నొప్పు నమ్మహేం
ద్రుసరణి శర్వవర్మముఖధూర్వహమంత్రిజనంబు గొల్వ నిం
పెసఁగ మహార్ఘరత్నమయహేమసముజ్జ్వలసింహపీఠి నొ
ప్పెసఁగెడు సాతవాహనమహీపతిఁ గాంచితి నించువేడుకన్.

ఆ.వె. కాంచి యేను స్వస్తికారంబు నొనరింప
నవనిపతియు మివుల నాదరించి
యుచితపీఠ మొసఁగి యుపవిష్టుఁడ నయిన
నాకుఁ బెక్కు మన్ననల నొనర్చె. 91

వ. అంతఁ దత్సమయంబున:— 92

గీ. శర్వవర్మాది భూపాలసచివగణము
గుణగణపరాయణత్వంబు గణుతి కెక్క-
వినుతి సేయుచు మేదినీ విభున కిట్లు
మనవిఁ జేసిగి ననుఁగూర్చి మహితభంగి. 93

క. దేవా! యీతఁడు బహువి
ద్యావేది సమస్తశాస్త్రతత్త్వజ్ఞుఁ డనం
గా వసుధఁ బేరుపడె; నటు
గావునని గుణాఢ్యనామకరణమును దగెన్. 94

క. అన్వర్థనాముఁ డీ వి
ప్రాన్వయముఖ్యుండు గౌరవార్హుం డని చె
ప్పన్విని, మంత్రుల వచనము
ల న్వసుధేశుండు తద్ద లాలించి ననున్. 95

గీ. కుతుక మొప్పంగఁ బెక్కు-సత్కృతులఁ దనిపి
నిజ సమక్షంబునందు మంత్రి నొనరించె
నంత నేనుఁ దదీయగుణానురక్తి
కలరి సతతంబు రాజకార్యములఁ దవిలి. 96

వ. సమర్థత్వంబునం జరించుచు నప్పురంబునందు వసియించి కృత
దారపరిగ్రహుండ నై యంతేవాసిగణంబుల కాగమంబులు
గఱపుచు రాజకార్యనిర్వహణంబునం బ్రవర్తించుచు నొక్కా
నొక దివసంబున:— 97

—♦ దేవీకృతోద్యానము ♦—

గీ. పూతగోదావరీతీరభూమిఁ గొంత
కమున నిచ్ఛావిహారంబుగాఁ దిరుగుచు
నచటఁ బోలుచు దేవీకృతి యను ప్రసిద్ధ
మైన యుద్యానవనిఁ గంటి నచ్చెరువుగ. 98

క. సురపురము వీడి ధరణిం
బరఁగెడు నందనవనంబుభాతి నతిమనో
హరమై తగు నవ్వనమున
కరిగి యచట నున్న తద్వనాధ్యక్షునితోన్. 99

గీ. ఈమహోద్యాన మిచ్చట నెట్లు గలిగె ?
నెవ్వ రేవారు దీని ని ట్లిచట నిలిపి
రెఱుఁగు దే దీని వృత్తాంత మీ వొకింత
యేని; ననవుడు వనపాలుఁ డిట్టు లనియె. 100

వ. స్వామీ ! దీనింగూర్చి యేను బెద్దలవలన విన్నవృత్తాంతంబు వినిచెద నవధరింపుము; తొల్లి నిరాహారుం డైన కొండొక నిరాచారి యిక్కడ కరుదెంచి యీదేవభవనంబుతోఁ గూడ నీయుద్యానంబు నిందుఁ బ్రతిష్ఠించుటయు, నదిమొదలుగా ని ప్పురంబునం గలధరణీసువర్వు లెల్లరు నుల్లంబులు పల్లవింప నిమ్మేడం గూడుచు నొక్కతటి నమ్మౌనిఁ బ్రార్థింప నతండు వారల నిర్బంధవశంబునఁ దనవృత్తాంతంబు నిట్లు సెప్పెనఁట యది యెట్లనిన:— 101

ఉ. ధారిణిలోన సర్వవిదితం బయి పొల్చెడు నర్మదానదీ
తీరమునన్ సమంచితగతిన్ భరుకచ్ఛ మనంగ నొక్కవి
స్ఫారతర ప్రదేశము విభాసిలు; నయ్యెడ నేను నొక్క యం
భోరుహసూతివంశమునఁ బుట్టితి నొక్క దరిద్రు నింటిలోన్.

వ. ఇట్లు పుట్టి:— 103

క. పరమదరిద్రుఁడ నయ్యును
గర మలసుఁడ నగుట నన్నుఁ గని యచ్చట నె
వ్వరు బిచ్చమేని యిడకుం
డిరి; వదపడి యేను బల్లటిలు చిత్తముతోన్. 104

క. ఇలు విడిచి దేశదేశం
బులు దిరుగుచుఁ దుదకుఁ బ్రాణములపయి విసువున్
గలుగుటయుఁ దీర్ఘయాత్రలు
సలుపుచు వింధ్యాటవులకుఁ జని యచ్చోటన్. 105

వ. వింధ్యవాసినీదేవిని దర్శించి నిజాంతర్గతంబున నిట్లు తలంపం
గడంగితి:— 106

ఉ. ఈయమ కెల్లలోకులును నిచ్చుచునుండ్రు పశూపహారముల్
పాయక భీప్సితార్థము లపారముగాఁ బడయంగ; నేఁ బశు
ప్రాయుఁడ నైతిఁ గావున శుభస్థితిపొంటె ననున్ వధించి యీ
కాయము దేవి కర్పణముగా బలి వెట్టెదఁగాక భక్తితోన్.

వ. అని తలంచి యట్లు సేయ నిశ్చయించుకొని:— 180

ఆ. వె. కత్తి దూసి శిరము ఖండించుకొన నెత్త
నంత సుప్రసన్న యగుచు దేవి
యెలమి మీఱ నాదునెదుటఁ బ్రత్యక్షమై
యిట్టు లనియెఁ బ్రేమ ముట్టిపడగ. 109

ఉ. సిద్ధుఁడ వైతి వింక విశసించుకొనం బని యేమి వత్స! యా
బుద్ధి విడంగదోయి పరిపూర్ణకటాక్షము నాకుఁ గల్గె నో
యిద్ధచరిత్ర! నీయెడల; నిచ్చట నుందువు నీవు సౌఖ్యసం
బద్ధుఁడ వౌదు సాహసము మాను మసంశయచిత్తవృత్తివై.

క. అని యాదేవి యనుగ్రహ
మున నానతి యొసఁగ నభయమును బడసితి; నం
తన నాకు దివ్యతయుఁ గ
ల్గె, నదిమొదలు సడలె నాఁకలియు దప్పికయున్. 111

క. ఈతెఱఁగున దేవీకరు
ణాతిశయనివృత్తభుక్తినై తద్భదసే
వాతత్పరమతి నుండఁగ
నాతల్లి యొకప్పు డిట్టు లనె నాతోడన్. 112

వ. అది యెట్లనిన:— 113

క. అరయఁ బ్రతిష్ఠానపురీ
వర మతిరుచిరంబు వింటె వత్సా! నీ వి
త్తఱి నచటికిఁ జని లోకో
త్తరమగు నుద్యాన మొకఁడు స్థాపింపు మటన్. 114

ఆ. వె. అమరపురికి నందనారామముంబోలెఁ
దత్పురంబునకును దగిన రుచిర
వన మొకండు నీవు పర్ధిల్లఁజేయఁగా
వలసియుండె; నరుగవలయు నటకు. 115

ఆ. వె. అనుచు నానతిచ్చి యా యమ్మయే యొక్క-
దివ్యబీజ మొసఁగె; దేవియాజ్ఞ
నేను నిటకు వచ్చి యీమహోద్యాన మే
ర్పఱచినాఁడఁ దత్ప్రభావగరిమ. 116

క. కావున నోపావనభూ
దేవతలారా! దయామతిన్ దీనిని నీ
దేవళమును మీరలు స
ద్భావంబున సుస్థిరముగఁ బాలింపఁ దగున్. 117

ఆ. వె. అని వచించి యాతఁ డంతర్హితుం డయ్యె
నఁట; మహాపరిభూ! జనాళి యిట్టు
లుగ్గడించు దీనియుత్పత్తి యని వన
పాలకుండు తెలియఁ బలుకుటయును. 118

క. విని యచ్చో దేవికిఁ గ
ల్గిన కారుణ్యంబుపెంపుఁ గీర్తించుచు నే
నును విస్మయంబు నొందుచుఁ
జనుదెంచితి మరల నాదు సద్మంబునకున్. 119

— సాతవాహనుని కథ —

చ. అనియిటు తచ్చరిత్రము గుణాఢ్యుఁడు సెప్పినఁ గాణభూతియి
ట్లనియె; మహాత్మ! నాకుఁ దెలియంగ వచింపఁగదయ్య సాతవా
హనుఁ డనునట్టి నామ మెటు లాధరణీపతి కయ్యెఁ దత్కథన్
విన నిపు డెంతయేనియును వేడుక గల్గె ననుగ్రహింపవే. 120

వ. అని కాణభూతి యత్యంతవినయానుభూతి యై తన్నుం బ్రా
ర్థింప నంత నా గుణాఢ్యుండు తత్కథావిధానంబు నెఱింగింతు
విను మని యిట్లనియె:— 121

గీ. విమతజనపాళిఁ బ్రాజ్యవిక్రమసమృద్ధి
వంచి పదపుష్కరములపైఁ బ్రాల్చి నిఖిల
ధారిణీమండలము నేలె దక్షుఁ డగుచు
దీపకర్ణి యనంగఁ బృథ్వీవిభుండు. 122

క. ఆ విభునకుఁ బ్రాణాధిక
యై వెలయుచు నుండు సద్గుణాంచితవిలస
త్పావనచరిత్ర, పట్టపు
దేవి యయిన శక్తిమతి పతివ్రత యగుచున్. 123

ఉ. ఆ నళినాయతేక్షణ యొకప్పు నిజేశ్వరుతోడ నొక్క యు
ద్యానవనస్థలిన్ సుఖవిహారము సల్పి ప్రసూనశయ్య మే
నూన రతాంతసుప్తయయి యున్నతఱిన్ వెస మృత్యుమూర్తి
యుంబోని విషోరగం బొకఁడు ముట్టెఁ దదీయ పదాంబుజా
గ్రిమున్. 124

క. ముట్టిన తోడ్తోడన యా
పట్టంపుందేవి తనదు ప్రాణేశ్వరుఁ డి
ట్టట్టనరాని వగం గూ
పెట్టఁగఁ బ్రాణములు విడిచిపెట్టెఁ గటకటా! 125

క. ప్రాణాధిక యైన నిజ
ప్రాణేశ్వరి యట్లు తన్నుఁ బాసి చనఁగ భూ
జాని సతంబును దగ్గత
మానసుఁడై విపులదుఃఖమగ్నుం డగుచున్. 126

క. తన పిదప రాజ్యభారం
బును దాల్పఁగఁ జాలు నొక్క పుత్త్రుఁడు లేకు
న్నను సుమహిత కృతమతియై
పునరుద్వాహంబుఁ దలఁపఁబోవక నియతిన్. 127

గీ. బ్రహ్మచర్యవ్రతంబుఁ జేపట్టి ధర్మ
సరణి నాత్మప్రజారక్ష సలుపుచుండి
వృద్ధుఁడై యొక్కతఱి నిజహృదయమందుఁ
దన యపుత్త్రతఁ దలఁచి చింతగొనఁ దొడఁగె. 128

వ. అంత:- 129

మ. భగవంతుం డగు సిందుశేఖరుఁడు స్వప్నంబందు సాక్షాత్కరిం
చి గుణాఢ్యుం డగు నానృపాలు నెడ సుస్నేహార్ద్రభావం బెల
ర్పఁగ నిట్లానతియిచ్చె నోయి! పృథివీపాలాగ్రగణ్యా! మదిన్
వగవంబోకుము నీయపుత్త్రతఁ దొలంపన్ మార్గము౦జెప్పెదన్,

వ. అది యె ట్లంటేని:- 131

చ. ఒకయెడ నీ వరణ్యమున నొంటిమెయిం జరియించువేళ నం
దొకమృగరాజుమూఁపుపయి నుజ్జ్వలుఁడై విలసిల్లు నొక్కబా
లకుఁ గనుగొందు; వాతనిబలంబునఁ గైకొని తెచ్చుకొమ్ము; పు
త్త్రికుఁడగునీకు వాఁడెనిజరాజ్యరమావిభవంబుఁ దాల్పఁగన్.

క. అనవుడు భూమీశుఁడు మే
ల్కని తన సుస్వప్నమును దలంచుచు హృదయం
బు నితాంతమోదవారా
శి నిమగ్నముగాఁగ నుల్లసిల్లుచు నుండెన్. 133

చ. పదపడి యొక్కనాఁ డలనృపాలుఁడు వేఁటతమిన్ మృగవ్రజా
స్పదమగు దూరదేశ వనభాగము సొచ్చి కనెన్ మృగేంద్రవా
హు దినకరాభు బాలకు సముజ్జ్వలరూపవిలాస భాసమా
ను దివసమధ్యవేళ నొక నూతన పద్మసరస్తటంబునన్. 134

వ. కని యమ్మహీశ్వరుండు, తొల్లి తనకు స్వప్నంబున గౌరీశ్వ
రుండు సెప్పిన వచనంబులు తలంచుకొని యధిజ్యకార్ము
కుండై, యమ్మృగేంద్రుండు తన్నధిష్ఠించి యున్న పిన్న
వానిం దత్సరోవరతీరంబునదింపి జలపానాభిలాషం దత్కమ
లాకరంబుఁ జేరంజను సమయంబున. 135

ఆ.వె. వింట నొక నిశాతవిశిఖంబు సంధించి
దృష్టిముట్టి లఘుతఁ దివిచి మృగవి

భువి శరీర ముచ్చిపో నేసెఁ దత్ప్రాణ
ములు నిమేషమాత్రమునఁ దొలంగ. 136

గీ. అంత నా హరి సింహదేహంబు విడిచి
తత్క్షణమ పూరుషాకృతిఁ దాల్చి నిలిచె
నక్కటా! యేమి యిది సెప్పు మని మహీశుఁ
డడుగుటయు నాతఁ డిట్టులు నుడువఁ దొడఁగె. 137

చ. జనపతివర్య! నీమది విచారము నొందఁగఁ బోకు మయ్య! నే
ధనదసఖుండ యక్షకులతల్లజుఁడన్? మఱి సాతనామకం
బునఁ దగువాఁడఁ దొల్లి ఋషిపుంగవకన్యక యొార్తు గంగమ
జ్జన మొనరించువేళఁ గని జాతమనోభవవృత్తి నొటయున్.

గీ. అదియు నను జూచి మన్మథాయత్త యయ్యె
నంత గాంధర్వవిధిని నే నాలతాంగిఁ
బరిణయంబైతి; నపుడు తద్బంధుజనులు
తెలిసి మమ్మిర్వురను గోపతీవ్రు లగుచు. 139

వ. స్వేచ్ఛాచారులై మీ రిద్దఱుం బాపాత్ములైతిరి; న కావు
సింహంబు లయ్యెదరుగాత మని శపించి దాని శాపాంతంబు
పుత్రజన్మావధికంబుగను,మదీయశాపావసానంబు త్వచ్ఛరా
ఘాతావధికంబుగను విధించియున్నవారు. 140

గీ. పదపడి మహామునీంద్రశాపప్రభావ
వశత మేమును సింహదంపతుల మగుచుఁ

బుడమిఁ జరియించుచుండఁగాఁ గడచెఁ గొంత
కాల; మవ్వేల దానికి గర్భ మయ్యె. 141

వ. తద్గర్భంబున నీ యర్భకుండు వొడముటయు నది శాపావసా
నంబు నొంది చనియె; నయ్యనంతరంబున. 142

గీ. అన్యసింహీపయఃపాన మభ్యసింపఁ
జేసి యీబాలు నే నింతచేసినాఁడ
నాకు నిపుడు శాపావసానంబు గలిగె
నధిప ! నీ యమ్మునకు గుఱి యైనకతన. 143

క. నీ వీ దారకుఁ గైకొని
భూవర ! నిజపుత్త్రబుద్ధిఁ బోషింపుము వీఁ
డీవసుధ మహాసత్త్వుం
డై వెలసి త్వదీయరాజ్య మనుశాసించున్. 144

గీ. శాపకాలంబునందుఁ దత్సంయములును
నిల్లె యీ యర్థమున్ నిర్ణయించి చెప్పి
రని వచించి యంతర్హితుం డయ్యె సాత
నామకుం; డంత నా ధరానాథుఁ డెలమి. 145

ఉ. పెన్నిధిఁ జెంతఁగన్న నిరుపేదయుఁబోలె మహాప్రమోద సం
పన్నతఁ దత్కుమారకు స్వభావమనోహరదివ్యరూపు న
త్యున్నతభాగ్యలక్షణసముజ్జ్వలుఁ జేకొని యాత్మరాజ్యల
క్ష్మీన్నెలకొల్ప నాదరువు సిక్కెఁగదాయని వేడ్కఁజెందుచున్.

గీ. నిజపురంబున కేఁగి వానికిఁ బ్రియమున
సాతుఁడు వహించుటంజేసి సాతవాహుఁ
డనుచుఁ బేరిడి కూర్మితోఁ బెనిచి పెద్దఁ
జేసి యత్యంతసంతృప్తచిత్తవృత్తి. 147

క. తన నిఖిలరాజ్యమున తా
తనిఁ బట్టముఁగట్టి తాను దప మొనరింపన్
వనభూమికిఁ జనె నాతఁడు
వినివృత్త సమస్తసౌఖ్యవిషయుం డగుచున్. 148

ఆ.వె. అట్లు దీపకర్ణి యాముష్మికసుఖార్థి
యగుచుఁ దపముపొంటె నరుగుటయును
సాతవాహనుండు సకలరాజ్యమునకు
సార్వభౌముఁ డై యెసంగుచుండె. 149

ఆ.వె. అనుచుఁ గాణభూతి యనురోధవశమున
నతఁడు నీ కథ నిటు నొడివి ప్రకృత
మనుసరించి యా గుణాఢ్యవిద్వద్వరే
ణ్యుండు మరల నిట్టు లుగ్గడించె. 150

చ. పదపడి సాతవాహననృపాలుఁ డొకప్డు వసంతవేళ న
భ్యుదితమనఃప్రమోదుఁడయి యుత్సుకతన్ విహరింపఁ గోరి యి
ష్టదయిత లెల్లఱుం గొలువఁ జారువిలాసవిశేషసంపదన్
బొదలుచుఁ దన్మనోజ్ఞ వనభూమికి నేఁగి తదంతరంబునన్.

క. బృందారకవల్లభుఁ డల
నందననామకవనంబునంబలెఁ బరమా
నందంబున సుచిరము నిజ
సుందరులం గూడి ముదముఁ జూఱలుగొనుచున్. 152

వ. అభీష్టవిహారంబులం గొంతప్రొద్దుగడపి యవ్వల జలక్రీడా
ర్థంబు కామినీసఖుండై కేళివాపికావతరణం బొనరించి:-153

చ. కిలకిల నవ్వుచుం బ్రియసఖీజనమండలిఁ గేళిదీర్ఘికా
జలముల నోలలార్చుచు వశావరివేష్టితుఁడౌ గజేంద్రుఁడుం
బలె నిజవల్లభావితతిమధ్యమునన్ జలకేళిఁ జల్పె నె
చ్చెలువలు దన్నుహస్తసరసీరుహవారుల ముంచియెత్తగాన్.

వ. అట్టియవసరంబున:— 155

సీ. కొలఁకునం గల క్రొత్త వెలిదమ్మి పూవులఁ
గలసి వేర్పడని మోములఁ దనర్చి
జలసేక ధౌత కజ్జలములై కెంపారి
వెలసెడు వెడఁద కన్నుల నెనంగి
తడిసి మైనంటిన మడువులనుండి వ్య
క్తంబులౌ సకలాంగకములఁ దనరి
సరసియందు నవీనశైవాలవిభ్రాంతి
సలిపెడు కేశపాశములఁ బొలిచి

గీ. సాతవాహనమేదినీశ్వరుని సతులు
నవ్యసౌందర్యసువిలసనంబు గలిగి

కుసుమసాయకు వెడవింటికోల లనఁగ
నాత్మవిభు మానసముఁ గొల్లలాడి రంత. 156

గీ. పవనుఁడు నవీనలతికలంబలె నతండుఁ
దనసతుల వనమధ్యగతల విగళిత
పత్త్రితిలకలుగాఁ జ్యుతాభరణపుష్ప
సముదయులునుగా నొనరించెఁ బ్రమద మెసఁగ. 157

చ. అపుడు నృపాలకామినులయం దల పట్టపురాజ్ఞి సూక్ష్మ మ
ధ్య పటుపయోధరాధికభరాలస నూత్నశిరీషకోమలాం
గి పెలుచ నాడి తత్సలిలకేళిఁ గడుంగడు డయ్యఁగా, విలా
సపరతె రాజు నామెపయిఁ జల్లఁదొడంగె జలంబుఁ బెల్లుగాన్.

గీ. వల్లభుం డల్లు వంతంబుపట్టి తన్ను
నుదకములఁజల్లి యలయింప నోవలేక
"యధిప! మాం మోదకైః స్తాడయ" యని యామె
పతిని బ్రార్థించె సంస్కృతభాషణముల. 159

గీ. అది వినియు రాజు తత్ప్రకృతార్థసరణి
నెఱుఁగఁజాలక యుండ్రింబు లిన్నియటకు
రయమువిూఱంగఁ దెప్పించె రాణి యవ్వి
కాంచి వికవిక నవ్వుచుఁ గాంతుఁ జూచి. 160

చ. అవసర మేమి యిప్డు వసుధాధిప! యీజలకేళివేళ? ని
య్యవి నానితేరఁబంపు మనియా నినుఁగోరితిఁ? గేళి డస్సి, చ

క్క విడుము నన్నునింక నుదకంబులఁగొట్టకు మంటిఁగాని సి
గ్గు విడిచి యుంద్రకముల్ దివిచికొట్టుము నన్నని కోరికొంటినే.

వ. మాశబ్దోదక శబ్దంబుల సంధిమాత్రింబేనియుం బరిగణింప
వైతి; వది యట్లుండెఁ బ్రకరణవశంబున నైనఁ దెలిసి గుఱు
తింపవలదే; నీ కింత తెలియమి యెట్లు లయ్యె; నని శబ్ద
శాస్త్రవేదిని యైన యారాజ్ఞి రాజుం బరిహాసంబు సేయు
టయు నది విని యచ్చటి పరిజనంబు లెల్లం దమలోనం
దాము నవ్వుకొనుచుండ నా ధరణీశ్వరుండు పరమ లజ్జా
కాంతుం డై. 162

మ. సలిలక్రీడఁ బరిత్యజించి విగతోత్సాహంబుతో నన్యముం
దలఁపంబోనక తత్క్షణంబ తనపైఁ దానే రుషం జెందుచున్
జెలులన్ వీడి నిజానమానభవదుశ్చింతాతిరేకంబు వె
గ్గలమై నొంపఁగ మందిరంబునకు వేగంబోయి తానయ్యెడన్.

సీ. ఆత్మపత్నీకృతం బగు పరాభవ మాత్మఁ
దలపోసి మాటికిఁ దల్లడిలుచు
మేలి పుట్టంబుల మెయి నూడ్చి యాఁకటి
తటి భోజన మొనర్పఁ దలఁపఁబోక
పలుకరించినఁ జిత్రపాంచాలికయుఁ బోలె
నేమేని యుత్తరం బీయ నుడిగి
రాజకార్యవిశేషరతి వీడి యితరు లే
మ్మాట సెప్పిన నుంతపాటిగొనక

గీ. మృత్యు వొండెఁ బ్రశస్తపాండిత్య మొండెఁ
దనకు శరణం బటంచుఁ జిత్తమున నెంచి
తల్పమున మేను చేరిచి ధైర్య మెడలి
మిగులఁ బరితాపభరమునఁ బొగులుచుండఁగా 164

క. ఈతెఱఁగున నప్పుడా ధా
త్రీతలనాథుం డపూర్వరీతిఁ జరింపన్
జాతమహాసంభ్రమసము
పేతం బై పరిజనంబు బెగడం జొచ్చెన్. 165

ఆ.గీ. అంతఁ బెద్దమంత్రియగు శర్వవర్మయు
నేను నృపు నవస్థ నెఱిఁగి తెలిసి
యాదినంబుఁ గడపి యమ్మఱునాఁడును
నాతఁ డట్లె యుంట యాలకించి. 166

గీ. నగరికే మిరువ్వరము నేఁగి తగ మహీశు
చేటుఁ డగు రాజహంసుని జేరి నృపతి
దేహసౌఖ్యవిశేషముల్ తెలియ నడుగ
వాఁడు మా కిట్లు సెప్పె నెవ్వగ జనింప. 167

వ. అది యెట్లనిన 168

క. ఏ మనుచు విన్నవింతు మ
హామాత్యవరేణ్యులార! యవనీశుఁడు ము
న్నీమాడ్కి నెన్నఁడును జిం
తామగ్నమనస్కుఁ డగు విధము నే నెఱుఁగన్. 169

ఆ.వె. విష్ణుశక్తికూఁతు వెలుఁగు పాండిత్యంబు
కతన నింత గొడవ గలిగె ననుచుఁ
గోప నిర్భరముగ గొణుఁగుచు నున్నార
లితరరాజు లద్ది యేమొ కాని. 170

వ. అని యిట్లు రాజహంసుండు చెప్పిన వాని వచనములు విని
సంశయాక్రాంతమనస్కుండ నై శర్వవర్మ ద్వితీయుండుగా
నిట్లు వితర్కించితి. 171

సీ. నృపతికి నిది వ్యాధియేని వైద్యులఁ బిల్తు
రట్లు గా కిది మనోవ్యాధియేని
దానికి నైన నిత్తఱి నూహసేయుచోఁ
గారణం బేదియుఁ గానరాదు
నిజరాజ్య మఖిలంబు నిహతకంటక మౌట
నహితప్రసంగంబు లైన లేవు
ప్రజలెల్ల ననురక్తభావు లై యున్నారు
హాని యొం డేదియుం గానఁబడద

గీ. యీదృశస్థితి నలరారు నీమహాను
భావ్వరున కిప్పు డీఖేద మెట్లు గలిగె
నింత యాకస్మికంబుగా నిది యెఱుంగ
రాకయున్నది యేమి చిత్రంబొ కాని. 172

క. అని యిట్లు పెక్కు తెఱఁగుల
మనుజేశ్వరుఁ గూర్చి నేను మంతనమునఁ జిం

తనమునకుఁ గడఁగ మతిమ
ద్ఘనుఁ డగు నా శర్వవర్మ తగ ని ట్లనియెన్. 173

క. ఎఱుఁగుదు నే నీతని వగ
తెఱఁ గది మౌర్ఖ్యానుతాపతీవ్రత మది నే
డ్తెఱసూపఁ బొడమె; దీనికి
వెఱవఁగఁ బనిలేదు వినుము విమలవిచారా! 174

గీ. తాను మూర్ఖుండ ననుచు నీతఁడు సతమ్ముఁ
బండితత్వంబు నెట్టులైనఁ బడయఁగోరు
నితని యీ యాశయము తొల్లియే యెఱుంగఁ
బడియెఁ; బలుమాఱుఁ బ్రస్తావభంగి నాకు. 175

వ. అది యట్లుండ నిపుడు విష్ణుశక్తి కుమారిక యైన పట్టంపుదేవి తన పాండిత్యంబుకతంబున నేదేని యుపహాస్యం బొనర్చె ననియును వినవచ్చెం గావున దీనింబట్టి విచారింప నీతండు దప్పక తన మౌఢ్యదోషంబునకే దురపిల్లుచున్నవాఁ డనుట నిక్కంబు:— 176

గీ. అనుడు నది యట్లకా నిశ్చయం బొనర్చి
శర్వవర్మయు నేనును సదనములకు
నరిగి యారాత్రిఁ గడపి యహర్ముఖమున
వెడలితిమి వెండియును రాజవేశ్మమునకు. 177

వ. అప్పు డయ్యెడ నెల్లవారలకు నంతఃప్రవేశంబు నిరుద్ధం బై యుండె; నేను నెట్టులెట్టులో లోనికిఁ బ్రవేశించుటయు నా

వెంబడిన శర్వవర్మయుం జనుదెంచె; నిట్లు నేను లోనికిం
జని రాజసందర్శనం బొనర్చి యొక్కచో నుపవిష్టుండనై
కొంతవడి కతనితో నిట్లంటి:—. 178

క. దేవా! దేవర సకల
శ్రీవిభవాతిశయయుక్తిచే వెలసియు నీ
వీ విధమునఁ గారణ స
ద్భావము లేకయ కలంతపడ నేమిటికిన్. 179

క. అని యడిగిన మద్వచనము
వినియును విననట్లు మనుజవిభుఁ డూరకయుం
డ నపుడు మహాద్భుతముఁ దోఁ
ప నిట్టులు వచియించె శర్వవర్మ యతనితోన్. 180

వ. దేవా! తొల్లి నీ వొక్కతఱి నాకుఁ బాండిత్యం బెన్నఁడేని
యబ్బునే యని యడిగియున్నవాఁడ వందులకై నేను గత
నిశాసమయంబున స్వప్నమాణవకం బొనర్చి:— 181

గీ. అంతఁ గలలోనఁ గనుఁగొంటి నాకసమున
నుండి జాఱిన యొక నూత్నపుండరీక;
మదియు వికసిత మయ్యె దివ్యాంశజుఁ డగు
నొక కుమారునిచే నంతఁ బ్రికటితముగ. 182

క. ఒక దివ్యాంగన ధవళాం
శుకధర యై ప్రేమరసము జొప్పిల్లఁగఁ ద

ద్వికసిత కమలము విడి తా
వక ముఖకమలమునఁ జొచ్చె వసుధాధీశా! 183

గీ. అంత నేనుం బ్రబుద్ధుండ నైతి; స్వప్న
మందుఁ దోఁచిన యా ధవళాంబరధర
శారదా దేవి; యామె సాక్షాత్కరించి
దేవరముఖమ్ముఁ జేరె సందియము లేదు. 184

ఆ.గీ. అనుచు శర్వవర్మ యత్యద్భుతంబుగాఁ
దనదు కల తెఱంగు వినుచుటయును
దత్క్షణంబ మౌనధారణముం బాసి
నన్నుఁ గాంచి భూమినాయకుండు. 185

వ. సాకూతంబుగా నిట్లనియె:— 186

ఆ.గీ. బుధవరేణ్య! యొక్క పూరుషుం డెంత కా
లంబు యుక్తశిక్షణంబు వడసి
పడయఁగలుగు మంచి పాండితీవిభవంబు?
నది యెఱుంగఁ జెప్పుమయ్య యిపుడు. 187

ఉ. పాండితి లేమి నాకుఁ గల భాగ్య మొకించుకయేని వన్నెఁ దే
కుండెను; గొయ్యబొమ్మ మెడ నున్న విభూషణరాజివోలె; న
వ్వండు గణించు మూర్ఖునకు వైభవమున్నను; విద్యలేక యె
న్నండును బెంపుఁబేర్మియుఁ గనంబడఁబోవదుగాదె యేరికిన్.

సీ. అనవుడు నే నిట్టు లంటి నో రాజేంద్ర!
వినుము చెప్పెద సర్వవిద్యలకును

వ్యాకరణంబు ముఖ్యము; దాని నిర్విఘ్న
మగ నభ్యసింపంగఁ బూనువెడలఁ
బదియు రెండేడులుఁ బట్టు నెల్లరకు; సా
మాన్యంబుగాఁ జెప్పుమాట లివ్వి;
దేవర, పఠియింపఁ దివురుచో నే నాఱు
వత్సరంబులకె నేర్పఁగలవాఁడ

ఆ.వె ననిన శర్వవర్మ యగ్గల మగు నీర్ష్య
యడర "సౌఖ్యములకు నర్హులైన
వార లంతకాల మేరీతిఁ గష్టించి
నేర్వఁగల" ర దేటి నెఱతనంబు ? 189

క. పరమ సుఖోచితుఁ డగు భూ
వరుఁడెటు యాఱేండ్లు గష్టపడి యెట్లో వ్యా
కరణంబు నేర్చునటె యిది
పరిహాసాస్పదముగాక భావ్యం బగునే ?. 190

వ. అని పలికి మఱియు రాజు నుద్దేశించి యిట్లనియె:— 191

ఆ. వె. అట్లు నీవు రాజు నాఱుమాసములలో
నఖిల శబ్దశాస్త్ర మభ్యసింపఁ
జేయఁజాల నట్లు సేయనేర్చెదవేని
పలుకుచుంటి నాదుప్రతిన వినుము. 192

క. ఆఱేండ్లేటికి ? నే నో
భూరమణా ! యాఱుమాసముల కది యెల్లన్

నేరుపును నీకు నాదగు
నేరుపుఁ గనుఁగొందుగాక నీ విద్యోడలన్. 193

గీ. అని యసంభావ్యముగ నతఁ డట్లు పలుక
విని యలుక సెంది శర్వవర్మను గనుఁగొని
యేను నిట్లంటి విను మిది యేటిమాట
లూరక యసంగతములేల యుగ్గడింప ? 194

వ. మున్ను నేను బాల్యంబునుండియుఁ గష్టించి యభ్యసించిన సంస్కృత ప్రాకృత దేశభాషల మూఁడింటి నింతటినుండి సంపూర్ణంబుగాఁ బరిత్యజించి వైచువాఁడ నీ వట్లు సేయఁజాలనినా డేమియొనర్పఁ గలవాఁడ వని యడుగుటయు నంత నతండు నా కిట్లనియె:— 195

చ. విను మిదె నాప్రతిజ్ఞ పృథివీపతి నట్లు సమస్త శబ్దశా
స్త్రనిపుణుఁ జేయలేనియెడ సర్వజనంబు నెఱుంగ నీకు నేఁ
బ్రణతుఁడ నై భవచ్చరణపాదుకలన్ శిరమందుఁ దాల్చి నీ
యనుమతిమోయువాఁడ ననయంబునుపీడక ద్వాదశాబ్దముల్.

క. అని ప్రతినఁ జేసి యాతఁడు
సనుటయు నేనును మదీయసదనంబునకున్
జనినాఁడ; నట్లు లైనను
దన కోరిక తీరు ననుచు ధరణీవిభుఁడున్. 197

గీ. మానసము నేర్చుచున్న యుమ్మలిక యుడిగి
శర్వవర్మ ప్రతిజ్ఞావచనము లాత్మఁ

దలఁచి మెచ్చుచు మోదంబు మొలకలెత్త
స్వస్థుఁడై యుండెఁ దొల్లింటివరణి నంత. 198

వ. ఆ శర్వవర్మయు నట్లు నిజగృహంబునకుం జని:— 199

క. తన కావించిన యట్టి ప్రతి
తిన దుష్కర మగుట యెంచి దిగు లొందె నిజాం
గన కావృత్తాం తంబును
వినిచి యతఁడు సానుతాపవిస్మయుం డయ్యెన్. 200

వ. అట్టి యా సమయంబున:— 201

ఉ. ఆతని ధర్మపత్ని సుగుణాంచిత తత్ప్రతి దుష్ప్రతిజ్ఞకుం
జేతమునందు బిట్టు వగఁ జెందుచు "నో హృదయేశ! యేమి తె
ర్వే తలఁతే? షణ్ముఖుం డొకరుఁడే గతిగాక మ ఱెవ్వ రింక ని
ర్హేతుకజాయమానకృప నీ డగరంబు దొలంచి కావఁగన్.

క. నా మనవి వినుము భక్తుల
కామము లొడఁగూర్ప నతఁడె కా దక్షుం డీ
భూమి నిపు డా కుమార
స్వామియె మనపాలి పారిజాతము సుమ్మా. 203

క. కావున నీ వీయెడ నా
దేవుని బరిపూర్ణవిమల దృఢతరభక్తిన్
సేవింపవలయు నాతఁడ
కావించున్ మనకు సకలకార్యములుఁ గృపన్. 204

వ. అనిన విని యప్పు డా శర్వవర్మయును:— 205

చ. తన సతి యట్లు పల్కిన హితప్రతిపాదక భవ్య వాక్యముల్
మనమున నెంచి తద్వచనమార్గమునం జరియింపఁ బూని తా
ననశనవృత్తిఁ జేకొని సమాహిత చిత్తత నాఁటి వేకువన్
జనియెఁ గుమారపాదజలజంబుల భక్తి భజింపఁ గోరుచున్.

ఆ.గీ. అంతఁ దెల్లవాఱ నది యెల్ల వేగుల
వలన నే నెఱింగి వసుమతీశు
తోడఁ జెప్ప నతఁడు తొడరి యియ్యది తుద
కేమి యగునొ యనుచు నెంచుచుండె. 207

వ. అప్పుడు తన్మహీశ్వరునకు హితుండగు సింహగుప్తుం డను
రాజపుత్త్రుం డతనితో నిట్లనియె:— 208

క. జననాయక ! నే నొడివెడు
మనవి యొకఁడు గలదు; వినుము మన్నించి; యదే
మన, నీవు మొన్న ఖిన్నతఁ
గని యేమియుఁ దోఁపకుండఁగా నున్నతఱిన్. 209

క. ఏలిక విచారముం గనఁ
జాలక నే నెంతయును విషాదముఁ గని నీ
మేలున కై పురివెలుపలి
కాళిక గుడి కేఁగి భక్తిగౌరవయుక్తిన్. 210

గీ. అమ్మహాదేవి దివ్యపాదారవింద
సన్నిధి మదీయ శీర్షంబుఁ జక్కఁ ద్రుంచి

బలియొసఁగఁ బోవుచుండ నంబరపథమున
నొక్క యశరీరవాణి యిట్లుద్భవించె. 211

వ. అది యెట్లనిన:— 212

ఆ.వె. "వలదు! సాహసంబు వలదు! కుమారకా!
యుడుగుమోయి! నీకు పుడమిఱేని
కభిమతార్థసిద్ధి యగు; నాతఁ డిఁకఁ జింతఁ
దొలఁగి మోదగరిమ వెలయఁగలఁడు. 213

చ. అని యశరీరవాణి నను నప్పనినుండి మరల్చి పంచెఁ; గా
వున భవదీప్సితంబు నృపపుంగవ! తప్పక సిద్ధిఁ జెందు; నె
మ్మనమున నింక సందియముమాను మటంచునచించి సమ్మదం
బున ధరణీశు నాజ్ఞఁ గొని పోయి పదంపడి సింహగుప్తుఁడున్.

ఆ.గీ. శర్వవర్మ చనిన చక్కి కిర్వురు గూఢ
చారులను రహస్యసరణిఁ బంచె
నతని వర్తనంబు నరసివచ్చి నచింప
నాజ్ఞ యొసఁగి; యదియు నట్టులుండ. 215

వ. శర్వవర్మయు నట్లు వేకువజామునఁ బురంబు విడిచి బయలు
వెడలి:— 216

క. పవనైకభక్షుఁ డగుచుఁ దిరి
భువనగురుం గార్తికేయు బుద్ధి నిలిపి మౌ
న విధిం గైకొని యాతని
నవిధంబున కరిగెఁ దపముసలుపఁ గ్రమముగాన్. 217

వ. ఇట్లరిగి యచ్చట:— 218

ఉ. పేరిమి మై శరీరనిరపేక్ష మహాతప మాచరించి యా
తారక దైత్యమర్దను ముదంపడఁ జేసి తదీయ సత్కృపా
పూరపరిప్లుతుం డగుచుఁ బూర్ణమనోరథసిద్ధిఁ గాంచెఁ దాఁ
గోరినమాడ్కి నాతఁ డనుకూలముచేసి యనుగ్రహింపఁగన్.

ఆ.వె. అంత సింహగుప్తుఁ డనిపిన చారులు
శర్వవర్మ కార్యసాధనంబు
నెఱిఁగి వచ్చి రాజునెదుట నివేదించి
రుదితపూర్ణ హర్ష హృదయు లగుచు. 220

ఆ.వె అది వినంగ నాకు నవనీశ్వరునకును
వగపు సంతసంబు మిగిలెఁ గ్రిమత
నభినవాంబుదాగమావలోకనమున
హంసచాతకముల కట్టు లడరి. 221

చ. అవలఁ గుమారలబ్ధవరుఁ డౌచు మహామతి శర్వవర్మ భూ
ధవు కడ కేఁగుదెంచి ప్రమదంబున సంస్మరియించినంతమా
త్ర వెలయఁగా నుపస్థితికి రా నరుదారఁగ నెల్లవిద్యలున్
వివరముగా వచించెఁ; బృథివీపతి కయ్యవి తత్క్షణంబునన్.

క. పాదుకొని యతని మనసునఁ
బ్రాదుర్భావంబు నొందెఁ; బరమేశకృపా
మేదురులగు వారల కిల
నేది యలభ్యమగు, విద్యలే యననేలా ? 223

228

మ. అవనీనాయకు( డట్లు తా నఖిలవిద్యాలాభసంశోభి యౌ
టవినన్ వచ్చినతోడనే యతనిరాష్ట్రం బంతయుం బూర్ణహ
ర్ష విశేషంబయి యెంతయేనియు మహార్భాటంబు మీఱన్
మహాత్సవముల్ పెక్కు నరింపఁగాఁ దొడఁగె నుద్య
ద్వైభవాభ్యున్నతిన్. 224

వ. అట్టి యమ్మహోత్సవావసరంబునఁ దత్పురీవరమునందు:—

చ. ప్రతినిలయాగ్రభాగమును భాసిలె బద్ధవిశుద్ధకేతన
ప్రతతి మనోజ్ఞగంధవహబాలకచాలితమై, నృపాలపాం
డితి కలరారి కీర్తులు దివిగఁ ద్రిప్పుచు వేడ్క మీఱ నం
చితగతినాట్యవిభ్రమముఁ జేయుచునున్న తెఱంగుదోఁపఁగన్.

వ. మఱియు నా సమయంబున:— 227

మ. అతిభక్తిన్ ధరణీశుఁ డా గురుని రాజార్హోరుమాణిక్య సం
తతులన్ హేమమయోజ్జ్వలాభరణనూత్నస్వర్ణవస్త్రాదిక
ప్రతతిన్ సత్కృతుఁజేసి గౌరవముమీఱన్ దత్పదద్వంద్వసం
గతరత్నాంచితమౌళి యై బహునమస్కారంబులంజేయుచున్.

క. ధర నర్మదాస్రవంతీ
పరిసరమున వెలయుచుండు భరుకచ్ఛము నాఁ
బరఁగెడు దేశమునకు ని
బ్బరముగ సద్గురునిఁ బట్టభద్రుఁ నొనర్చెన్. 229

వ. మఱియును:— 230

శా. ఆపుత్రుండై తనదూతలం బనిచి యొయ్యన్ షణ్ముఖానుగ్రహ
ప్రాప్తిం దోల్తనెఱుంగఁ జేసి కడు నెయ్యంబొప్ప శ్రేయఃఫలా
వాప్తిం గోరెడు సింహగుప్తు నిజరాజ్యార్థాధిపుం జేసి సం
ప్రాప్తామోదునొనర్చె నాత్మసమదివ్యైశ్వర్యయుక్తుండుగాన్,

వ. అదియునుం గాక:— 232

మ. నిజవిద్యాగమకారణం బయిన రాజ్ఞీరత్నమున్ విష్ణుశ
క్తిజనాధీశ తనూజ నప్పు డనురక్తిన్ దన్నిజాంతఃపురీ
రజనీనాథ ముఖీజనంబునకు నగ్రస్థాయినిం జేసి వే
డ్కజనింపం దనయంతఁ దానె యభిషిక్తం జేసె దేవేరిగాన్.

శ్రీ శ్రీ శ్రీ

కథాపీఠ లంబకమున

షష్ఠ తరంగము

సమాప్తము.



ఓమ్!

# ఆంధ్ర కథాసరిత్సాగరము.

కథాపీఠలంబకము. ౧

———:o:———

## సప్తమ తరంగము.

---

వ. అయ్యనంతర కథావిధానం బెట్టిదనిన? 1

గీ. శర్వవర్మ నిజప్రతిజ్ఞాప్రకార
మట్టు లాఱేవి మాసమట్యాంతరమున
యందె నిఖిల విద్యావేది యగువిధమునఁ
జేయఁ గలిగిన కతన నేఁ జిన్నవోయి. 2

వ. అమ్మహామాత్యున కోడినవాఁడ నగుటంజేసి మదీయ ప్రతి
జ్ఞానుసారంబుగా భాషాత్రయంబును వీడవలసినవాఁడ నైతి;
నట్లు పరిత్యక్తభాషాత్రయుండ నై మౌనంబు వహించి
యే నొక్కనమయంబున నా ధరణీజానిసమక్షంబున కరిగి
యున్నవాఁడ; నంత నక్కడః— 3

గీ. క్షితిసురుఁ డొకండు తాను రచించిన యొక
పద్యము పఠించె నమ్మహీపతి వినంగ

నపు డతఁడు షణ్ముఖానుగ్రహోత్త విద్యుఁ
డగుచునకతమున నద్దాని యర్థ మెఱిఁగె. 4

క. చతురతమై సురుచిర సం
స్కృతవాగ్వైభవము వేడ్క సేయ, నచటి వం
డితపామర జనములు విని
యతిహర్షము నొంద దాని కర్థము నొడివెన్. 5

వ. ఇవ్విధంబున నా సాతవాహన మహీవల్లభుండు నిజవిద్యా
జ్ఞానప్రత్యయంబు వడసి మహానందంబున శర్వవర్మం గనుం
గొని సవినయంబుగా నతని కిట్లనియె:— 6

క. స్వామీ! నీవు కుమార
స్వామి నెటులు గొలిచి యతనినత్కృప వడయన్
సామర్థ్యము నొందితి? వది
నీ ముఖమున వినఁగ వేడ్క నెగడుచు నుండెన్. 7

క. కరుణించి, మహాత్మా! వి
స్తరముగ నా కది వచించి సమ్మోదము మే
దురముగఁ జేయంగదె యని
కర మర్థించుటయు భూమికాంతుం డలరన్. 8

వ. శర్వవర్మ యతని కిట్లనియె:— 9

గీ. వినుము రాజేంద్ర! యిచ్చోటు విడిచి యేను
మౌనము వహించి భోజనపానములను

విడిచి షణ్ముఖతీర్థమ్ము కడకుఁ జనెదు
వేడ్క నెమ్మదిఁ బురికొన వెడలినాఁడ 10

సీ. అది మీరు నెఱిఁగినయదియ కాదే? పదం
పడి దూరమార్గంబు నడచి, యింక
నించుక దవ్వు శేషించియుండఁగఁ, దపః
కృశుఁడ, నిరాహారదశుఁడ నగుట
గమనపరిశ్రాంతి గడలుకొ నవశుండ
నయి సొమ్మసిలి నిస్పృహత్వ మొంది
యొడ లెఱుంగక యొక్క యెడ మూర్ఛితుండ నై
పుడమిపైఁ బడి ధూళి బ్రుంగియుంటి
గీ. నంత శక్తిహస్తుఁ డై యొక్క దివ్యపూ
రుషుఁడు నాకు దృష్టివిషయమగుచు
వత్స! లెమ్ము; నీకు వాంఛితార్థము లెల్ల
సిద్ధిఁబొందు నని వచించుటయును. 11

గీ. అతని యా ప్రియవచనంబు లాలకించి
యమృతవృష్టిసంసిక్తుఁడ నైనమాడ్కి
నెఱుకఁ గని క్షుత్పిపాసాదు లెడలిపోవ
స్వాస్థ్యముం గన్నవడువున శక్తి వడసి. 12

సీ. సర్వేశ్వరుం డైన షణ్ముఖదేవుని
సన్నిధానమునకుఁ జక్క నరిగి

భక్తిసంభ్రమపూర్ణభావుండనై స్నాన
మొనరించి పరిశుద్ధి నొంది యతని
గర్భాలయమునకు గ్రక్కున నే నేఁగ
నందు విరాజిల్లు స్కందమూర్తి
యనురక్తి నాకు దర్శన మిచ్చుటయు నంత
శారదయును సుప్రసన్నయగుచు

గీ. వచ్చి మూర్తిమతి యయి నా వదనమందుఁ
జొచ్చె నే నబ్బురంపడి చూచుచుండ
నపుడు భగవంతుఁ డగు నా షడాననుండు
పరమకరుణాతరంగితభావుఁ డగుచు. 13

క. నిజసుప్రసన్నవదనాం
బుజషట్కంబునను దెల్లముగ వ్యాకృతినం
సృజనంబునకుఁ గడఁగి, య
క్కజముగ నే వినుచు నుండఁగాఁ దొలుదొలుతన్. 14

వ. "సిద్ధో వర్ణసమామ్నాయ" యని యొక్కసూత్రంబు నుచ్చరించుటయు, నది విని మనుష్యజాతిసులభం బైన చాపలంబునం జేసి యక్కటా! నాయంత నే నుత్తరసూత్రంబు నూహించి పలికితి; నంత నా దేవదేవుం డిట్లనియె:-

క. ఔరా! కుమార! నీ వి
ట్లోరిమి విడి చాపలమున నుత్తరసూత్ర

ప్రారంభము సేయునియెడ
ధారిణి నీ శాస్త్రమే ప్రధానం బగుచున్. 16

వ. పాణినీయశబ్దశాస్త్రంబు నడఁగం ద్రొక్కెడిది; యిప్పు
డట్లుగాక యిది నీ వేగిరపాటునం జేసి స్వల్పతంత్రం బయ్యెం
గావునఁ గాతంత్రంబు నాఁ బరఁగు; నిదియునుంగాక మదీయ
వాహనం బైనకలాపంబు పేరఁ గాలాపం బనియును బేర్కొ
నంబడుచుండు నని చెప్పి నవీనం బైనయాశబ్దశాస్త్రంబు
నాకుఁ బ్రకాశంబొనర్చి వెండియు నిట్లనియె:— 17

క. మీరాజు సాతవాహన
భూరమణుఁడు పూర్వజన్మమునయం దొక వి
స్ఫారతపోనిధి యగుఋషి
యై రాజిలుచుండువాఁ డనన్యసదృశతన. 18

గీ. అప్పు డాతఁడు కృష్ణాహ్వయమునఁ బరఁగి
తనకు నియతేంద్రియుఁడు భరద్వాజమౌని
గురువుగా ధర్మతత్త్వంబు లెఱిఁగికొనుచు
సాధుమార్గంబునఁ దపంబు సలుపుచుండి. 19

క. ఒకమునికన్యకఁ డుల్యో
త్సుక యైవిలసిల్లుదానిఁ జూచి కుసుమసా
యకతీక్ష్ణశరాఘాతర
సికుఁ డై యాకస్మికముగఁ జేద్పడుచుండన్. 20

ఆ.వె. ఎఱిఁగి యచటిసంయమీశ్వరుల్ కోపించి
శాప మొసఁగ నిట్టిజన్మ మొందె;
నితనిపట్టమహిషియే యయ్యె నమ్ముని
కన్యకయును శాపకారణమున. 21

క. ఈరీతి నతఁడు బుష్యవ
తారుం; డదిగాన నీదు దర్శనమున నే
కోరినగతి నఖిలకళా
పారంగతుఁ డగుచుఁ బూర్ణ పాండితిఁ బడయున్. 22

వ. అది యెట్లనిన:— 23

ఉ. ప్రాకటపూర్వజన్మసముపార్జితపావనసంస్కృతుల్ ఫల
శ్రీకలితంబు లై పెనుపుఁజేయ మహాత్ముల సత్త్వమార్గముల్
చేకొనుచుండుఁ గష్టములు చెందఁగ నక్కఱ లేక యే; కుమా
రా! కృతకార్యనిర్వహుఁడ వైతివి పొమ్ము యథేప్సితంబుగన్.

వ. అని యానతిచ్చి, యంత నాభగవంతుం డంతర్హితుం డయ్యెఁ;
బదంపడి నేనా దేవళంబు వెలుపలకు వచ్చి గృహోన్ముఖుండ
నగుటయు నప్పు డచ్చటి దేవోపజీవులు నాయెడ ననుగ్ర
హించి కొన్ని తండులంబుల నిచ్చినం బుచ్చుకొని వెడలి
వచ్చితి:— 25

గీ. వచ్చుతఱి నేమిసెప్ప నో వసుమతీశ!
దారిలోపల నాదివ్యతండులములు

దినదినము వండుకొని యేను దినుచునున్నఁ
దెఱుఁగ వయ్యెన దేమి చిత్రింబొ కాని. 26

క. అని తన వృత్తాంతము నిటు
వినిచి పిదప శర్వవర్మ విరమింపఁగ నా
జనపతియుఁ బ్రమోదమ్ముం
గని స్నానార్థంబు లేచెఁ గాలానుసృతిన్. 27

వ. అంత నేనును మున్ను శర్వవర్మతోఁ బలికిన ప్రతిజ్ఞ నను
సరించి:— 28

క. ధృతమౌనుఁడ నై యుండిన
కతమున నృపకార్యజాతకరణమునకు సం
గతిగామిఁ దలఁచి యా భూ
పతికడ వసియింప నిష్టపడ కవ్వేళన్. 29

వ. వేఱొక్కయెడ కెచ్చటికేని బోవం దలంచి, యా నరపాలుం
డందుల కించుకయు నిష్టపడకుండినను శిరఃప్రణామమాత్రం
బుననే యాతని నామంత్రిణం బొనర్చి శిష్యద్వయ సమన్వి
తుండ నై తత్పురంబు నిర్గమించి తపశ్చరణంబుపొంటెఁ
గృతనిశ్చయుండ నై వింధ్యవాసినీదేవిని దర్శింపవచ్చితి;
నంత నచ్చట:— 30

సీ. ఆదేవి యాదరాయత్త యై స్వప్నంబు
నందు సాక్షాత్కార మొంది, నన్ను

నీకడ కరుగంగ నియమించె; నేను నీ
ఘోర మావింధ్యకాంతారమందుఁ
జొరఁబడి తెరువేది తిరుగుచుండఁగ, దైవ
వశమున నొక బోయవాఁడు వచ్చి
సార్థ మొక్కటి చూపె సదయుఁడై యంత నే
నా సాతువెంబడి నరుగుదెంచి

గీ. యిచట నీభూతగణముల నెల్లఁ గంటి;
వచ్చునప్పుడు వీని సంభాషణములు
దప్పవిన విని తద్భాషఁ దగ నెఱింగి
నేర్చుకొంటిని నామాన నియతి తోఁగ. 31

వ. పదంపడి నీ వయ్యుజ్జయినీపురంబున కరిగియుండుట విని నీవచ్చునంతకు నిచ్చట వేచియున్నవాఁడ; నిప్పుడు నిన్ను దర్శించి,నాకు నవాభ్యస్తంబును, నాలవదియునైన యీభూతభాషతో నీయోగక్షేమంబు లడిగి తెలిసికొని యిట్లు జాతిస్మరుండ నైతి; నిదియ నాయీజన్మవృత్తాంతం బని గుణాఢ్యుండు చెప్పిన విని కాణభూతి మరల నతని కిట్లనియె. 32

గీ. నేను గతరాత్రి యుజ్జయినీపురమున
నుండియును నీ విటకు వచ్చియున్నవార్తఁ
దెలిసికొనఁ జాలితిని దాని తెఱఁగు నీకు
వినుతు నది నీవు వినుమోయి విమలచరిత! 33

క. కలఁ డుజ్జయినీపురమున
బలురక్కసి యొకఁడు భూతివర్మాఖ్యుఁడు నా
చెలికాఁడు; వాఁడు సతతము
విలసిల్లున్ దివ్యదృష్టివిభవాఢ్యుం డై. 34

క. ఏ నాతనిఁ గన నుజ్జయి
నీనగరంబునకుఁ బోయి నిన్న నతని యు
ద్యానవనాస్పదమున మది
నూనినయుత్సాహవశత నుంటి నతనితోన్. 35

వ. అట్లున్నసమయంబున మిత్త్రమా! నీవు దివ్యదృష్టిసంపన్నుం డవుగదా మదీయశాపావసానం బెప్పు డయ్యెడునో యెఱిం గింపనేర్తువే యని నే నతని నడిగితి; నంత నతండును సఖా! యిది దివాభాగ మగుటంజేసి నాకు దివ్యదృష్టిప్రభావంబు కొంతతడవడియుండుం గావున నీ విచ్చో ద్దిచ్చట నిలుతువేని రాత్రి పడినతోడనే చెప్పంగలవాఁడ ననుటయు నేనును త ద్వచనానుసారంబున నాఁటి కచ్చట నిలిచితి. 36

గీ. అంతఁ బగ లెల్లఁ జని రాత్రి యరుగుదేర
నచటి భూతంబు లత్యంతహర్ష మొంది
యిట్టునట్టును రేఁగి పర్వెత్తఁదొడఁగె
నది గనుంగొని యుచితవాక్యానుసరణి. 37

క. అడిగితి నే నాతని "ని
వ్వడువున భూతములు హర్షపరవశతఁ గడుం

గడుఁ జెలరేఁగుచుఁ బర్వేల
నిడుచుండుట కేమి కతమొ యెఱిఁగింపు సఖా !?! 38

వ. అని యడిగిన నాభూతివర్మ నాతో నిట్లనియె. 39

గీ. వినుము, శంభుండు మున్నొకవేళఁ గమల
గర్భునకుఁ జెప్పె దీనిసందర్భ మదియ
నీకు నేఁ జెప్పువాఁడ; దాని వినినంతఁ
దెలియుఁ దత్సర్వము నటంచుఁ బలికి పిదప. 40

వ. శంకరుండు జలజసంభవుని కెఱిఁగించిన వచనంబులు నాకిట్లు
సెప్పె నది యెట్లన:— 41

గీ. పవలు రవితేజమునఁ బ్రభావంబుఁ దొఱఁగి
యక్షరక్షఃపిశాచాదు లడఁగి యుండు
రాత్రులం దర్కతేజోవిరహముగలుగుఁ
గాన నవి యుప్పొంగి హర్షంబుఁ గాంచుచుండు. 42

వ. ఇదియునుం గాక:— 43

గీ. సురల కెవ్వోట నర్చనల్ జరగకుండు
నెచట బ్రాహ్మణు లాచారహీను లగుదు
రెందు విధి మీఱి భుక్త్యాదు లెపుడు నడచు
నట్టిచో వానికిఁ బ్రభావ మతిశయించు. 44

వ. మఱియును. 45

చ. పరమపతివ్రతాత్వమున భాసిలు నుత్తమకాంతలున్ నిరం
తరపరిశుద్ధవర్తనముఁ దాల్చి మెలంగు నమాంసభక్షులౌ

పురుషులున్న చోటులకుఁ బోవనియెన్నఁడు; వారిఁగాంచుచో
వెఱపునఁ బాఱిన ట్లరుగు వేఱొకచోటికి నొత్తిగిల్లుచున్.

క. యతుల ననారతశౌచా
న్వితుల మహాశౌర్యధైర్యవిక్రమతేజో
యుతుల ననూనజ్ఞాన స
,హితుల న వెన్నండుఁ జెనక వించుక యేనిన్." 47

వ. అని యిట్లు శంకరుండు విరించికి వివరించె; దీనింబట్టి యక్షరక్షఃపిశాచాదులకు రజనీసమయంబు హర్షకారణం బని తెలియంబడు; నిప్పుడు రాత్రి యయ్యెం గావున నీభూతంబు లిట్లు ప్రవర్ధమానహర్షంబు లగుచున్న; వని చెప్పి వెండియు నిట్లనియె. 48

గీ. అనుఁగుఁజెలికాఁడ! నీవు న న్నడిగినట్టి
ప్రశ్నమున కుత్తరం బిప్డు పలుకువాఁడ;
వినుము, నీశాపముక్తిఁ గాపింప హేతు
వగు గుణాఢ్యుండు వచ్చె; నీ వరుగు మింక. 49

చ. అనవుడు సంతసంబు హృదయంబున నెట్టుకొనంగ వచ్చినిన్
గనుఁగొనినాఁడ నిచ్చట; నిఁకన్ వచియించెదఁబుష్పదంతు చె
ప్పిన మహనీయదివ్యకథఁ బ్రీతిమెయిన్ బుధవర్య!; కాని, యే
నొనరుచు విన్నపం బొకటి యున్నది నీ వది యాలకింపవే.

వ. అది యేమి యనిన. 51

ఆ.గీ. అతఁడు పుష్పదంతుఁ డన నీవు మాల్యవం
తుం డనంగ వెలయుచుండ నేమి
కతము ? దానిఁ దెలియఁగాఁ గౌతుకం బయ్యె
వెలయ నాకు నుడువవే మహాత్మ ! 52

వ. అని కాణభూతి యడిగిన విని గుణాఢ్యుం డతని కిట్లనియెఁ;
గాణభూతీ ! నీకావృత్తాంతంబు సెప్పెద; వినుము. 53

గీ. ధరణి గంగానదీపుణ్యతటమునందు
విపుల వైభవసంపత్తి వెలయుచుండు
బహుసువర్ణక మను పేరఁ బరఁగు నొక్క-
యగ్రహారంబు సంపత్సమగ్ర మగుచు. 54

క. అందు బహుశ్రుతుఁడు సదా
నందుఁడు గోవిందదత్తనామకధరణీ
బృందారక తిలకం బర
విందభవసమానబుద్ధి విభవుం డలరున్. 55

చ. అతనికి సగ్నిదత్త యను సప్రతిమానవివేకసద్గుణాం
చిత, పరిశుద్ధతుల్యగుణశీల, నిరంతరభర్తృదేవతా
వ్రతపరతంత్రచిత్త, యనవద్యపవిత్రచరిత్ర, భార్య యై
సతతము సాటివారు దను సన్నుతిసేయఁజరించు నెమ్మితోన్.

క. అనురూప రూపగుణ సం
జనితదృఢానోన్యరాగసంభృతనిజహృ

ద్వసజాతు లైన యాసతి
యును బతియును నెసక మొసఁగ నొప్పుచునుండఁగన్. 57

క. కాలక్రమమున నయ్యి
ల్లాలికిఁ బ్రియభర్తయగుధరామగువలనన్
బాలకు లేవురు వొడమిరి
లాలిత్యవిశేషరూపలక్షితు లగుచున్. 58

వ. అంత:— 59

చ. కులసతియందు సద్విజునకున్ జనియించి మనోహరాకృతుల్
వెలయఁగ నొప్పుచున్నయలవిప్రకుమారకు లేవురున్ సము
జ్జ్వలగుణసంపదన్ గనక స్వచ్ఛతమం బగుతండ్రికీర్తిన్
మలినముసేయఁగాదురభిమానులుమూర్ఖులు నయ్యె రక్కటా.

వ. యిట్లుండ నంత నొక్కనాఁ డాగోవిందదత్తునిగృహంబునకు
వైశ్వానరుం డనునొక్కవిప్రుండు వైశ్వానరుంబోనివాఁ
డతిథి యై వచ్చి గోవిందదత్తుఁ డింట లేకుండుటం జేసి తదీయ
పుత్త్రులం జూచి నమస్కరించుటయు నాసమయంబున:—

గీ. వార లతనికిఁ బ్రత్యభివాదనంబు
సలుపఁబోవక పరిహాససరణి నవ్వ
నొడువ రై రొక్కపలుకేని నోరు విప్పి
దురభిమానముదోద్రేకధూర్తు లగుచు. 62

గీ. అంతఁ దన్నట్లు వారు నిరాదరంబు
సేయ వైశ్వానరుఁడు తన చిత్తమందుఁ

గనలి యచ్చోటు విడి పోవఁగాఁ దలంచి
మరలి యాయింటి వెలుపలి కరుగుచుండ. 63

వ. ఆసమయంబున గోవిందదత్తుండు సనుదెంచి యట్లు తనయిం
టినుండి కోపించి పోవుచున్న వైశ్వానరు నవలోకించి తదీయ
కోపకారణం బడిగి తెలిసికొని యుచితమార్గంబున నతని
ననునయించి తా నొసంగెడి యాతిథ్యంబుఁ గొనిపొమ్మని
వేఁడుకొనుటయు నంత నాద్విజన్ముం డతని కిట్లనియె. 64

క. పతితులు మూర్ఖులు గర్వా
న్వితులు భవత్సుతులు ధారిణీసుర ! నీవం
చితమతి వయ్యుం దత్సం
గతికలిమిం జేసి నీకుఁ గలుషత యొదవెన్. 65

క. కావున వారలయట్టిఁడ
వీవును నీవంటివానియింటఁ గుడిచినన్
గేవలముఁ బాతకం బగుఁ
బోవిడువుము నన్ను నిలువఁబో నీక నిచ్చోన్. 66

క. ఏయెడ నెవ్వారేనియు
నీయట్టి యాతిథ్యకిమిచట నేటికిఁగుడువన్
బ్రాయశ్చిత్తముఁ బడవడి
నేయంగా నేల? తద్వృజినము తొలఁగఁగన్. 67

గీ. అనిన గోవిందదత్తుఁ డి ట్లనియె; నాదు
శపథ మిదె యిక్కుమారుల నపథచరుల

నింక నే నెన్నఁడును స్పృశియింప నఘ !
కైకొనుము వచ్చి యతిథిసత్కార మిచట. 68

వ. అని యనేకవిధంబుల నతం డిట్లు ప్రార్థించుచున్నసమయం
బున నతిథిజనసత్కారపరాయణ యగు గోవిందదత్తుని
సహధర్మచారిణియుం జనుదెంచి తాను నట్లే వేఁడుకొను
టయు నంత నవ్వైశ్వానరుం డట్లు లెట్లులో యంగీకరించి
వారియింట నాతిథ్యంబు పరిగ్రహించి చనియె; నయ్యనంత
రంబున గోవిందదత్తుండును నిజపుత్రసంస్పర్శంబు పరిహరిం
చియుండుటయు నాసమయంబున:— 69

గీ. అతని తనయులలో నొకం డైన దేవ
దత్తుఁ డది గాంచి తండ్రి నిర్దయతఁ దమ్ము
ముట్టకుండుట కనుతాపమును వహించి
తనమనమ్మున నెంతయు వనట వొడమ. 70

క. జననీజనకులు దూషిం
చినజీవిత మేటి కనుచుఁ జింతించి విర
క్తిని జెంది బదరికాశ్రమ
మునకుం దప మాచరింపఁ బోయి నియతుఁడై. 71

గీ. ప్రథమమునఁ గొంతకాలము పర్ణభక్షుఁ
డును, బిదప ధూమపుఁడు నయి తన మనమునఁ
బార్వతీవల్లభునిప్రీతిఁ బడయ నెంచి
యచట నివసించెఁ జిరకాల; మంతలోన. 72

క. ఆతని తీవ్రతపంబునఁ
బ్రీతుండై యీశ్వరుండు ప్రేమించి కృపా
న్వీతమతి దర్శనం బిడి
చేతోభీప్సితముఁ దెలియఁజెప్పు మనుటయున్. 73

ఆ.వె. అతఁడు తనకు శంభుననుచరత్వ మొసంగ
వరము వేఁడుకొనియెఁ; గరముఁ బ్రీతి
భవుఁడు నంత నతనిపాలఁ బ్రసన్నుఁడై
యిట్టు లనియె నెమ్మి నినుమడింప. 74

గీ. వయసునం బిన్నవాఁడ వోవత్స! నీవు
పుడమిఁ గలభోగభాగ్యముల్ గుడువ వైతి
కాన, విద్యావివేకముల్ గడనచేసి
కొంతకాలమ్ము సౌఖ్యముల్ గొనుము పిదప. 75

క. నీ కోరిన యర్థంబున్
జేకూరును సంశయంబు చెందకుము శుభ
శ్రీకలితుఁడ వగుదు; కుమా
రా! కఠినతపం బొనర్చి యలయకు మింకన్. 76

వ. అనిన విని యాదేవదత్తుండు భక్తవత్సలుం డైన భవానీవల్ల
భు నాదేశంబు శిరంబున ధరియించి విద్యార్థియై పాటలీపుత్ర
కంబున కరిగి యందు. 77

గీ. సకల విద్యావివేకవిశారదుండు
గుణధురీణుండు నయి పేరుగొన్న వేద

కుంభనామకు గురువుగాఁ గోరి యతని
కడ యథావిధి విద్యలు గఱచుచుండె 78

వ. ఇట్లుండ నంత నక్కడ నొకానొకసమయంబున. 79

క. పరువపు లేఁబ్రాయమ్మునఁ
బరఁగెడు నా దేవదత్తుఁ బరికించి స్మరా
తుర యై తద్గురుపత్ని య
దిరిపాటుగ వలపుసెందెఁ డెంపరి యగుచున్. 80

క. కులసతి యయ్యును నీతిం
దలఁపక యత్యంతహృదయదౌర్బల్యమునన్
వలపుఁ గొనె వానియెడ నది;
లలనలచిత్తములు చంచలము లగుఁగాదే ? 81

వ. అంత. 82

గీ. దేవదత్తుండు గురుపత్నిభావ మెఱిఁగి
పుష్పశరకృత విప్లవంబునకుఁ గలఁగి
పాపభయమున నచ్చోటు వాసి యరిగెఁ
జల్లఁజల్లఁగ నలప్రతిష్ఠానపురికి 83

వ. ఇట్లరిగి యప్పురంబున వయోవృద్ధుండును వృద్ధభార్యాసము
న్వితుండును నగుమంత్రస్వామి యనునొక్కవిద్వాంసుఁ దన
కుపాధ్యాయునిగా సర్థించి యతని యనుగ్రహంబున నభ్యస్త
సమస్తవిద్యుం డై యుండె నట్టిసమయంబున:— 84

సీ. విద్యావయోరూపవిభవాభిశోభి తై
విలసిల్లుచున్న యవ్విప్రతనయు
నంబుజేక్షణ సుశర్మాఖ్యభూవరపుత్త్రి
పరిపూర్ణయౌవనభాసురాంగి
శ్రీ యనుపేర భాసిలు కన్యకామణి
వీక్షించె నొకనాఁడు వీథిలోన
నయ్యెడ నిజవిహారార్థ మై వింగిఁ
దిరిగెడు చంద్రాధిదేవతయును

గీ. బోని యక్కన్య నతఁడును బోలుపుమీఱఁ
గనియె సౌధవాతాయనాగ్రమున నుండ;
నంత నన్యోన్యరూపరేఖావలోక
నముల వారిర్వురును గౌతుకములఁ దేలి. 85

గీ. మరుని సంకెల వోలె నొండొరుల దృష్టి
దృఢతరమ్ముగఁ గమ్మ బంధించె ననఁగ
వెడల లేరైరి చెలి వీడి విప్రసుతుఁడు
విప్రసుతు వీడి యమ్మహీవిభుని సుతయు. 86

గీ. అంత నారాజసుత, మూర్త మైన మన్మ
థాజ్ఞనాఁ దగ నొకవేత్రిల నట్టె యతనిఁ
దనదు పరిసరమునకుఁ గమ్మనుచు సంజ్ఞఁ
జేసె; నది చూచి కడు సంతసించి యతఁడు. 87

క. అంతఃపుర పార్శ్వమ్మున
నెంతయుఁ గౌతుకము మీఱ నేఁగెఁ దదీయో
పాంతమ్మున; కయ్యెడ న
య్యింతియుఁ దనహృదయభావ మెఱిఁగింపంగన్. 88

గీ. పుష్ప మొక్కండు నిజదంతముకుళకములఁ
గఱచి యావిప్రసుతుని వంకఁ బడ నుమిసి
పోయె నతిశీఘ్రముగ నంతిపురములోని
కొరులు దనుఁ గాంతు రనుభీతి నొంది యంత. 89

గీ. దేవదత్తుండు రాజపుత్త్రికృత మగు
గూఢసంజ్ఞార్థము నెఱింగికొనఁగ లేక
మోద మెడలఁగఁ గర్తవ్యమూఢుఁ డగుచు
నరిగె గురుగేహమునకు మోహమున మునిఁగి. 90

వ. ఇ ట్లరిగి యక్కడ. 91

క. నిరతిశయకుసుమసాయక
పరితాపభరమ్ము దన్నుఁ బరవశుఁ జేయన్
ధర నిటునటు పొరలుచు దు
ర్భరవేదన యెదియొ తెలియఁబడ కలయింపన్. 92

గీ. కలధనం బెల్ల బలిమి ముచ్చులు హరింప
వీఁగి లోలోన వగఁజెందు మూఁగవోలె
నించుకంతేనియును నిదమిత్థ మనుచు
నొడువఁ జాలక వేసటపడుచు నుండె. 93

వ. ఆ సమయంబున:— 94

గీ. అతని మన్మథచిహ్నంబు లరసి, యింగి
తజ్ఞుఁ డగు తద్గురుండు యుక్తమగురీతి
నడుగఁ,దుద కెట్టులెట్టులో నుడివె దేవ
దత్తుఁ డవ్వేళ జరిగినవృత్త మెల్ల. 95

క. అది యెఱిఁగి చతురతరమతి
తదుపాధ్యాయుండు శిష్యతత్పరుఁ డై యొ
ప్పిదముగ వానికి సర్వము
విదితముగా నిట్లు సెప్పె విశదోక్తులతోన్. 96

చ. తెలియమి నిట్లు వంతఁబడి తేఁకువ వీడితి దేవదత్త! నీ
కలనృపపుత్రి దంతముల నట్టులు పుష్పముఁ జిమ్మి సాజ్ఞగాఁ
దెలిపెను బుష్పదంత మను దేవళమందు నిగూఢవృత్తిమై
నిలువుము నేను వత్తు నని; నేర్పరియా నృపకన్య యెంతయున్.

క. నీ విపుడేనియు వేగమె
పోవంగా రాదె? వివిధపుష్పభరిత మై
యీ వీటం దనరెడు నా
దేవళమున కింత తెలివితేటలు వలదే? 98

క. నా విని తత్సంజ్ఞార్థము
భావంబున కెఱుకపడఁగఁ బరితుష్టుం డై
యావిప్రకుమారుం డా
దేవగృహాభ్యంతరప్రదేశముఁ జేరెన్. 99

వ. అంత మఱికొంతవడి కాదేవభవనంబునకు:— 100

ఉ. అష్టమివంక వెట్టి ధవలాయతలోచన రాజపుత్త్రి తా
నిష్టసఖీజనంబునకు నేనియుఁ దెల్పక యొంటి నాశ్రితా
భీష్టవరప్రదాత యగు నీశ్వరుఁ గొల్వఁగఁ బోవునట్లు సం
తుష్టి మెయిం జనెన్; బహుగతుల్ గద కాంతలసాహసక్రియల్.

క. అయ్యెడఁ గవాటబంధము
క్రొయ్యా వెనుక డాఁగి యున్నకూరిమికాఁ డా
తొయ్యలిఁ గనుఁగొని నెయ్యముఁ
దియ్యము నెసఁగంగ నరుగుదెంచి రయమునన్. 102

వ. ఆ రాజకుమారిక నాలింగనంబు చేసికొని యభినందించుటయు
నప్పు డక్కన్యక యతని కిట్లనియె:— 103

ఉ. చిత్రముగాదె నే నపుడు చేసిన సంజ్ఞ తెఱంగు వారిరు
ట్పత్త్రవిశాలనేత్ర! ప్రియవల్లభ! నీ వది యెట్లెఱింగి నా
మైత్త్రి యొనర్ప వచ్చితివి నూమకపుణ్యఫలంబ వౌచు? నీ
చిత్రచరిత్ర నాకు వినఁ జెప్పుము నిక్కముఁ దప్పకుండఁగన్.

గీ. అనిన దానివలుకులందలి గంభీర
భావ మెఱుఁగలేక దేవదత్తుఁ
డున్న దున్నయట్ల యుగ్గడింపఁ దలంచి
వెడఁగుదనము దోఁప వెలఁదిఁ జూచి. 105

క. ఏ నది తెలియఁగలే దో
మానిని! విను మద్గురుండు మహితాత్ముఁడు నా

కా నీసంజ్ఞార్థము నెం
తేని యనుగ్రహము మీఱ నెఱిఁగించెఁజుమీ. 106

కల్ల లాడంగ నేలకో పల్లవోష్ఠి!
యాతఁ డది నమ్మిమెఁ జెప్పఁడయ్యె నేని
నేఁడు నిక్కంబుగా నిందు నీదుపొందుఁ
బడయుభాగ్యము కలుగదయ్యెడిని నాకు. 107

అనిన విని రాకుమారిక
తన మనమున వానియజ్ఞతకుఁ గడు రోఁతన్
గని చాలుఁజాలు నిఁక నీ
తని పొత్తని వాని కెడగఁ దలఁగుచుఁ గినుకన్. 108

పయిమెఱుంగులె కాని, లోపల నొకింత
తెలివి తేటయు నున్నట్లు తెలియఁబడదు;
నీవు తలపోసిచూడఁగా నేతిబీఱ
కాయ వైతిగదే! యందగాఁడ! వినుము. 109

అవివేకంబున ని న్నొక
యవిదగ్ధుని వలచి బేలనైతి నిపుడు న
న్ను విడిచి పొ మ్మని క్రోధము
రవులఁగ నది యచోటు వాసి రభసంబు మెయిన్. 110

తనవృత్తము నెవరేనియుఁ
గనుఁగొందురొ యేమొ యనుచుఁ గలఁగెడుచిత్తం

బున భయము గదురఁ దోఁడన
చనియె నిగూఢముగ నాత్మ సౌధంబునకున్. 111

ఉ. ఆయెడ నట్లు హస్తగత మైన సుపక్వఫలంబు మాయ మై
పోయినభంగి నయ్యగురుఁబోఁణి తటాలున దృష్టనష్టయై
పాయఁగ నంత నవ్విడఁగుబ్రాహ్మణపుత్త్రుకుఁడింక నేదియున్
జేయఁగఁజాలమిన్ వగపుఁజెందుచుఁ గుందుచు విహ్వలించు
చున్. 112

వ. ఆ దేవభవనంబు వెలువడి వచ్చి:— 113

ఆ. వె. అరిగి యొకవివిక్తధరణి నవ్వసుధేశ
తనయ నెమ్మనమునఁ దలఁచికొనుచు
ఘనవియోగవహ్నిఁ గాఁగుచు నిజజీవి
తము భరింపలేక తల్లడిలుచు. 114

వ. తన బ్రతుకు రోసికొని దురపిల్లుచుండుటయు నంతటఁ దోల్లి తదీయ తపఃప్రసన్నుం డైన భగవంతుం డీశ్వరుండు వానియవస్థం జూచి జాలిగొని మహానుగ్రహంబునఁ దదభీష్టంబు నెఱవేర్ప బొంబెఁ బంచశిఖుం డనుపరిమథున కాదేశించుటయు నప్పు డతండు భూలోకంబున కరుదెంచి ప్రియావియోగవేదనాదూయమానమాన మానసుం డై యున్న యాదేవదత్తు సమీపించి యుచితమార్గంబున సమాశ్వాసించి తన్మనోరథంబు నీడేర్ప నొక్క యుపాయంబుఁ జింతించి తత్ప్రయోగంబునఁ గార్యసాధనంబు గావింపఁ దలంచి:—115

క. అతనిని దరుణీ వేషా
న్వితునిం గావించి తాను వృద్ధద్విజతాం
చితుఁ డై సుశర్మ ధరణీ
పతికడ కాయుతిఁ దనదుబడిఁ గొని చనియెన్. 116

వ. ఇట్లు చని, దేవదత్తుండు వలచిన కన్యకకు జనకుం డైన యా సుశర్మధాత్రీవల్లభుని దర్శించి నిజనేత్రంబులనుండి తొఱఁగు కపటబాష్పంబు లల్లనల్లన నుత్తరీయపటాంచలంబున నొత్తుకొనుచు నతనితో నిట్లనియె:— 117

ఉ. ముక్కలి యాచు నాకొడుకు మూర్ఖత నెవ్వరితోడఁజెప్పకే
యెక్కడకేనియుం జనియె నే మనువాఁడ మహీశ! నాకు వాఁ
డొక్కఁడె పుత్త్రకుండు మన పోవను వీడి యుపేక్షసేయఁగా
నక్కట! వానిజాడఁ గన నంమను సింధుఁ జరింతు నీగతిన్.

క. ఇది నాకోడలు గుణసం
పద గలయది; దీని కాత్మబంధులు లేమిన్
గుదిగట్టు యయ్యె నా మెడ
కిదియేనియు దారివట్టి యెటకేఁగుటకున్. 119

వ. అక్కతంబున నీవు నన్నిప్పు డనుగ్రహించి:— 120

ఆ.వె. కొడుకుజాడ తెలిసికొని వెండి నే వచ్చు
నంతదనుక దీని నధిప! యిచట
నుంచువాఁడ; నీవు నొకభంగిఁ బోషింప
వలయు నీదు బిడ్డవలెఁ దలంచి. 121

గీ. అనిన నది విని యంత నా మనుజపతియు
దాని కొడ్డఁబడ కున్న డ ధర్మశీసురుఁడు
కనలి శపియించు నని భీతిఁగాంచి యట్ల
సేయఁగాఁ సమ్మతించి యాచిన్నవాని. 122

చ. తరుణియుకాఁ దలంచి సతతంబు భయంకర ఖడ్గహస్తులై
పరిచరవర్గముల్ మివుల భద్రముగాఁ బరిరక్షసేయ, నం
తరమునఁ బోతుటేఁగయును దార్గాన శక్యముగాని పుద్దుఁ
గూఁ । తురిభవనాంతరమ్మునకుఁ దోడ్కొనిపోవఁగ నాజ్ఞ
వెట్టెఁ దాన్. 123

వ. అంత నావృద్ధబ్రాహ్మణవేషధారి యైన పంచశిఖుండును
సంతసించి రాజు నామంత్రణంబుచేసి చనియెఁ; బదంపడి
కాలక్రమంబున:— 124

గీ. తగు తెఱంగున స్వప్రియాంతఃపురమున
నంగనావేష మొప్ప మెలంగుచుండి
దేవదత్తుఁడు తద్యువతీలలామ
ప్రణయవిస్రంభగరిమకుఁ బాత్రి మయ్యె. 125

గీ. అంత నొకనాఁటిరేయి యేకాంతమందు
నృపసుతకుఁ దన్ను వేడ్క నై నెఱుఁగఁ జెప్పి
తదనుమోదమ్ము వడసి గాంధర్వవిధిని
బరిణయంబయ్యె నమ్మనోహరను బ్రీతి. 126

సీ. పదపడి యా భూమిపాలపుత్త్రిక ధృత
గర్భ యగుటయు, భయకలితహృదయుఁ
డగు తనవేషరహస్యంబు వెల్లడి
గాకుండ నటనుండి కదలి పోవఁ
దలపోసి యా దేవదత్తుండు స్మరియించె
భక్తిమై వెండియుఁ బంచశిఖుని
స్మృతిమాత్రమున సమాగతుఁ డయి యా గణో
త్తముఁడు నారాత్రి మోదమ్మున మీఱ
గీ. నతని నయ్యెడఁ గదలించి యన్యు లెఱుఁగ
కుండఁ గొనిపోయె; భగవంతు లండ గలుగు
నట్టి వారల కిల నసాధ్యములు గలవె
యరసి చూచినఁ గాలత్రయంబునందు ? 127

వ. అట్లు కొనిపోయి తోడ్తోన యా యువకుని స్త్రీ వేషంబుఁ దొలంగంజేసి తాను దొల్లిటివలె వెండియు వృద్ధబ్రాహ్మణ రూపంబు ధరించి నిజవేషంబున నున్న దేవదత్తుని దన వెంట నిడికొని ప్రాతఃకాలంబున మరల సుశర్మభూపాలుని యాస్థానంబున కరిగి యతని దర్శించి యి ట్లనియె:— 128

మ. నరనాథోత్తమ! మత్సుతుం డితఁడు గానవ్వచ్చె నిన్నాళ్లకి
త్తఱి;నాకోడలి నింతకాలము దయార్ద్రంబైన చిత్తంబుతోఁ
బరిపోషించితి నాయెడం గలుగుసద్భావంబునంజేసి; నీ నరప
త్వంబున కాత్మ మెచ్చితి మహాసంతోషముం గాంచితిన్.

క. నీ కొమరితయును సుగుణా
నీకము గలకన్నె యగుట నిజనిలయమునన్
నా కోడలితో హృదయం
బేకముగా మసలి మనిచె నిన్నాళ్లు దయన్. 130

ఆ.వె. కాన మీకు మేలు గలుగుత! దైవంబు
కరుణఁగలిగి మిమ్ముఁ గాచుఁగాత!
నీ కుమారి ప్రణయ నిర్భరుఁ డగుభర్తఁ
బడసి యిష్టసుఖము పడయుఁగాఁత! 131

చ. అరిగెద నింక మామకగృహంబున కోధరణీశ! నేను నీ
కరుణఁ గుమారునిన్ వెదకి కన్గొనఁగల్గితి; నియ్యెడన్ సమా
దరమున నాదుకోడలిని దప్పక తోడ్కొనిపోదగున్ శుభో
త్కరముగ దాని నిచ్చుటకిఁ గ్రమ్మఱఁ దేఁ బనుపంగదే నృపా!

ఆ.గీ. అనుడు రాజు రాత్రి యకాంత యెందేనిఁ
బఱచి చను గొఱింగి బ్రాహ్మణుండు
కినిసి శాప మిచ్చు నని భయం బందుచు
మంతనమున మంత్రిమణులఁ బిలిచి. 133

వ. వారలతో ని ట్లనియె:— 134

చ. వినుఁ డిది మంత్రులార! యొక వింతసుఁడీ తలపోసిచూడ నీ
యనఘుఁడు కేవలంబును ధరామరమాత్రుఁడు కాఁడు!నన్ను
వంచనమొనరించుపొంటె;సహజంబగురూపముదాఁచి వైచి వ
చ్చిన యొక దేవమూర్తి,యిది సిద్ధము;సంశయ మొందనేటికిన్.

గీ. ధరణి నొక్కొకతఱి దేవతలు స్వకీయ
రూపములు మార్పడంజేసి యేపగిదినొ
సంచరించుచుఁ జేయు నాశ్చర్యచర్య
లెన్ని వినియుండలేదు మీ రెఱుఁగరొక్కొ? 136

—: శిబిచక్రవర్తి వృత్తాంతము. :—

వ తొల్లి కరుణాపరుండును మహాతపశ్శాలియు నగుశిబిచక్రవర్తి, సర్వసత్త్వాభయప్రదుండును దానవీరుండును నై రాజ్యంబుసేయుచుండ నింద్రుం డాతని వంచింపఁ దలంచి శ్యేనరూపధరుం డై మాయాకపోతవేషుం డైన పితృపతి వెన్నంటి తఱుమ దొరఁకొనుటయు నంత నమ్మాయా కపోతంబు భయంబునంబోలెఁ బఱతెంచి శిబిచక్రవర్తి యంకంబు నాశ్రయించె; నట్టితఱి శరణాగతవత్సలుం డైన యా ధరణీనాయకుండు దాని కభయం బిచ్చి రక్షించుటయును దాని వెంటఁ దగిలి వచ్చిన యా శ్యేనంబు మనుష్యవాక్యంబుల నతని కిట్లనియె:— 137

గీ. పార్థివోత్తమ ! విడుము మద్భక్ష్య మైన
యిక్కపోతంబు; నే నిప్పు డెంతయేని
యాఁకటం దూలి యుంటి; నియ్యవసరమున
నీవు దీనిని విడవేని యేమనందు? 138

క. ఆఁకటిచే నత్యంతము
నాకులపడు నేను నిలువనగునే యుసురుల్

పోకుండ? నోటిచెంగటి
యీకూటికి నడ్డువచ్చె దేటికి భూపా! 139

క. శరణాగతరక్షణ త
త్పరతంగదా దీనిఁ గావఁదలఁచితివి మహీ
శ్వర! నీ కతమున నే మృతిఁ
బొరసిన నీ కపుడు దానఁ బుణ్యము గలదే? 140

ఆ వె. అన్యహాని లేనియప్పుడ నీసేయు
పుణ్య మది ఫలంబుఁ బొందుఁగాని
యొకఁడు నచ్చుచుండ నొక్కని రక్షింపఁ
బూను టేమి ధర్మబుద్ధి సెపుమ? 141

క. అన విని యా డేఁగకు ని
ట్లనె శిబి; నీ చెప్పినది యథార్థము, యైనన్
నను శరణుసొచ్చె నిది గా
వున దీనిని నాకు విడువఁబోలద యెట్లున్. 142

వ. ఇది యిట్లుండుటంజేసి యే నిప్పు డొక్కమార్గంబు సెప్పెద
నాలింపు; మది యెట్లనిన:— 143

క. దీనికిఁ దులయగు మాంసం
బేను మ ఱొక్కండు తెచ్చి యిచ్చెద నీకున్
దానిని దిని నీ యాఁకలి
వో నడుచుకొనంగ రాదె పొలియఁగ నేలా? 144

క. నావుడు శ్యేనం బిట్లనె
భూవర! యస్లైన నీకపోతమ్ముసకె
త్తై వచ్చునంత మాత్రము
నీ వొసఁగుము నీదు మాంస మే భుజియింపన్. 145

వ. అనిన విని యా శిబిచక్రవర్తి యందలి కాపట్యంబు నెఱుంగక యిది యెంతకార్యం బిప్పుడే యట్లుసేయువాఁడ నీ వది భుజించి దీని విడువుము. 146

ఆ.వె. అనుచు సంప్రహృష్టుఁడై యకపోతంబుఁ
దాసునందు నిల్పి దానియెత్తు
తనదుమాంస మీయఁదలఁపోసి దేహంబు
దఱిగి యిడఁ దొడంగె ధైర్య మెసఁగ. 147

క. ఎం తెంత మాంస మా భూ
కాంతుఁడు ఖండించి యిడినఁగాని కపోతం
బం తంతకు నగ్గల మై
యుంతయు సరిరాక యుండెఁ జోద్యముగాఁగన్. 148

ఆ.వె. అంత శిబినృపాలుఁ డయ్యది వీక్షించి
తన శరీర మెల్లఁ ద్రాసునందు
నిలుపుటయును జదల నిర్జరశ్రేణుల
సాధువాద మెసఁగె సాంద్ర మగుచు. 149

వ. అప్పు డాశిబిచక్రవర్తి మహౌదార్యంబున కత్యంతసంతుష్టాంతరంగు లై యింద్రశమనులు శ్యేనకపోతరూపంబులు విడిచి

నిజరూపంబులతో సాక్షాత్కరించి యమ్మహీవల్లభు నక్షత
గాత్రు నొనర్చి యభినందించి యభీష్టవరంబు లొసంగి యం
తర్ధానంబుఁ జేసి; రట్లు నేఁ డెవ్వండేని యొక్క దేవుం డీరూ
పంబున నన్నుం బరీక్షింప వచ్చియుండ నోపు నని చెప్పి
పదంపడి, విప్రరూపధరుం డైన యాగణోత్తము నవలోకించి
భయవినయవినమ్రుం డై సుశర్మభూపాలుం డతనికిట్లనియె.

గీ. అభయము నొసంగవలయు ధరామరేంద్ర!
నీదుకోడలి నెవ్వరో నిన్న రేయి
యపహరించిరి కాఁబోలు నంతిపురము
నందుఁ జొరఁబడి; కానరా దామె నేఁడు. 151

క. అది యేమి మాయయో తెలి
యదు రేయుంబవళు లిచటి యంతఃపురిలోఁ
బదిలంబుగ నుండెడి యా
సుదతీమణి నేఁడు లేదు శుద్ధవిచారా! 152

క. అనిన విని యెట్టు లెట్లో
కనికరమున నూరడిలిన కైవడి విప్రుం
డును భూమీశ్వరుతో ని
ట్లనెఁ దనయభిలాషమునకు ననుకూలముగన్. 153

చ. కడచినదానికై వగవఁగాఁ బని లేదు ధరాతలేంద్ర! య
ప్పుడఁతి భవద్వశంబున శుభస్థితి నుండునకాఁ దలంచి యి

క్కడ నిడి పోవ నద్ది యటుగాక యనర్థము సంభవించె; ని
ప్పుడు నిను నే మనం గలదు పూర్వకృతంబిటులుండఁదప్పునే?

క. ఈకుఱ్ఱని కిల్లా లిఁకఁ
జేకూరుట దుర్లభంబు చింతింపఁ బున
స్స్వీకరణము సేయక వీఁ
డేకాకిత్వమునఁ గాల మెట్టులు గడపున్ ? 155

వ. ఇదియునుంగాక :— 156

గీ. నాకు వీఁ డొక్కరుఁడెకదా నందనుండు ?
వీని కిల్లాలు లేక సంతాన మెట్లు
కలుగు? నావంశ మెట్టులు నిలుచు? నాకు
నూర్ధ్వలోకసుఖంబు లె ట్లొదవు నింక ? 157

ఆ.వె. నీ వశంబునందు నిక్షేపముగ నున్న
యపుడు వీనిభార్య యట్టు లయ్యెఁ
గాన నీదుపుత్త్రికను వీని కిల్లాలిఁ
జేసి యిపుడ పెండ్లిసేయు మధిప! 158

వ. అనిన నది విని :— 159

గీ. విప్రశాపభయంబున వే ఱొకండు
పలుకఁగా నోడి యప్పు డాపార్థివుండు
తన తనూజను దేవదత్తున కొసంగి
పరిణయ మొనర్చె మిగుల వైభవముమీఱ 160

వ. ఇట్లు దేవదత్తుండు బాహిరంబుగాఁ దన మనోవల్లభయగు నారాజపుత్రికను విధివిధానంబున వెండియుం బెండ్లియాడి పుత్త్రిసంతానవిహీనుం డగు నమ్మహీపతియైశ్వర్యంబున కెల్లఁ దాన యధీశ్వరుం డై సుఖంబుండె; నంత నప్పంచ శిఖుండు కృతకార్యనిర్వహణుం డై కైలాసంబున కేఁగెఁ; గాలక్రమంబున సుశర్మభూపాలుండును దేవదత్తునివలనఁ దన కుమారికయం దుద్భవించిన దౌహిత్రుని మహీధరుం డనువానిం దనరాజ్యంబునకుఁ బట్టంబుగట్టి వనంబున కరిగె నయ్యనంతరంబున. 161

చ. తన తనయుండు భూభరణదక్షత నక్షయరాజ్యసౌఖ్యముల్
దనరఁగ సంపదున్నతికిఁ దావలమై విలసిల్లుచుండఁగాఁ
గనుఁగొని దేవదత్తుఁడును గాఢముదం బెసగం గృతార్థుఁడై
వనమున కేఁగెఁ దా హృదయవల్లభతోఁ దపమాచరింపఁగన్.

గీ. అట్లు చని యందు వెండియు నభవుఁగూర్చి
తపముఁ గావించి తనమర్త్యతనువుఁ దొఱఁగి
తత్ప్రసాదంబుచేఁ బ్రమథత్వమొంది
యభవునను చరులం దొకం డయ్యె నంత. 163

వ. ప్రియాదంతోజ్ఝితం బైన పుష్పంబువలనఁ దత్సంజ్ఞార్థంబు గ్రహింపనేరమిం జేసి యతని కాప్రమథులయందుఁ బుష్ప దంతుం డను నామంబు గల్గె; నాతని భార్య యైనశ్రీయును బార్వతీదేవికిఁ బ్రతీహారి యై జయాభిధానంబున వెలయు

చున్నయది. ఇది పుష్పదంతనామకథావృత్తాంతం బింక మ
దీయాభిధానవృత్తాంతంబు సెప్పెద నాకర్ణింపుము:— 164

ఆ.వె. దేవదత్తు జనకుఁ దెలియుదే గోవింద
దత్తు? నేను నతని తనయులందు
సోమదత్తుఁ డనెడు సుతుఁడ; ము న్నట్లు మ
మ్మతఁ డవజ్ఞసేయ నెతవహించి. 165

ఉ. ఏనును దేవదత్తునటులే యిలు వీడి హిమాద్రి కేఁగి య
న్యూననిరూఢభక్తి మది నూల్కొనఁజేసి మృగాంకశేఖరున్
మానితదివ్యసత్కుసుమమాల్యములం బరితుష్టుఁ జేయుచున్
బూనికమైఁ జిరంబు తపముం బొనరించితి నబ్బురంబుగాన్.

ఉ. ఆయెడ సుప్రసన్నమతి నర్ధశశాంకధరుండు దర్శనం
బీయఁగ నేఁగుదెంచుటయు నేను గతాన్యమనోరథుండ నై
పాయని వేడ్కఁ దత్ప్రమథవర్గమున న్నను నొక్కభృత్యునిం
జేయఁగ వేఁడుకొంటి; శశిశేఖరుఁడున్ గరుణాంతరంగుఁడై.

చ. అలయక యింతకాల మిటు లగ్గలమైన తపం బొనర్చి, యి
ప్పొలుపున నన్ను దుర్గవనభూమి సముద్గతపుష్పమాల్యసం
కలనమునన్ భజించితివి; కావున నీ విఁక మాల్యవత్సమా
ఖ్యలలివహించిమద్గణములందు మెలంగుదువొమ్మునాపుడున్.

చ. అతిమలినంబు మర్త్యతను వట్టిత్రొంగి పవిత్రమైన ది
వ్యతనువుఁ దాల్చి యే నపుడ యగ్గిరిజాహృదయేశుఁ

గాల్వఁబోయితి; నిటుమాల్యవంతుఁడనునియ్యభిధానమునాకుఁ
బార్వతీపతికరుణించె; నప్ప్రభుని భక్తజనప్రవణత్వమేమనన్?

శా. ఆనేనీగతి వెండియున్ గిరితనూజానల్పశాపాహతిన్
స్థానభ్రష్టత నొంది యీధర మనుష్యత్వంబుఁ గంటిం గటా!
దీనిన్ నేనును నీవు వీడఁగ మహాదేవోక్త మా తత్కథన్
సానందంబుగఁ జెప్పు మింక గుణాఢ్యా! కాణభూతీ! వెసన్.

శ్రీ శ్రీ శ్రీ

కథాపీఠలంబకమున

సప్తమతరంగము

సమాప్తము.



ఓమ్!

# ఆంధ్ర కథాసరిత్సాగరము.

## కథాపీఠలంబకము. ౧

---:o:---

### అష్టమ తరంగము.

---

క. అనిన గుణాఢ్యునివచనం
బునఁ దద్దివ్యకథఁ గాణభూతి హృదయరం
జనముగ సప్తకథాత్మక
మును, జెప్పె స్వకీయభాష మోదం బెనఁగన్. 1

ఆ.గీ. అంత నాగుణాఢ్యుఁ డక్కథఁ బైశాచి
భాషయంద కావ్యబంధఫక్కి
గ్రంథలక్ష లేడుగాఁ గూర్చి విరచించె
నమర నేడు వత్సరములలోన. 2

వ. ఇవ్విధంబున నమ్మహామహుండు తాను విరచించిన సప్త గ్రంథలక్షాత్మకం బగు నమ్మహాప్రబంధంబు ప్రాణపదం బుగా భావించుచు దాని నమ్మహారణ్య దేశంబున సిద్ధ విద్యాధరాదు లెవ్వరు నెన్నండేని ముచ్చిలకుండ వలయు

నని తలంచియు మఱియు నమ్మహారణ్యమధ్యంబున మషీర
సాభావంబునం జేసియు నాత్మశోణితంబున భూర్జతరుపత్త్ర సం
పుటంబులపై లిఖించి విశ్వశ్రోతృజనశ్రవణపర్వంబుగా విను
పం దొడంగుటయు నా సమయంబున:— 3

గీ. ఆమహాకావ్యమును విన నచటి కపుడు
సిద్ధవిద్యాధరాములుఁ జేరఁ దొడఁగి
రంబరతలంబునకు వితానంబు మాడ్కిఁ
దమవిమానసమూహంబు దళముగాఁగ. 4

వ. అంత:— 5

గీ. కాణభూతి గుణాఢ్యసంగ్రథిత మైన
యమ్మహాకథఁ గనుదోయి నరసినంతఁ
దీవ్రశాపవిముక్తుఁడై దివ్యగతికి
నరిగె నెండియుఁ బూర్వదేహము ధరించి. 6

వ. అదియునుం గాక:— 7

చ. బహుతరసంఖ్య నవ్విపినభాగమునం దల కాణభూతికిన్
సహచరులై మెలంగెడు పిశాచసమూహములెల్ల నమ్మహా
మహ మగు దివ్యసత్కథ శ్రవఃపుటతృప్తిగ నాలకించి త
న్మహిమముచేఁ బిశాచత నవ ద్దివికేఁగి యమర్త్యతం గనెన్.

వ. అంత నమ్మహాకవి యైన గుణాఢ్యుండు తన మనంబున ని
ట్లని తలంచె. 9

ఆ. కాణభూతి దివ్యగతి కేఁగె నాకు ని
క్కథ వచించి; యతని కష్ట ముడిగె;
దీని నే రచించితిని ప్రబంధంబుగా
శివకృపాకటాక్షసిద్ధి కలిమి. 10

గీ. ఇంక నే నీబృహత్కథ నిద్ధరిత్రి
వెలయఁ జేసి ప్రతిష్ఠింపవలయు; నపుడ
కాని శాపావసానంబు గాదు నాకుఁ
బార్వతీదేవి మున్నట్లు పలికెఁ గాదె? 11

క. కావున నే నిపు డియ్యది
యేవిధమున వెల్లడింతు నెవ్వరికడకుం
బోవుదు నెవ్వరి కొసఁగుదు
భూవలయములోనఁ బ్రకటముగ వెలయింపన్? 12

గీ. అనుచుఁ జింతించుచుండఁ దదాశయమ్ముఁ
దెలిసి గుణదేవుఁడును నందిదేవుఁడు నను
నతని శిష్యు లిరువురు నత్యధికభక్తి
వెలయఁ దమ దేశికునితోడఁ బలికి రిట్లు. 13

ఉ. ఈరమణీయకావ్యమణి నీయఁగ నర్హుఁడు సాతవాహన
క్ష్మారమణుం; డతండు కృతిసారవిదుండు విచక్షణత్వవి
ద్యారసికత్వశోభితుఁ డుదారుఁడు; గావున, దీనిసౌష్ఠవం
బారసి సంతసంబు వెలయం గయికో మది నుత్సహించెడిన్.

ఆ. వె. అతఁడు తొల్లి యుష్మదద్భుతప్రతిభాను
లెఱిఁగియున్న యిష్టపరిచితుండు
రసికవరుఁడు దొడ్డరాజన్యుఁడును గానఁ
దెలియనేర్చు యీకృతిన్ గ్రహించు. 15

క. ఆ విభుఁడు గ్రహించినచో
నీ వరకృతి జగతి వెలయు నెల్లెడ భవది
ష్టావాప్తి గ; గాజాదృతిఁగా
దే? వెలయఁగవలయుఁ గృతులు దేశికవర్యా! 16

క. మారుతము వికచసుమన
స్సౌరభము వహింపఁగలుగుచాడ్పునఁ గవితా
సారజ్ఞుండుగదా స్వీ
కారంబొనరించు నుచితకావ్యశ్రేణిన్? 17

గీ. కాన, నీకృతి నమ్మహీజాని కొసఁగు
టర్హ మని పల్కుటయును గుణాఢ్యకవియు
మరలఁ దా నామహీశుసమక్షమునకు
నరుగ మొగమోటపడి సంశయాత్ముఁడగుచు. 18

క. తుద కెటులెటులో శిష్యుల
హృదయాభీష్టప్రకార మీక్షించి ప్రియా
స్పదు లగుతచ్ఛిష్యులచే
నది యా నరనాథుచెంత కనిపె గ్రహింపన్. 19

వ. అట్లు పనిచి తానును వారివెంబడిఁ బ్రతిష్ఠానపురంబున కరిగి
యయ్యంతేవాసుల నిరువురను మాత్రమే రాజదర్శనంబున
కనిచి తాను దత్పురబహిర్భాగంబున నున్న దేవీకృతోద్యా
నంబున నుండునట్లు సంకేతం బొనర్చి తద్వనంబున కరిగి
యుండుటయు నంత నక్కడః— 20

క. గురువరుననుమతిచే న
య్యిరువురు శిష్యులును దన్మహీవల్లభు మం
దిరమునకుఁ బోయి, తమ యి
ద్దఱరాకయుఁ దెలియఁబంచి తద్విభునాజ్ఞన్. 21

వ. తత్సమక్షంబున కరిగి తాము వచ్చినకార్యంబు సవిస్తరం
బుగా విన్నవింపం దలంచి యతనితో నిట్లనిరి:— 22

క. ఇది యస్మద్గురువరుఁడును
విదితయశుఁడు నగుగుణాఢ్యవిబుధుండు రసా
స్పదముగఁ గూర్చిన భవ్య
ప్రద మగుమహనీయకావ్యబంధం బధిపా! 23

గీ. సప్తలక్షప్రమాణంబు సప్తదివ్య
సత్కథాత్మకముచిత పైశాచమయము
దీని నీవు గ్రహించి ధాత్రీతలమున
వెలయఁజేయుము గుణదోషవిద్వరేణ్యా! 24

గీ. కడఁగి యేడేండ్లు తీవ్రదీక్షన్ వహించి
యా యమోఘవచస్కుఁ డీయది రచించి

తనశరీరమ్ములోని రక్తమున దీని
వ్రాసె నక్కానలో మషీరసములేమి. 25

క. ఆ మహితాత్మునికవితా
సామర్థ్యముఁ దత్కృతిప్రశస్తతయుఁ దదీ
యామితపరిశ్రమము నో
భూమీశా! నీవ యెఱుఁగఁబోలుంగాదే? 26

వ. అని పలుకుచు సద్గుణదేవనందిదేవు లమ్మహనీయకావ్యబంధ సంపుటమ్ము నమ్మహీపాలునకుఁ గాన్పించుటయు నంత నతండును:—— 27

గీ. అది పిశాచభాషామయం బైనకబ్బ
మనుచుఁ దలఁచియుఁ దత్పిశాచాకృతులయి
పొలుచుగుణదేవనందిదేవులను గనియుఁ
జిత్తమున నీసడించుచు మత్తుఁ డగుచు. 28

గీ. తనవినూతనపాండిత్యదర్పగరిమఁ
గన్నుగానమిఁ దన్మహాకావ్యమహిమఁ
దెలియనేరక దోషైకదృష్టి యగుచు
నిట్టు లనె వారితో నవహేలనముగ. 29

గీ. గ్రంథపరిమితి యేడులక్షలట! భాష
నీచజనసులభ మగు పైశాచియట్టె!
వ్రాఁత రక్తమయంబట! యీతెఱంగు
కబ్బము లహో! మఱెందేనిఁ గలుగునొక్కొ? 30

క. బహువిధముల మీ యొజ్జలు
మహనీయులె యగుదు రైన మాబోఁటుల కే
యిహపరసాధకమో గా
కహహా! యిటువంటికృతుల కర్హత గలదే? 31

ఆ.వె. కలవు గొప్పగొప్పగ్రంథముల్ సంస్కృత
భాష నుభయలోకఫలదము లిల
నెన్నియేని; వాని నన్నింటిఁ జదివిన
వారమొక్కొ? దీనివంకఁ జూడ. 32

క. మా కేమిటి కీకావ్యము
చేకొని మీగురునికడకు శీఘ్రము చనుఁ డ
య్యా! కడు డస్సితి రీరలు
నీకడకరుదేర; నకట! యేమనవచ్చున్! 33

క. ఈయెడ మే మొనరించిన
దే యొండొకదొనఁగు లే దొకింతయు; మీరే
మీయంత వచ్చినారలు;
పోయెద రామార్గముననె పాత్రముఁ గొనుచున్. 34

ఉ. నావుడు విన్నఁబోవు వదనంబులతో శ్రుతిశూల మైనయా
భూవిభువాక్యధోరణికిఁ బొక్కుచు మా తదియున్ వచింప, క
త్యావిలభావు లై మరలి యక్కట! దేశికుచిత్త మిత్తఱిన్
నోవదె రాజుమాటలని నొక్కి వచింప నటంచు నెంచుచున్.

క. వెలవెలఁబోయెడు వదనం
బులపై హృద్గతవిషాదములు ప్రకటముగాఁ
దలసూప, గురువరేణ్యుఁడు
మెలఁగెడుకడ కేఁగి మెల్లమెల్లని నుడులన్. 36

గీ. తారు పనివిన్నకర్జమ్ముతీరదెల్ల
నతని కెఱిఁగించుటయు విని యామహాత్ముఁ
డవనినాయకదర్శితానాదరమున
కెంతయేనియుఁ దనమదిఁ జింత నొందె 37

క. ప్రాజ్ఞుఁ డగుతేఁడు కృతిసా
రజ్ఞుఁడు సద్విబుధలోకరక్షకుఁడును నై
యజ్ఞునిక్రియ నొనరించు న
వజ్ఞాక్రియ కేబుధుండు వగవకయుండున్? 38

వ. కావున సద్గుణాఢ్యుం డవ్విధంబునఁ జింతాసంతాపదంతురి తాంతఃకరణుం డై విరక్తినొంది నిజశిష్యద్వితయంబుతో నట నుండి వెడలి చని యాప్రాంతంబున నున్న కొండొక మహీధరంబు నధిరోహించి యందొకానొక విచిత్రరమణీయప్రదేశంబున నుపవిష్టుం డై ప్రభుని యాదరణంబు లేని ప్రబంధంబు ప్రజాదరణంబును బడయఁ జాల దని తలంచి తన ముందట నొక్కయగ్నిహోత్రకుండంబు నెలకొనం జేయించి:

సీ. తన్మహాగ్రంథపత్త్రమ్ము లొక్కొకటిగాఁ
దన శిష్యవరులచేతఁ జదివించి

యక్కొండ మీఁది వన్యమృగపక్షిసమూహ
మందందు నెలకొని యాలకింపఁ
గన్నుఁగోనలబాష్పకణములు రాల్చుచుఁ
దన చేతితోడఁ దత్పత్త్రచయము
నయ్యగ్నికుండంబునందు మండెడు వీతి
హోత్రిదేవునకు నాహుతి యొనర్చి

గీ. కడకు గ్రంథలక్షయగు నొక్క కథ నపుడు
తనదు ప్రియశిష్యవరనిరోధమున విడిచె;
ధర నదియె నరవాహనదత్తచరిత మనఁగ
విలసిల్లె మిగుల శ్రావ్యతర మగుచు. 40

సీ. అతఁ డామహాకావ్య మాభంగిఁ జదివించి
కాల్చివైచుచునుండఁగాఁ దదద్రి
శిఖరభాగముల వసించు మాతంగ మ
హిషకురంగాదు లయ్యెడకు వచ్చి
నిశ్చలంబుగఁ జుట్టు నిలిచి మేఁతలుమాని
వినుచు మహానందవివశము లయి
కనులవెంబడి బాష్పకణములు ప్రవహింప
రేపవల్లందె వర్తింపఁదొడఁగె.

గీ. నడవి మృగములకును శ్రావ్య మగుచు ముదము
గడలుకొలిపెడి యమ్మహాకావ్య మట్టు

లగ్ని కాహుతియయ్యె; రాజాదరంబు
గలుగకుండిన నిలుచునే కావ్యసమితి ? 41

గీ. ఆవిధంబుగ నచట గుణాఢ్యవిబుధుఁ
డాత్మకృతి నగ్నిహోత్రున కాహుతి యొన
రించుతఱి సాతవాహన నృపతికి విధి
వశమువలన నస్వాస్థ్యంబు ప్రబలుటయును. 42

వ. రాజవైద్యు లాతని కా యస్వాస్థ్యంబు శుష్కమాంసోపభో
గంబువలన సంభవించి యుండు నని తెలిపిన నది విని యా
భూమిపాలుండు నిజసూపకారులం బిలిపించి తన కట్టి శుష్క
మాంసంబు వండి పెట్టుచుండుటకుఁ గారణం బే మని గట్టిగా
నడిగిన నప్పుడు వార లతని కిట్లనిరి:— 43

ఆ. వె. అడవినుండి లుబ్ధకావళి గొనివచ్చు
మాంసము లివి వాని మంచిచెడుగు
లేమి దెలియనేర్తు మేము మహాప్రభూ!
వారు దెచ్చునాని వంట దక్క. 44

గీ. వేఁటకారులు గొనివచ్చు వివిధమాంస
జాతు లవి తొంటివలెఁగాక సార మెడలి
యుంట సత్యము; వానినే యొకవిధమున
వండి యిడుచుంటి మేలినవారి కధిప ! 45

వ. ఇందు మాదోషంబు లేశంబేనియు లేదు. వేఁటకారులు
శుష్కామిషంబులు గొనివచ్చుటకుఁ గారణంబు విచారింప

వలయు నని విన్నవించుకొనుటయు నంత నారాజు వారల మన్నించి విడిచి లుబ్ధకుల రప్పించి యడిగిన వా రిట్లనిరి. 46

క. దేవా! యిచటికిఁ జేరువ
నే వెలయుచునుండె నొక్క నిబిడారణ్యా
నీవృత మగు పర్వత; మా
తావునఁ గలఁ డొక్క వృద్ధతాపసుఁ డధిపా! 47

ఆ.వె. అతఁడు ప్రతిదినంబు నచ్చోట నొకమహా
గ్రంథ మెదియొ మంచిగంధ్రమైన
యిష్టశిష్యవర్యు లిరువురు సదువఁగా
వించుఁ గనుల నీరు నించుకొనుచు. 48

వ. ఆశిష్యులు సదివిన పత్రంబులెల్ల నగ్నికుండంబునం బడవైచి యాహుతులు సేయుచున్నవాఁ; డది యట్లుండె. 49

క. ఆప్రాంత నున్నయడవుల
లోపల నివసించుమెకములు విచిత్రం! బో
భూపాల! మందలై చని
యాపొత్తము వినుచు నచట నట్టే నిలుచున్. 50

క. మెలఁగవు మేఁతలకై నను
మలగివు జలములకునైన మనుజులఁ గనియున్
గలఁగవు చదు వగుదనుకను
దలఁగవు తన్మునివరేణ్యుదరినుండి నృపా! 51

వ. ఇవ్విధంబున నామృగంబు లన్నియుఁ దదీయగ్రంథశ్రవణా
సక్తివశంబునఁ బరిత్యక్తాహారంబులై యుండుటంజేసి వాని
యామిషంబులు నిస్సారంబులై శుష్కించి యుండనోపు;
మమ్ము సైరింపవలయు నని ప్రార్థించుటయు. 52

గీ. అప్పు డావ్యాధవచనంబు లాలకించి
సాతవాహనవసుమతీజాని మిగుల
వింతపడి తద్విచిత్రంబువిధము నరయఁ
గౌతుకం బుప్పతిల్లఁ దత్క్షణము కదలి. 53

క. తనముందట నామృగయులు
చన నాజ్ఞాపించి వారిసరణిం గొని తా
నును సపరివారముగఁ ద
ద్ఘనగిరిశిఖరంబుఁ జేరఁగా నరిగి యటన్. 54

గీ. గుములుగుములుగఁ జుట్టువారొ్కని సతంబు
నశ్రుపూరితనయనంబులై యనన్య
వృత్తిఁ గర్ణంబులు నిగిడ్చి వేడ్కమీఱఁ
దన ప్రబంధంబు వినెడు సత్త్వములనడుమ. 55

గీ. శాంతి నొందఁగా మిగిలిన శాపవహ్నిఁ
బొడముధూమ్యికలో యన నిడుదజడలు
శీర్షమునమండి మేనిపై జీరువాఱ
నగ్నిసన్నిధి నున్నగుణాఢ్యుఁ గాంచె. 56

గీ. కాంచి యవ్విబుధుని బొల్చి గౌరవమును
భక్తియును మీఱ సాష్టాంగవందనంబు
చేసి, తనకొల్వు విడిచి వచ్చినదిమొదలు
గడచినతదీయచరితంబు నడుగుటయును. 57

ఆ.వె. అంత నాగుణాఢ్యుఁ డాసాతవాహన
ధరణిపతికి నీ కథానకౌర
మెల్ల భూతభాష నెఱిఁగించె సర్వసం
శయములును దొలంగి సంతసింప. 58

వ. పదంపడి యాసాతవాహనమహీపాలుం డయ్యాద్భుతోదం
తంబంతయు సావధానంబుగా నాలకించి యతండు కేవల
మానవమాత్రుండుగాక, ప్రమథగణావతారుం డని యెఱింగి
యజ్ఞానవశంబునఁ దానొనర్చిన యవజ్ఞకు హృదయంబునఁ
బశ్చాత్తాపంబు నొందుచుఁ దదీయపాదావనతుం డై యతని
కిట్లనియె. 59

క. నీవు ప్రమథావతారుఁడ
వీ విశ్వహితప్రబంధ మీక్షింప మహా
దేవముఖోద్భూతజగ
త్పావనదివ్యకథాప్రపంచిత మనఘా! 60

ఉ. నీకృతిగౌరవం బెఱుఁగనేరక నే నకటా ! మహాత్మ ! త
త్స్వీకృతి సేయనైతి మును; చెట్టయొనర్చితి దుర్మదంబునన్

నాకృతమైనదోసము మనంబున నెంచక నను గ్రహించి నీ
వాకథ నాకొసంగు మిపు డంజలిపట్టినవాఁడఁ గైకొనన్.

మ. అని యర్థింపఁగ నాగుణాఢ్యవిబుధాధ్యక్షుండు నాసాతవా
హనభూపాలునితోడ నిట్లనియె "నయ్యా! లోకసంస్తుత్యవ
ర్తన! నే నిప్పుడు నీయభీష్ట మెటుఁదీర్పన్ నేర్తుఁ? గార్యంబుమిం
చెనుగాదే తదుదారకావ్యము నశించెంగాదె నిర్దగ్ధమై. 62

గీ. ఆఱులక్షలపరిమితి నలరుకథల
నాఱిటిని గాల్చివైచితి నకట! యింక
నేకలక్షాత్మకం బైన యిది యొకండె
మిగిలియున్నది కొను మిదే మేదినీశ! 63

వ. ఇంతకంటె నీకు నే నిప్పుడు చేయఁగలిగినది మఱియేది
యును లేదు. 64

క. ఏ రిరువురు నాశిష్యులు
సారజ్ఞులు దీనియర్థసందర్భము లొ
ప్పారఁగ నీ కెఱిఁగింతురు
భూరమణా! యానతిమ్ము పోవుదు నింకన్. 65

గీ. అని నృపతితోడఁ బల్కుచు నాగుణాఢ్యుఁ
డాత్మయోగబలంబున నాశరీర
మును విసర్జించి నిజశాపమోక్ష మగుట
నరిగెఁ దనదివ్యపదమున కాక్షణంబ. 66

వ. అంత నాసాతవాహనమహీపతియు నమ్మహానీయుని దివ్య చరిత్రింబుఁ దలంచికొని యాశ్చర్యంబు నొందుచు:— 67

క. నరవాహన దత్త మహో
చరితాత్మక మై రసజ్ఞజనసేవ్యం బై
వఱలుచు బృహత్కథాఖ్యం
బరఁగెడు తత్కృతి గ్రహించి పరమప్రీతిన్. 68

గీ నగరమున కేఁగి నిజరోగనాశనమున
స్వాస్థ్యమును జెంది యవహితస్వాంతుఁ డగుచుఁ
దద్గుణాఢ్యుని శిష్యులఁ దగినభంగిఁ
గనక మణి వస్త్ర భూషాదికములఁ దనిపి. 69

గీ. వారితోడ్పాటు వడసి యపార మైన
తత్కథ విభక్త మొనరించి తడవతరగ
భంగి వివరింప నతఁడు నాభాషయందు
వెలయ రచియించె నీకథాపీఠి నిట్లు. 70

వ. అయ్యనంతరంబున:— 71

చ. నిరుపమ మై నవీనరసనిర్భర మై దివిషత్కథావళిన్
మఱపుగొనంగఁ జేయుచుఁ గ్రమంబుగఁ దత్కథ నన్నికేక్క-
యాప్పురమున నెల్లెడన్ వినుతిఁ బొందు టెకాక ధరాతలంబునన్
గరముఁ బ్రసిద్ధమై యశముఁ గాంచె ననూనగుణప్రశస్తిచేన్.

క. అక్షయ వైభవ కవితా
దక్షా! సత్కార్యదీక్ష! ధరణీనాథా

ధ్వస్తశిరోభూషణ సూ
ర్యక్షితిపతనూజ! యాశ్రితామరభూజా! 73

ఉ. సాధుకవిత్వలక్షణవిచక్షణ! దీనజనైకరక్షణా!
శోధితకావ్యజాల! పరిశుద్ధమనోజ్ఞ గుణాలవాల! ల
క్ష్మీధరణీసుమిత్ర! గుణచిహ్నిత వేదవతీకళత్ర! గం
గాధరరామరాయ ! కవిగాయకగేయా! మహామహోదయా!

రావువంశాబ్ధి తారాపతీ! సాహితీ
శేవధీ! ధర్మసంసేవనాసక్తధీ
శ్రీనిశేషాంచితా! చిన్నమాంబాసుతా!
దేవరాడ్వైభవా! దివ్యదాత్మోద్భవా! 75

ఇది శ్రీ భారతీ కరుణాకటాక్ష లబ్ధ కవితాభినివేశ సమాసాదిత
శ్రీమత్పీఠికాపురీ మహాసంస్థాన కవీశ్వరత్వ పదవీసమలంక
రిష్ణు లగువేంకటరామకృష్ణులచే విరచితంబైన యాంధ్ర
కథాసరిత్సాగరంబునఁ బ్రథమం బగుకథాపీఠలంబకం
బునం దష్టమ తరంగము సర్వంబును సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ

క. పలుకుల వెలంది యెట్టటు
పలికించిన నట్లు లేను బలికితి దోసఁగుల్
గలిగిన మన్నింపుఁడు పె
ద్దలు రసవత్పదపదార్థతాత్పర్యజ్ఞుల్.